| | |
|---|---|
| గోమేదకం పీతమణౌ కాకోలే పత్రకేఽపి చ, | గోమేదకం—(న) ౧ పీతమణౌ = గోమేధికమాణిక్యము, ౨ కాకోలే=నరకవిశేషము, 3 పత్రకే=మకరికాదిపత్రములు. |
| స్యాద్గోకులికో వలరే పంకస్థగవ్యుపేక్షకే. ౧౮౬ | గోకులికః—(పు) ౧ వలరే=మెల్లకంటివాఁడు, ౨ పంకస్థగవ్యుపేక్షకే = బురదలోనున్న గోవు నుపేక్షించువాఁడు. |
| అథ ఘుర్ఘురికా క్షుద్రఘంటా వాదిత్రదండయోః, | ఘుర్ఘురికా—(స్త్రీ) ౧ క్షుద్రఘంటా=చిఱుగంట, ౨ వాదిత్రదండయోః=వాద్యమువాయించెడికఱ్ఱ. |
| చర్చరీకో మహాకాలే కేశవిన్యాసశాకయోః. ౧౮౭ | చర్చరీకః—(పు) ౧ మహాకాలే=విషముష్టిచెట్టు, ౨ కేశవిన్యాస=ఒకవిధమగుజుట్టుముడి, 3 శాకయోః = చెంచలికూర. |
| చండాలికా కిన్నరాయాముమాయామోషధీభిది, | చండాలికా—(స్త్రీ) ౧ కిన్నరాయాం = చండాలాదులు వాయించు వీణ, ౨ ఉమాయాం=పార్వతి, 3 ఓషధీభిది=ఓషధీభేదము. |
| అథ చాతురకశ్చక్రగండౌ పుంస్యభిధేయవత్. ౧౮౮. గోచరే లోచనస్యాపి చాటుకారే నియంతరి, | చాతురకః—(పు) ౧ చక్రగండౌ=గుండ్రనిదిండు, ౨ లోచనస్యగోచరే = కంటికిఁ గనుపడువాఁడు, (వి. ని) 3 చాటుకారే = ప్రియోక్తులు చెప్పువాఁడు, ౪ నియంతరి=నియామకుఁడు. |
| జర్జరీకం బహుచ్ఛిద్రే జరాతురేఽపి వాచ్యవత్. ౧౮౯ | జర్జరీకం—(న) ౧ బహుచ్ఛిద్రే = జల్లెడ, ౨ జరాతురే = ముదుసలితనముచే శ్రమపడువాఁడు (వి. ని) |
| జీవంతికా గుడూచ్యాం చ జీవాఖ్యశాకవందయోః, | జీవంతికా—(స్త్రీ)౧ గుడూచ్యాం=గుడూచీలత(తిప్పతీఁగె), ౨జీవాఖ్యశాక=నీరుచిట్టిచెట్టు, 3 వందయోః=కరకచెట్టు. |

| | |
|---|---|
| జైవాతృకః పుమాన్ సోమే దీర్ఘాయుః కృశయో స్త్రిషు. | జైవాతృకః—(పు) ౧ సోమే = చంద్రుఁడు, ౨ దీర్ఘాయుః=చిరంజీవి (త్రి), 3 కృశయోః=చిక్కినవాఁడు. |
| తర్తరీకం వహిత్రే స్యాన్న ద్వయోః పారగే త్రిషు, | తర్తరీకం—(న) ౧ వహిత్రే = పడవ, ౨ పారగే=ఒడ్డుదాటినవాఁడు (త్రి). |
| తిక్తశాకస్తు ఖదిరే వరుణే పత్రసుందరే. ౧౯౧ | తిక్తశాకః—(పు) ౧ ఖదిరే=చండ్రచెట్టు, ౨ వరుణే=ఉలిమిరిచెట్టు, 3 పత్రసుందరే=ఆకుపసందుచెట్టు. |
| త్రివర్ణకం గోక్షురకే త్రిఫలాయాం కటుత్రికే, | త్రివర్ణకం—(న) ౧ గోక్షురకే=ఏనుఁగుపల్లేరు, ౨ త్రిఫలాయాం = కరకతాడి ఉసిరికలు, 3 కటుత్రికే = శొంఠి, మిరియాలు, పిప్పలి. |
| దలాఢకః స్వయం జాతతిలే పృశ్న్యాం చ గైరికే. ౧౯౨ ఫేనఖాతకయో ర్నాగకేసరే చ మహత్తరే, | దలాఢకః—(పు) ౧ స్వయంజాతతిలే = స్వయముగా మొలచిన తిలవృక్షము, ౨ పృశ్న్యాం=తూటికూర. 3 గైరికే=గైరికాదిధాతువు, ౪ ఫేన=నురుగు, ౫ ఖాతక=కందకము, ౬ నాగకేసరే=నాగకేసరవృక్షము, ౭ మహత్తరే = గొప్పవాఁడు. |
| దందశూకస్తు పుంలింగో రాక్షసే చ సరీసృపే. ౧౯౩ | దందశూకః—(పు) ౧ రాక్షసే = రాక్షసుఁడు, ౨ సరీసృపే=సర్పము. |
| దాసేరకస్తు కరభే దాసీపుత్రే చ ధీవరే, | దాసేరకః—(పు) ౧ కరభే=ఒంటెపిల్ల, ౨ దాసీపుత్రే=దాసీపుత్రుఁడు, 3 ధీవరే=పల్లెవాఁడు. |
| నియామకః కర్ణధారే పోతవాహే నియంతరి. ౧౯౪ | నియామకః—(పు) ౧ కర్ణధారే = నావికుఁడు, ౨ పోతవాహే=ఓడతండేలు, 3 నియంతరి=నియామకుఁడు |
| నిశ్చారకః పురీషస్య క్షయే స్వైరే సమీరణే, | నిశ్చారకః—(పు)౧ పురీషస్యక్షయే=అమేధ్యముయొక్కనాశనము,౨స్వైరే=స్వేచ్ఛగలవాఁడు,3సమీరణే=వాయువు. |

నిర్గ్రంథకః స్యాత్ క్షపణే
నిష్ఫలేఽప్యపరిచ్ఛదే. ౧౯౪

నిర్గ్రంథకః—(పు) ౧ క్షపణే = సన్యాసి, ౨ నిష్ఫలే=ఫలరహితము, ౩ అపరిచ్ఛదే=భూషణరహితమైనది.

ప్రచలాకః శరాఘాతే శిఖం
డే చ భుజంగమే,

ప్రచలాకః—(పు) ౧ శరాఘాతే = బాణముదెబ్బ, ౨ శిఖండే=నెమలిజుట్టు, ౩ భుజంగమే=సర్పము.

ప్రకీర్ణకం చామరే స్యా ద్వి
స్తారే నా తురంగమే.

ప్రకీర్ణకం—(న) ౧ చామరే = వింజామరము, ౨ విస్తారే=విస్తారము, ౩ తురంగమే=గుఱ్ఱము (పు).

పంచాలికా స్త్రియాం వస్త్ర
పుత్త్రికా గీతిభేదయోః,

పాంచాలికా—స్త్రీ౧ వస్త్రపుత్త్రికా=గుడ్డతోఁజేసినబొమ్మ, ౨ గీతిభేదయోః = రాగభేదము.

స్యాత్పిప్పలకంవక్షోజ వృంతే
సీవనసూత్రకే. ౧౯౫

పిప్పలకం—(న) ౧ వక్షోజవృంతే= స్తనములవట్రువ, ౨ సీవనసూత్రకే = కుట్టుటకుపయోగించుదారము.

పిండీతకం స్యాత్తగరే మద
నాఖ్యమహీరుహే,

పిండీతకః—(పు) ౧ తగరే = దేవదారురసముతోఁ జేసిన ధూపద్రవ్యము, ౨ మదనాఖ్యమహీరుహే=మంగచెట్టు.

అథ పుష్కలకో గంధమృగే
క్షపణకీలయోః. ౧౯౬

పుష్కలకః—(పు) ౧ గంధమృగే = కస్తూరిమృగము, ౨ క్షపణ = బౌద్ధభిక్షుకుఁడు, ౩ కీలయోః=సీల.

పుండరీకం సితాంభోజే సిత
ఛత్రే చ భేషజేపుంసి వ్యా
ఘ్రేఽగ్నిదిఙ్నాగే కోశకా
రాంతరేఽపి చ. ౧౯౯

పుండరీకం—(న) ౧ సితాంభోజే= తెల్లతామరపూవు, ౨ సితఛత్రే = తెల్లగొడుగు, ౩ భేషజే = ఔషధము, ౪ వ్యాఘ్రే= పెద్దపులి,(పు) ౫ అగ్నిదిఙ్నాగే=ఆగ్నేయదిగ్గజము,౬ కోశకారాంతరే = కొబ్బరిచెట్టు మధ్యభాగము.

భవేత్పూర్ణానకం వర్ధాపనేచ
పటహేఽపి చ,

పూర్ణానకం—౧ వర్ధాపనే=మంగళద్రవ్యములుంచు పాత్రము, ౨ పటహే = తప్పెట,

| | |
|---|---|
| ఫర్పరీకశ్చపేటే స్యాత్పఫరీకం తు షార్దవే. ౨౦౦ | పర్పరీకః—(పు) ౧ చపేటే = చెంపదెబ్బ, ౨ మార్దవే=మెత్తదనము (న). |
| వలాహకో గిరౌ మేఘే దైత్యనాగవిశేషయోః, | వలాహకః—(పు) ౧ గిరౌ = కొండ, ౨ మేఘే = మేఘము, 3 దైత్యనాగవిశేషయోః = దైత్యవిశేషము, ౪ నాగవిశేషము. |
| వరాటకః పద్మబీజకోశే రజ్జౌ కపర్దకే. ౨౦౧ | వరాటకః—(పు) ౧ పద్మబీజకోశే = తామరపూవులోని గద్దె, ౨ రజ్జౌ = త్రాడు, 3 కపర్దకే=గుడ్డిగవ్వ. |
| బకేరుకా బలాకాభిద్వాతావర్జితశాఖయోః, | బకేరుకా—(స్త్రీ) ౧ బలాకాభిత్=బెగ్గురుపక్షిలోభేదము, ౨ వాతావర్జితశాఖయోః=గాలిచే వంగినకొమ్మ. |
| వరండకస్తుమాతంగవేద్యాం యౌవనకంటకే. ౨౦౨. వర్తులేఽథ | వరండకః—(పు) ౧ మాతంగవేద్యాం = రావిచెట్టుయొక్క యరుగు, ౨ యౌవనకంటకే=యువకుని బుగ్గలపై లేచిన కురుపు, 3 వర్తులే=గుండ్రమైనది. |
| వాణిజకో బాడబాగ్నౌ వణిజ్యపి, | వాణిజకః—(పు) ౧ బాడబాగ్నౌ = బడబాగ్ని, ౨ వణిజి=వర్తకుఁడు. |
| బృందారకః సురే పుంసి మనోజ్ఞ శ్రేష్ఠయోస్త్రిషు. | బృందారకః—(పు) ౧ సురే = దేవత, ౨ మనోజ్ఞ=మనోహరమైనది, (త్రి) శ్రేష్ఠయోః=శ్రేష్ఠమైనది. |
| అథ భ్రమరకో భృంగే గిరికే చాలకాంతరే, | భ్రమరకః—(పు) ౧ భృంగే = తుమ్మెద, ౨ గిరికే = చుంచుఎలుక, 3 అలకాంతరే=నొసలిపైఁగల ముంగురులు. |
| భట్టారకో నృపే నాట్యవాచా దేవే తపోధనే. ౨౦౪ | భట్టారకః—(పు) ౧ నాట్యవాచాన్నృపే =నాటకములోని రాజుపేరు, ౨ దేవే = దేవుఁడు, తపోధనే = మునీశ్వరుఁడు. |
| భయానకస్స్మృతో వ్యాఘ్రే రసే రాహౌ భయంకరే, | భయానకః—(పు) ౧ వ్యాఘ్రే = పెద్దపులి, ౨ రసే = భయానకరసము, 3 |

| | |
|---|---|
| | రాహౌ=రాహువు, ౨ భయంకరే = భయంకరుఁడు. |
| భార్యాటికః పుమాన్ భార్యానిర్జితే హరిణాన్తరే. | భార్యాటికః—(పు) ౧ భార్యానిర్జితే = భార్యకులొంగినవాఁడు, ౨ హరిణాంతరే=ఒకవిధమగుజింక. |
| భవేన్మరువకః పుష్పవిశేషే మదనద్రుమే, | మరువకః—(పు) ౧ పుష్పవిశేషః = ఒకానొకపూవు, ౨ మదనద్రుమే = మంగవృక్షము |
| మండూకదకం చిత్రరాగే క్లీబమాతర్పణేఽపి చ. ౨౧౬ | మండూకదకం—(న) ౧ చిత్రరాగే = చిత్తరువురంగు, ౨ ఆతర్పణే = చల్లతేట. |
| భవేన్మండలకం బింబే కుష్ఠభేదే చ దర్పణే, | మండలకం—(న) ౧ బింబే = సూర్యాదిబింబము, ౨ కుష్ఠభేదే = కుష్ఠురోగవిశేషము (తెల్లకుష్ఠు), 3 దర్పణే = అద్దము. |
| అథ మర్కటకః సస్యభేదే వానరలూతయోః. ౨౦౭ | మర్కటకః—(పు) ౧ సస్యభేదే = ఒకానొకపైరు, ౨ వానరః=కోఁతి, 3 లూతయోః=సాలెపురుగు. |
| మయూరకోఽప్యపామార్గే క్లీబం తుత్థాంజనే పునః, | మయూరకః—(పు) ౧ అపామార్గే=ఉత్తరేణు, ౨ తుత్థాంజనే=మైలతుత్తము. (న) |
| మాణవకో హారభేదే బాలే కుపురుషేఽపి చ. ౨౧౮ | మాణవకః—(పు) ౧ హారభేదే=హారవిశేషము, ౨ బాలే=పిల్లవాఁడు, 3 కుపురుషే=కుత్సితుఁడు. |
| మృష్టేరుకో వదాన్యేఽపి మిష్టాశిన్యతిథిద్విషి, | మృష్టేరుకః—(పు) ౧ వదాన్యే = దాత, ౨ మిష్టాశిని=మృష్టాన్నము తినువాఁడు, 3 అతిథిద్విషి=అతిథుల ద్వేషించువాఁడు. |
| రతర్థికం స్యాద్దివసే సుఖస్థానేఽష్టమంగళే ౨౦౯ | రతర్థికం—(న) ౧ దివసే=పగలు, ౨ సుఖస్థానే=సుఖమైనతావు, 3 అష్టమం |

| | |
|---|---|
| | గళే = ఎనిమిదివిధములగు మంగళములు. |
| రాథరంకః పుమాన్ సీరే సీరకే చ ఘనోపలే, | రాథరంకః—(పు) ౧ సీరే=నాఁగలి, ౨ సీరకే=శింశుమారము, 3 ఘనోపలే = వడగల్లు. |
| లాలాటికః ప్రభోర్భావదర్శిన్యాశ్లేషణాంతరే. ౨౧౦ కార్యాక్షమే | లాలాటికః—(పు) ౧ ప్రభోః భావదర్శిని = రాజుభావము గ్రహించువాఁడు, ౨ ఆశ్లేషణాంతరే = ఆలింగనభేదము, 3 కార్యాక్షమే=పనిచేతగానివాఁడు. |
| లేఖనికః కథితో లేఖహారకే, లేఖేషు పరహస్తేన స్వహస్తేన చ లేఖకే. ౨౧౧ | లేఖనికః—(పు) ౧ లేఖహారకే = జాబులు తెచ్చువాఁడు. ౨ లేఖేషు పరహస్తేన లేఖకే=ఉత్తరములు పరులచే వ్రాయించువాఁడు, 3 స్వహస్తేన లేఖకే=సొంతముగా లేఖలు వ్రాయువాఁడు. |
| వర్తరూకో నదీభేదే కాకనీడే జలావటే, | వర్తరూకః—(పు) ౧ నదీభేదే = నదీవిశేషము, ౨ కాకనీడే = కాకిగూడు, 3 జలావటే = నీటిగుంట |
| వినాయకస్తు హేరంబే తార్క్ష్యే విఘ్నే జినే గురౌ. | వినాయకః—(పు) ౧ హేరంబే=విఘ్నేశ్వరుఁడు, ౨ తార్క్ష్యే=గరుత్మంతుఁడు, 3 విఘ్నే=విఘ్నము, ౪ జినే=బుద్ధుఁడు, ౫ గురౌ=గురువు. |
| వితున్నకస్తు ధాన్యాకే ఝూటామలమయూరకే, | వితున్నకః—(పు) ౧ ధాన్యాకే=దనియాలు, ౨ ఝూటామల=నేల ఉసిరిక, 3 మయూరకే=మైలతుత్తము. |
| విశేషకోఽస్త్రీ తిలకే విశేషయితరి త్రిషు. ౨౧3. | విశేషకః—(పు) ౧ తిలకే=బొట్టు, ౨ విశేషయితరి = విశేషింపఁజేయువాఁడు, (త్రి). |
| విదూషకశ్చాటుపటౌ పరనిందాకరేఽపి చ, | విదూషకః—(పు) ౧ చాటుపటౌ=విదూషకుఁడు, ౨ పరనిందాకరే = ఇతరుల నిందించువాఁడు. |

| | |
|---|---|
| వైనాశికః స్యాత్ క్షణికే పరతన్త్రోర్ణనాభయోః. | వైనాశికః—(పు) ౧ క్షణికే=క్షణభంగురము, ౨ పరతంత్రే=పరాధీనుఁడు, 3 ఊర్ణనాభయోః=సాలెపురుగు. |
| వైదేహకో వాణిజకే శూద్రాద్వైశ్యాసుతేఽపి చ, | వైదేహకః—(పు) ౧ వాణిజకే=వర్తకుఁడు, ౨ శూద్రాద్వైశ్యాసుతేఽపిచ = శూద్రునివలన వైశ్యస్త్రీకిఁ బుట్టినవాఁడు |
| వైతాలికః పుమాన్ ఖేటితాలే బోధకరే త్రిషు. | వైతాలికః—(పు) ౧ ఖేటితాళే=వైతాళికుఁడు, ౨ బోధకరే=మేలుకొలుపువాఁడు (త్రి). |
| శతానీకస్తు బృందే స్యాన్మణిరాజప్రభేదయోః, | శతానీకః—(పు) ౧ బృందే = సమూహము, ౨ మణిరాజప్రభేదయోః=మణివిశేషము, 3 రాజభేదము. |
| శాలావృకః శృగాలే స్యాత్సారమేయే వలీముఖే. | శాలావృకః—(పు) ౧ శృగాలః = నక్క, ౨ సారమేయే=కుక్క, 3 వలీముఖే=కోఁతి. |
| శిలాటకః పుమానట్టే విలేపే పరికీర్తితః, | శిలాటకః—(పు) ౧ అట్టే=బురుజు, ౨ విలేపే=పూఁతపూయుట. |
| శృగాలికా శివాయాం స్యాత్త్రాసాదపి పలాయనే. ౨౧౭ | శృగాలికా—(స్త్రీ) ౧ శివాయాం = ఆఁడునక్క, ౨ త్రాసాదపి పలాయనే=భయముచేఁ బరుగెత్తుట. |
| శృంగాటకం భవేద్ద్వారి కంటకే చ చతుష్పథే, | శృంగాటకం—(న) ౧ ద్వారి=ద్వారము, ౨ కంటకే=ముల్లు, 3 చతుష్పథే = నాల్గుత్రోవలు కలియుచోటు. |
| సంతానికాపి క్షీరాదిసారే మర్కటజాలకే. ౨౧౮ | సంతానికా—(స్త్రీ) ౧ క్షీరాదిసారే=మీఁగడ, ౨ మర్కటజాలకే=సాలెపురుగుమగ్గము. |
| సందంశికాపి సుచటీలోహయంత్రవిశేషయోః, | సందంశికా—(స్త్రీ) ౧ సుచటీ=పటుకారు, ౨ లోహయంత్రవిశేషయోః=లోహముతోఁ జేసిన యొకయంత్రము. |

సంచారికాతు యుగలే కుట్టనీఘ్రాణయోరపి. ౨౧౯

సంచారికా—(స్త్రీ) ౧ యుగలే=జంట, ౨ కుట్టనీ=తార్పుకత్తె, ౩ ఘ్రాణయోః = ముక్కు.

సంఘాటికా స్త్రియాం యుగ్మే కుట్టన్యాం జలకంటకే,

సంఘాటికా—(స్త్రీ) ౧ యుగ్మే=జంట, ౨ కుట్టన్యాం=తార్పుకత్తె, ౩ జలకంటకే = మొసలి.

సుప్రతీకశ్శోభనాంగే భవేదీశానదిగ్గజే. ౨౨౦

సుప్రతీకః—(పు) ౧ శోభనాంగే=చక్కని దేహముగలవాఁడు, ౨ ఈశాన్యదిగ్గజే =ఈశాన్యదిక్కునందుఁగల యేనుఁగు.

అథ సైకతికం మాతృయాత్రామంగలసూత్రకే, నాసన్న్యస్తే క్షపణకే త్రిషు సందేహజీవిని. ౨౨౧

సైకతికం—(న) ౧ మాతృయాత్రా = దేవీయాత్ర, ౨ మంగలసూత్రకే = మంగళసూత్రము, ౩ సన్న్యస్తే=సన్న్యసించినవాఁడు, (పు) ౪ క్షపణకే=బౌద్ధభిక్షుకుఁడు, ౫ సందేహజీవిని = సంశయముతోఁ బ్రదుకువాఁడు (త్రి).

సోమవల్కస్తు ధవళకదరే కట్ఫలేఽపి చ

సోమవల్కః—(పు) ౧ ధవళకదరే=తెల్లతుమ్మచెట్టు, ౨ కట్ఫలే=గుమ్ముడుటేకుచెట్టు.

సౌగంధికం తు కల్హారే పద్మరాగేఽపి కత్తృణే. ౨౨౨. పుంలింగో గంధపాషాణే సుగంధవ్యవహారిణి,

సౌగంధికం—(న) ౧ కల్హారే=తావిగల కలువపూవు, ౨ పద్మరాగే = కెంపు, ౩ కత్తృణే=కామంచిగడ్డి, ౪ గంధపాషాణే=ఒకవిధమగు కెంపు, (పు) ౫ సుగంధవ్యవహారిణి = సువాసనగలది.

## కపంచకం.

అయిదక్షరములుగల కకారాంత శబ్దములు.

అనేడమూక ఉద్దిష్టశ్శఠే వాక్ఛ్రుతివర్జితే. ౨౨౩

అనేడమూకః—(పు) ౧ శఠే=దుష్టుఁడు, ౨ వాక్ఛ్రుతివర్జితే = మూఁగతనము చెవుడుగలవాఁడు.

స్యాదాచ్ఛురితకం హాసనఖరాఘాతభేదయోః, — ఆచ్ఛురితకం—(న) ౧ హాసభేద = నవ్వుయొక్క భేదము, ౨ నఖరాఘాతభేదయోః=నఖక్షతముయొక్క భేదము.

ఉపకారికోపకర్త్ర్యాంపిష్టభేదే నృపాలయే. ౨౨౪ — ఉపకారికా—(స్త్రీ) ౧ ఉపకర్త్ర్యాం=ఉపకారముచేయునది, ౨ పిష్టభేదే=బంకయొక్క ప్రభేదము, 3 నృపాలయే = డేరా.

కఞ్చుకేకక ఇత్యేషశ్శుద్ధాంతోద్యానపాలయోః, రఙ్గాజీవే కణే ఖడ్గే ద్వాఃస్థేఽథ — కఞ్చుకేకకః—(పు) ౧ శుద్ధాంతపాలే=అంతఃపురపరిపాలకుఁడు, ౨ ఉద్యానపాలే=ఉద్యానపాలుఁడు, 3 రంగాజీవే=నటుఁడు, ౪ కణే=బాణము, ౫ ఖడ్గే=ఖడ్గము, ౬ ద్వాఃస్థే=ద్వారపాలకుఁడు.

కటఖాదకః. ౨౨౫. ఖాదకే కాచకలశే బలిపుష్టే చ జంబుకే, — కటఖాదకః—(పు) ౧ ఖాదకే=భక్షించువాఁడు, ౨ కాచకలశే=గాజుకుండ, 3 బలిపుష్టే=కాకి, ౪ జంబుకే=నక్క.

కృమికంటకం తు చిత్రాంగవిడంగోదుంబరేషు చ. — కృమికంటకం—(న) ౧ చిత్రాంగ = రక్తచిత్రమూలము, ౨ విడంగ = వాయులవంగము, 3 ఉదుంబరేషు = మేడిచెట్టు.

గోజాగరికం మంగలే పుంసి స్యాత్కంటకారకే, — గోజాగరికం—(న) ౧ మంగలే = మంగళము, ౨ కంటకారకే = వాకుడుచెట్టు, (పు.)

చిలమీలికా తు కంఠీభేదే ఖద్యోతవిద్యుతోః. ౨౨౬ — చిలమీలికా—(స్త్రీ) కంఠీభేదే=నాను మొదలయిన కంఠాభరణము, ౨ ఖద్యోతే=మిణుగురుబూచి, 3 విద్యుతి=మెరుపు.

అథో జలకరంకే స్యాన్నాలికేరఫలేఽంబుజే, శంఖే జలలతాయాం చ వారివాహే చ కీర్తితః. ౨౨౭ — జలకరంకః—(పు) ౧ నాలికేరఫలే=కొబ్బరికాయ, ౨ అంబుజే=పద్మము, 3 శంఖే=శంఖము, ౪ జలలతాయాం=తరంగము, ౫ వారివాహే=మేఘము.

| | |
|---|---|
| జలతాపిక ఇల్లీసకాకేచీ ఝషయోశ్చ పుంసి స్యాత్, | జలతాపకః—(పు) ౧ ఇల్లీస=ఇల్లీసమత్స్యము, ౨ కాకేచీఝషయోః = కాకేచిమత్స్యము. (పు.) |
| నవఫలికా స్త్రీ నవ్యే నవజాతరజోఽంగనాయాం చ. | నవఫలికా—(స్త్రీ) ౧ నవ్యే=నవీనమైనది, ౨ నవజాతరజోఽంగనాయాం=నూతనముగా రజస్వలయయిన ఆఁడుది. |
| నాగవారిక ఉద్దిష్టో రాజకుంజరహస్తిపే, గణస్థరాజే గరుడే చిత్రమేఖలకేఽపి చ. | నాగవారికః—(పు) ౧ రాజకుంజరహస్తిపే=రాజుసంబంధమైనఏనుఁగపైనుండు మావటివాఁడు, ౨ గణస్థరాజే=గణమునందుండు రాజు, ౩ గరుడే = గరుత్మంతుఁడు, ౪ చిత్రమేఖలకే=నెమలి. గణమనఁగా ఇరువదియేడుగజములు, ఇరువదియేడు రథములు, ఎనుబదియొక గుఱ్ఱములు, నూటముప్పదియైదు భటులు గల సైన్యము. |
| స్యాద్వ్రీహిరాజికః కంగుధాన్యచీనకధాన్యయోః, | వ్రీహిరాజికః—(పు) ౧ కంగుధాన్య = కొఱ్ఱలు, ౨ చీనకధాన్యయోః=చీనకమను ధాన్యము. |
| వ్యవహారికా స్యాల్లోకయాత్రాసంమార్జనీంగుదే. ౨౩౧ | వ్యవహారికా—(స్త్రీ) ౧ లోకయాత్రా = లోకనడవడిక, ౨ సమ్మార్జన = చీపురుకట్ట, ౩ ఇంగుదే = తాపసవృక్షము, ౪ అనఁగా కానుగ. |
| శతపర్వికా తు దూర్వాయాం వచాయామపి యోషితి, | శతపర్వికా—(స్త్రీ) ౧ దూర్వాయాం = గఱికగడ్డి, ౨ వచాయాం = నల్లవస, (స్త్రీ). |
| శీతచంపక ఇత్యేష స్యాదాదర్పణదీపయోః. ౨౩౨ | శీతచంపకః—(పు) ౧ ఆదర్పణ=అద్దము, ౨ దీపయోః=దీపము. |
| సువసంతక ఉద్దిష్టో వాసంత్యాం మదనోత్సవే, | సువసన్తకం—(పు) ౧ వాసన్త్యాం=పూలగురివెంద, ౨ మదనోత్సవే=వసన్తోత్సవము (అనఁగా మన్మథోత్సవము.) |

స్యాద్ధేమపుష్పికా యూథ్యాం
చంపకే హేమపుష్పకః.

హేమపుష్పికా—(సీ) ౧ యూథ్యాం=అడవిమొల్ల.
హేమపుష్పకః—(పు) ౧ చంపకే=చంపక వృక్షము

---

## కషట్కం.

గ్రామమద్గురికా గ్రామయుద్ధే శృంగీఝషే స్త్రియామ్,

మదనశలాకా కామోద్దీపక భైషజ్యసారికయోః ౨౩౪

మాతులపుత్త్రక ఇత్యపి మామకతనయే ఫలేచ ధూర్తస్య,

వర్ణవిలోడక ఏవ శ్లోకస్తేనే చ సంధిచౌరే చ. ౨౩౫

సిందూరతిలక ఉక్తో మతంగజే స్త్రీతు కామిన్యాం.

ఇతి కాంతవర్గము.

ఆఱుయక్షరములుగల కకారాన్తశబ్దములు.

గ్రామమద్గురికా—(సీ) ౧ గ్రామయుద్ధే=గ్రామకలహము, ౨ శృంగీఝషే=మద్గురమనుమత్స్యస్త్రీ.

మదనశలాకా—(సీ) ౧ కామోద్దీపకభైషజ్య=కామోద్దీపకమగు ఔషధము, ౨ సారికయోః=గోరువంక.

మాతులపుత్త్రకః—(పు) ౧ మామకతనయే=మేనమామకొడుకు, ౨ ధూర్తస్య ఫలే=ఉమ్మెత్తకాయ.

వర్ణవిలోడకః—(పు) ౧ శ్లోకస్తేనే=శ్లోకముదొంగ, ౨ సంధిచౌరే = సంధిచోరుఁడు

సిందూరతిలకః—(పు) ౧ మతంగజే = ఏనుఁగు, ౨ కామిన్యాం=కామిని.(సీ).

ఇది కకారాంతవర్గము.

---

## ఖైకం

ఖమింద్రియే పురే క్షేత్రే శూన్యే బిందౌ విహాయసి, సంవేదనే దేవలోకే కర్మణ్యపి నపుంసకం. ౧

ఏకాక్షర ఖశబ్దములు.

ఖం—(న)౧ఇంద్రియే=నేత్రాదీంద్రియము, ౨ పురే = పట్టణము, ౩ క్షేత్రే= క్షేత్రము, ౪ శూన్యే = శూన్యము, ౫ బిందౌ = సున్న, ౬ విహాయసి=ఆకాశము, ౭ సంవేదనే = తెలియుట, ౮ దేవలోకే=స్వర్గలోకము, ౯ కర్మణి = కర్మ. (న)

## ఖ ద్వికమ్.

నఖీ స్త్రీక్లీబయోశ్శక్తౌ నఖరే పున్నపుంసకం,

న్యంఖః సమ్యజ్మనోజ్ఞే చ సామ్నః షట్ప్రణవేషు చ.

ప్రేంఖాపర్యటనే ఒప్యశ్వగతౌ సంవేశనాంతరే,

ముఖం నిస్సరణే వక్త్రే ప్రారంభోపాయయోరపి. 3. సంధ్యంతరే నాటకాదేః శబ్దే ఒపి చ నపుంసకే,

లేఖో లేఖ్యే సురే

లేఖాలిపిరాజికయోర్మతా. ౪

రింఖాశ్వగతిభేదే ఒపి శూకశింబ్యాం చ నర్తనే

శంఖః కంబౌ న యోషిన్నా భాలాస్థినిధిభిన్న ఖే. ౫

## రెండక్షరములుగల ఖకారాంత శబ్దములు.

నఖీ—(స్త్రీ) ౧ శక్తౌ=శక్తి, ౨ నఖరే = గోరు (పు)

న్యంఖః—(పు) ౧ సమ్యక్ = సత్యవచనుఁడు, ౨ మనోజ్ఞే = మనోహరుఁడు, 3 సామ్నః షట్ప్రణవేషుచ = సామవేదమున ఆరు ప్రణవములు.

ప్రేంఖా—(స్త్రీ) ౧ పర్యటనే = తిరుగుట, ౨ అశ్వగతౌ=గుఱ్ఱపునడక, 3 సంవేశనాంతరే=రతిబంధవిశేషము.

ముఖం—(న) ౧ నిస్సరణే = బయలువెడలుట, ౨ వక్త్రే = ముఖము, 3 ప్రారంభ = ఆరంభము, ౪ ఉపాయయోః = ఉపాయము, ౫ నాటకాదేః సంధ్యంతరే = నాటకాదుల యొక్క సంధివిశేషము, ౬ శబ్దే = శబ్దము. (న)

లేఖః—(పు) ౧ లేఖ్యే=జాబు, ౨ సురే = దేవుఁడు.

లేఖా—(స్త్రీ) ౧ లిపి=అక్షరము, ౨ రాజికయోః=నల్లావాలు (స్త్రీ).

రింఖా—(స్త్రీ) ౧ అశ్వగతిభేదే = అశ్వగతిభేదము, ౨ శూకశింబ్యాం = దూలగొండిచెట్టు, 3 నర్తకే = నర్తనము.

శంఖః—(పు) ౧ కంబౌ = శంఖము, ౨ భాలాస్థి= ఫాలప్రదేశముననున్న ఎముక, (పు) 3 నిధిభిత్=నిధిభేదము, ౪ నఖే=గోరు. (పు)

శాఖా కక్ష్యాంతరే బాహౌ వేదభాగద్రుమాంగయోః,

శాఖా—(స్త్రీ) ౧ కక్ష్యాంతరే=కక్ష్యావిశేషము, ౨ బాహౌ = బాహువు, 3 వేదభాగ=వేదభాగము, ౪ ద్రుమాంగయోః=కొమ్మ.

శిఖా శాఖా బర్హిచూడా లాంగలిక్యగ్రమాత్రకే. ౬. చూడామాత్రే శిఖాయాం చ జ్వాలాయాం ప్రపదేఽపి చ,

శిఖా—(స్త్రీ) ౧ శాఖా=కొమ్మ, ౨ బర్హిచూడా = నెమలిజుట్టు, 3 లాంగలిక్యగ్రమాత్రకే = దూలగొండిచెట్టుకొన, ౪ చూడామాత్రే = జుట్టు, ౫ శిఖాయాం = కొన, ౬ జ్వాలాయాం=అగ్నిజ్వాల, ౭ ప్రపదే=పాదాగ్రము.

సఖా మిత్రే సహాయేనా వయస్యాయాం సఖీ మతా. ౭

సఖా—(పు.) ౧ మిత్రే=స్నేహితుఁడు, ౨ సహాయే=సహాయము, (పు) 3 వయస్యాయాం=చెలికత్తె, (స్త్రీ) సఖీ.

సుఖం శర్మణి నాకే చ సుఖా పుర్యాం ప్రచేతసః,

సుఖం—(న) ౧ శర్మణి=సుఖము, ౨ నాకే=స్వర్గము, సుఖా—(స్త్రీ) 3 ప్రచేతసః పుర్యాం=వరుణునిపట్టణము.

---

## ఖత్రికం.

## మూఁడక్షరములుగల ఖకారాంతశబ్దములు.

గోముఖం కుటిలాగారే వాద్యభాండే చ లేపనే. ౮. పుంసి మాతలిపుత్రే చ మహాదేవగణాంతరే,

గోముఖం—(న) ౧ కుటిలాగారే, కుటిలమగుగృహము, ౨ వాద్యభాండే = వాద్యభాండము, 3 లేపనే = ఇల్లు అలుకుట ౪ మాతలిపుత్రే = మాతలిపుత్రుఁడు, (పు) ౫ మహాదేవగణాంతరే = ఈశ్వరగణవిశేషము.

త్రిశిఖో రాక్షసే క్లీబం త్రిశూలే మండలాంతరే. ౯.

త్రిశిఖః—(పు) ౧ రాక్షసే = రాక్షసుఁడు, ౨ త్రిశూలే = త్రిశూలము, (న) 3 మండలాంతరే = మండలవిశేషము.

దుర్ముఖః కపిభిన్నాగభిదోర్న్నా ముఖరే త్రిషు,

దుర్ముఖః—(పు) ౧ కపిభిత్=కపివిశేషము, ౨ నాగభిదోః=గజవిశేషము, ౩ ముఖరే=వదురుబోతు. (త్రి)

ప్రముఖః ప్రథమే శ్రేష్ఠే

ప్రముఖః—(పు) ౧ ప్రథమే = ప్రథముఁడు, ౨ శ్రేష్ఠే=శ్రేష్ఠుఁడు.

మయూఖః కరణేఽపి చ. ౧౦. జ్వాలాయామపి శోభాయాం

మయూఖః—(పు) ౧ కిరణే=కిరణము, ౨ జ్వాలాయాం=జ్వాల, ౩ శోభాయాం=శోభ.

విశిఖస్తోమరే శరే,

విశిఖః—(పు) ౧ తోమరే = చిల్లకోల యను ఆయుధవిశేషము, ౧ శరే = బాణము.

విశిఖా తు ఖనిత్ర్యాం చ రథ్యానలికయోరపి. ౧౧

విశిఖా—(స్త్రీ) ౧ ఖనిత్ర్యాం=గుద్దలి, ౨ రథ్యా=బజారు, ౩ నలికా=తుపాకి.

విశాఖస్తర్కకే స్కందే త్రియామృక్షే కశిల్లకే,

విశాఖః—(పు) ౧ తర్కకే=ఆలోచనము చేయువాఁడు, ౨ స్కందే = కుమారస్వామి, ౩ ఋక్షే = నక్షత్రభేదము, (స్త్రీ) ౪ కశిల్లకే=కాకరచెట్టు

వైశాఖో మాసభేదేఽపి మంథానే చ ప్రకీర్తితః. ౧౨

వైశాఖః—(పు) ౧ మాసభేదే=ఒకనెల, ౨ వైశాఖము=కవ్వము.

సుముఖస్తార్క్ష్యతనయే శాకనాగప్రభేదయోః,

సుముఖః—(పు) ౧ తార్క్ష్యతనయే=గరుడపుత్రుఁడు, ౨ శాకభేదము, ౩ నాగప్రభేదయోః=సర్పభేదము.

---

## ఖచతుష్కం.

## నాల్గక్షరములుగల ఖకారాంత శబ్దములు.

భవేదగ్నిముఖో దేవే విప్రే భల్లాతకే స్త్రియాం. ౧౩

అగ్నిముఖః—(పు) ౧ దేవే = దేవుఁడు, ౨ విప్రే=బ్రాహ్మణుఁడు, ౩ భల్లాతకే=జీడిచెట్టు. (స్త్రీ)

అథాగ్నిశిఖముద్దిష్టం కుసుంభే కుంకుమేఽపి చ, లాంగలి

అగ్నిశిఖం—(న) ౧ కుసుంభే = కుసుమపూవు, ౨ కుంకుమే = కుంకుమపూవు,

కాృఖ్యౌషధౌ చ విశల్యాయాం చ యోషితి. ౧౪

3 లాంగలికాృఖ్యౌషధౌ. చ=లాంగలికియనుఓషధి, (స్త్రీ) ౪ విశల్యాయాం =కుక్కపాలచెట్టు.

ఇందులేఖామృతాసోమలతా రాశికలాసు చ,

ఇందులేఖా—(స్త్రీ) ౧ అమృతా= తిప్పతీఁగె, ౨ సోమలతా = సోమలత, 3 రాశి = రాశివిశేషము, ౪ కలాసు=చంద్రకళ.

అథ బద్ధశిఖా స్త్రీస్యాదుచ్చటాయాం శిశౌ త్రిషు. ౧౫.

బద్ధశిఖా—(స్త్రీ) ౧ ఉచ్చటాయాం =గుండ్రనితుంగముస్తె, ౨ శిశౌ=బిడ్డ (త్రి)

మహాశంఖౌ మానుషాస్థిసంఖ్యాభేదాలికేషు చ,

మహాశంఖః—(పు) ౧ మానుషాస్థి=మనుజునియెముక, ౨ సంఖ్యాభేదే = సంఖ్యాభేదము, 3 అలికేషు=నొసలు.

భవేద్వ్యాఘ్రనఖం కందగంధద్రవ్యవిశేషయోః. ౧౬.
నఖక్షతాంతరే క్లీబం

వ్యాఘ్రనఖం—(న) ౧ కంద = జెముడుచెట్టు, ౨ గంధద్రవ్య విశేషయోః = వ్యాఘ్రనఖమనుసుగంధద్రవ్యము, 3 నఖక్షతాంతరే=నఖక్షతభేదము.

శిలీముఖోఽలికాండయోః,

శిలీముఖః—(పు) ౧ అలి = తుమ్మెద, ౨ కాండయోః=బాణము.

శశిలేఖాకలాభాగే గుడూచీవృత్తభేదయోః. ౧౭

శశిలేఖా—(స్త్రీ) ౧ కళాభాగే = చంద్రకళాభాగము, ౨ గుడూచీ=తిప్పతీఁగె, వృత్తభేదయోః=వృత్తభేదము.

భవేత్స్వస్తిముఖో లేఖే బ్రాహ్మణే వందిని త్రిషు,

స్వస్తిముఖః—(పు) ౧ లేఖే= దేవత, ౨ బ్రాహ్మణే=బ్రాహ్మణుఁడు, 3 వందిని = స్తోత్రపాఠకుఁడు. (త్రి)

---

## ఖపంచకం.

## అయిదు అక్షరములుగల ఖకారాంత శబ్దములు.

మలినముఖోఽగ్నౌ గోలాంగూలేపుంసి త్రిషు క్రూరే.

మలినముఖః—(పు) ౧ అగ్నౌ=అగ్ని, ౨ గోలాంగూలే=కొండముచ్చు, 3 క్రూరే=క్రూరుఁడు. (త్రి)

శీతమయూఖశ్చంద్రే ఘనసా
రే చాపి పుంలింగః,
సర్వతోముఖ ఉగ్రే చ క్షేత్ర
జ్ఞబ్రహ్మణోః పుమాన్. ౧౯
నపుంసకం తు పానీయేసుర
వర్త్మన్యపి స్మృతం. ౨౦

శీతమయూఖః—(పు) ౧ చంద్రే = చంద్రుడు, ఘనసారే=పచ్చకర్పూరము.
సర్వతోముఖః—(పు) ౧ ఉగ్రే=శంకరుడు, ౨ క్షేత్రజ్ఞః=ఆత్మ, ౩ బ్రహ్మణః =బ్రహ్మ, ౪ పానీయే = త్రాగుజలము (న), సురవర్త్మని=ఆకాశము.

ఇతి ఖాంతవర్గః.

ఇది ఖాంతవర్గము.

## గైకం.

## ఏకాక్షరగాంతశబ్దములు.

గౌః స్వర్గే చ బలీవర్దే రశ్మౌ
చ కులిశే పుమాన్ స్త్రీసౌ
రభేయీ దృగ్బాణదిగ్వా
గ్భూష్వప్సు భూమ్నిచ. ౧

గౌః—(పు) ౧ స్వర్గే = స్వర్గము, ౨ బలీవర్దే=ఎద్దు, ౩ రశ్మౌ = కిరణము, ౪ కులిశే=వజ్రాయుధము, ౫ సౌరభేయీ=ధేనువు, (స్త్రీ) ౬ దృక్ = కన్ను, ౭ బాణ=బాణము, ౮ దిక్=దిశ, ౯ వాక్=వాక్కు, ౧౦ భూమ్ని = భూమి, ౧౧ అప్సు=జలము. (ని. బ)

## గ ద్వికం.

## రెండక్షరములుగల గకారాంత శబ్దములు.

అగః స్యాన్నగవత్పృథ్వీధర
పాదపయోః పుమాన్,

అగః (నగః)—(పు) ౧ పృథ్వీధరః=కొండ ౨ పాదపయోః=వృక్షము.

అంగం గాత్రే ప్రతీకోపాయ
యోః పుంభూమ్ని నీవృతి.
౨. క్లీబైకత్వే త్వప్రధానే
త్రిష్వంగవతి చాంతికే,

అంగం—(న) ౧ గాత్రే = శరీరము, ౨ ప్రతీక=అవయవము, ౩ ఉపాయయోః =ఉపాయము, ౪ నీవృతి = దేశవిశేషము, (పుం. బ), ౫ అప్రధానే=అప్రాధాన్యము (న. ఏ) ౬ అంగవతి= దేహముకలది, (త్రి) ౭ అంతికే సమీపము.

ఇంగః స్యాదద్భుతే జ్ఞానే జం
గమేంగితయోరపి. ౩

ఇంగః—(పు) ౧ అద్భుతే జ్ఞానే=ఆశ్చర్యమగు జ్ఞానము, ౨ జంగమే = నడచువస్తువు, ఇంగితయోః = హృదయాభిప్రాయము.

ఖగస్సూర్యే గ్రహే దేవే మార్గణే చ విహంగమే,

ఖగః—(పు) ౧ సూర్యే=సూర్యుఁడు, ౨ గ్రహే=గ్రహము, 3 దేవే=దేవుఁడు, ౪ మార్గణే=బాణము, ౫ విహంగమే పక్షి.

ఖడ్గో గండకశృంగాసిబుద్ధభేదేషు గండకే. ౪

ఖడ్గః—(పు) ౧ గండకశృంగ=ఖడ్గమృగముయొక్క కొమ్ము, అసి=ఖడ్గము, 3 బుద్ధభేదేషు=బుద్ధునిభేదము, ౪ గండకే=ఖడ్గమృగము.

గాంగస్తు గంగాసంభూతే త్రిషు భీష్మే గుహే పుమాన్,

గాంగః—త్రి ౧ గంగాసంభూతే=గంగయందు పుట్టినది, ౨ భీష్మే=భీష్ముఁడు, (పు), 3 గుహే=కుమారస్వామి.

చంగస్తు శోభనే దక్షే

చంగః—(పు) ౧ శోభనే = శుభము, ౨ దక్షే=సమర్థుఁడు.

టంగోఽస్త్రీ స్యాత్ఖనిత్రకే. ౫ ఖడ్గభేదే చ జంఘాయాం

టంగః—(స్త్రీ) ౧ ఖనిత్రకే = గుద్దలి, ౨ ఖడ్గభేదే = ఖడ్గవిశేషము, 3 జంఘాయాం=పిక్క.

త్యాగే దానే చ వర్జనే,

త్యాగః—(పు) ౧ దానే = దానము, ౨ వర్జనే=వదులుట.

తుంగీ నిశావర్బరయోః పున్నాగనగయోః పుమాన్. ౬. ఉన్నతే త్రిషు

తుంగీ—(స్త్రీ) నిశా=పసుపు, ౨ వర్బరయోః 3 పున్నాగ=పున్నాగవృక్షము, (పు), ౪ నగయోః=పర్వతము, ౫ ఉన్నతే= ఉన్నతుఁడు. (త్రి)

దుర్గోమా నీల్యోః స్త్రీ దుర్గమే త్రిషు,

దుర్గా—(స్త్రీ) ౧ ఉమా = పార్వతి, ౨ నీల్యోః=నీలిచెట్టు, 3 దుర్గమే = పొందుటకశక్యమైనది. (త్రి)

నాగం నపుంసకం రంగే సీసకే కరణాంతరే. ౭

నాగం—(న) ౧ రంగే = తగరము, ౨ సీసకే=సీసము, 3 కరణాంతరే= లెక్కవ్రాయు కరణవిశేషము.

నాగః పన్నగమాతంగక్రూరాచారిషు తోయదే, నాగ

నాగః—(పు) ౧ పన్నగ = సర్పము, ౨ మాతంగ = ఏనుఁగు, 3 క్రూరాచార

కేసర పున్నాగనాగదంతక ముస్తకే. ౮. దేహానిలప్రభేదే చ శ్రేష్ఠే స్యాదుత్తరస్థితః,

ము గలవాఁడు, ౪ తోయదే=మేఘము, ౫ నాగకేసర=నాగకేసరవృక్షము, ౬ పున్నాగ = పున్నాగవృక్షము, ౭ నాగదంతక = ద్వారబంధపు నిడుపు కమ్మి, ౮ ముస్తకే = తుంగముస్త, ౯ దేహానిలప్రభేదే = దేహమందలివాయువిశేషము, ౧౦ శ్రేష్ఠే=శ్రేష్ఠుఁడు. నిత్యము (ఉత్తరపదమైనప్పుడు).

పింగా గోరోచనా హింగు నాలికా చండికాసు చ. ౯

పింగా—(స్త్రీ) ౧ గోరోచనా = గోరోచనము, ౨ హింగు = ఇంగువ, ౩ నాలికా = గొట్టము, ౪ చండికాసు = పార్వతి.

పింగీ శమ్యాం పిశంగే నా బాలకే తు నపుంసకం,

పింగీ—(స్త్రీ) ౧ శమ్యాం=శమీవృక్షము, ౨ పిశంగే=కపిలవర్ణము (పు) ౩ బాలకే=బాలకుఁడు. (న).

పూగస్తు క్రముకే బృందే ఫలసారేఽభిధేయవత్ నదీభేదే మలప్వాం స్త్రీ

పూగః—(పు) ౧ క్రముకే=పోఁకచెట్టు, ౨ బృందే=సముదాయము, ౩ ఫలసారే = ఫలశ్రేష్ఠము, (విశేష్యనిఘ్నము) (త్రి) ౪ నదీభేదే = నదీవిశేషము, ౫ మలప్వాం=బ్రహ్మమేడి (స్త్రీ)

భంగో జయవిపర్యయే, భేదరోగతరంగేషు భంగాసస్యాంతరే స్త్రియాం. ౧౧

భంగః—(పు) ౧ జయవిపర్యయే = అపజయము, ౨ భేద=భేదము, ౩ రోగ=రోగము, ౪ తరంగేషు = తరఁగము, ౫ సస్యాంతరే=సస్యవిశేషము (స్త్రీ).

భగం శ్రీయోనివీర్యేచ్ఛాజ్ఞానవైరాగ్యకీర్తిషు, మాహాత్మ్యైశ్వర్యయత్నేషు ధర్మే మోక్షే చనా రవౌ. ౧౨

భగం—(న) ౧ శ్రీ=సంపత్తు, ౨ యోని=స్త్రీలభగము, ౩ వీర్య = పరాక్రమము, ౪ ఇచ్ఛా=కోరిక, ౫ జ్ఞాన = జ్ఞానము, ౬ వైరాగ్య=వైరాగ్యము, ౭ కీర్తిషు=యశస్సు, ౮ మాహాత్మ్య =మాహాత్మ్యము, ౯ ఐశ్వర్య = ఐశ్వ

ర్యము, ౧౦ యత్నేషు=ప్రయత్నము ౧౧ ధర్మే=ధర్మము, ౧౨ మోక్షే = మోక్షము, ౧౩ రవౌ=సూర్యుఁడు.

భాగో రూపార్ధకే భాగ్యైకదేశయో

భాగః—(పు). రూపార్ధకే = రూపకాది గ్రంథార్ధము, ౨ భాగ్య = భాగ్యము, ౩ ఏకదేశయోః=నాల్గవభాగము.

భృగుః పుమాన్, మునౌ హరే తటే శుక్రే

భృగుః—(పు) ౧ మునౌ=మునివిశేషము, ౨ హరే=రుద్రుఁడు, ౩ తటే=చరియ, ౪ శుక్రే=శుక్రుఁడు.

భృంగో ధూమ్యాట షిద్గయోః ౧౩. మధువ్రతే భృంగరాజే పుంసి భృంగే గుడత్వచి,

భృంగః—(పు) ౧ ధూమ్యాట = కూకటి మూగపిట్ట, ౨ షిద్గయోః = విటుఁడు, ౩ మధువ్రతే = తుమ్మెద, ౪ భృంగరాజే = గుంటగలగరచెట్టు, ౫ పుంసి భృంగే= మగతుమ్మెద, ౬ గుడత్వచి= సుగంధద్రవ్యవిశేషము.

భోగస్సుఖే ధనే చాహేశ్శరీరఫణయోరపి ౧౪. పాలనే వ్యవహారే చ యోషిదాదిభృతావపి,

భోగః—(పు) ౧ సుఖే = సుఖము, ౨ ధనే=ధనము, ౩ అహేశ్శరీర = సర్పశరీరము, ౪ ఫణయోః = ఫణము, ౫ పాలనే=పాలించుట, ౬ వ్యవహారేచ = వ్యవహారము, ౭ యోషిదాదిభృతౌ = స్త్రీలు మొదలగువార్లను భరించుట.

మార్గో మృగమదే మాసప్రభేదేఽన్వేషణాధ్వనోః.

మార్గః—(పు) ౧ మృగమదే=కస్తూరి, ౨ మాసప్రభేదే=మార్గశీర్షమాసము, ౩ అన్వేషణ = వెదకుట, ౪ అధ్వనోః = మార్గము.

మృగః పశౌ కురంగే చ కరినక్షత్రభేదయోః, అన్వేషణే చ యాచ్ఞాయాం మృగీ తు వనితాంతరే.౧౬

మృగః—(పు) ౧ పశౌ=పశువు, ౨ కురంగే=లేడి, ౩ కరి=గజభేదము, ౪ నక్షత్రభేదయోః = మృగశీర్షానక్షత్రము, ౫ అన్వేషణే = వెదకటము, ౬ యా

ఙ్ఞాయాం=యాచనము, ౭ వనితాంతరే=స్త్రీవిశేషము. (సీ). (మృగీ).

యుగో రథహలాద్యంగే న
ద్వయోస్తు కృతాదిషు,
యుగ్మే హస్తచతుష్కేఽపి
వృద్ధినామౌషధేఽపి చ. ౧౭

యుగః—(పు) ౧ రథహలాద్యంగే=కాడిమ్రాను, ౨ కృతాదిషు=కృతాదియుగములు (న). ౩ యుగ్మే = జంట, ౪ హస్తచతుష్కే = నాలుగు చేతుల ప్రమాణము, ౫ వృద్ధినామౌషధే=వృద్ధినామక ఔషధము.

యోగో పూర్వార్థసంప్రాప్తౌ
సంగతి ధ్యానయుక్తిషు,
వపుఃస్థైర్యే ప్రయోగే చ
విష్కంభాదిషు భేషజే. ౧౮

విస్రబ్ధఘాతకే ద్రవ్యోపా
యసన్నహనేష్వపి, కార్మ
ణేఽపి చ.

యోగః—(పు) ౧ అపూర్వార్థసంప్రాప్తౌ=అపూర్వవస్తుప్రాప్తి, ౨ సంగతి=సంబంధము, ౩ ధ్యాన = ధ్యానము, ౪ యుక్తిషు=కూర్పుట, ౫ వపుఃస్థైర్యే = శరీరస్థైర్యము, ౬ ప్రయోగే=ప్రయోగించుట, ౭ విష్కంభాదిషు=విష్కంభాదియోగములు, ౮ భేషజే=మందు, ౯ విస్రబ్ధఘాతకే=నమ్మినవానిని జంపువాఁడు, ౧౦ ద్రవ్య=ద్రవ్యము, ౧౧ ఉపాయ = ఉపాయము, ౧౨ సన్నహనేషు = ప్రయత్నము, ౧౩ కార్మణే=మంత్రతంత్రాదియోజనము.

రంగో నా రాగే నృత్యే రణ
క్షితౌ. ౧౯. అస్త్రీ త్రపుణి

రంగః—(పు) ౧ రాగే=అనురాగము, ౨ నృత్యే=నాట్యము, ౩ రణక్షితౌ=రణభూమి, ౪ త్రపుణి=తగరము. (ప్న)

రాగస్తు మాత్సర్యే లోహి
తాదిషు, క్లేశాదావనురాగే
చ గాంధారాదౌ నృపేఽ
పిచ. ౨౦

రాగః—(పు) ౧ మాత్సర్యే = మాత్సర్యము, ౨ లోహితాదిషు = యెరుపు మొదలగురంగులు, ౩ క్లేశాదౌ=కష్టము మొదలగునవి, ౪ అనురాగే=అనురాగము, ౫ గాంధారాదౌ=గాంధారాది రాగము, ౬ నృపే=రాజు.

| | |
|---|---|
| రోగః కుష్ఠౌషధే వ్యాధౌ | రోగః—(పు) ౧ కుష్ఠౌషధే=కుష్ఠరోగౌషధము, ౨ వ్యాధౌ=రోగము. |
| లంగస్తు సంగషింగయోః, | లంగః—(పు) ౧ సంగ=సంబంధము, ౨ షిద్గయోః=విటుఁడు. |
| లింగం చిహ్నేఽనుమానే చ సాంఖ్యోక్త ప్రకృతావపి. ౨౧. శివమూర్తివిశేషేఽపి మేహనేఽపి నపుంసకం, | లింగం—(న) ౧ చిహ్నే=గుర్తు, ౨ అనుమానము = అనుమానప్రమాణము, (అనఁగా ఊహించుట), 3 సాంఖ్యోక్తప్రకృతౌ = సాంఖ్యులచేఁ జెప్పఁబడినప్రకృతి, ౪ శివమూర్తివిశేషే = శివలింగము, ౫ మేహనే = శిశ్నము (న). |
| వ్యంగో భేకే చ హీనాంగే | వ్యంగః—(పు) భేకే=కప్ప, ౨ హీనాంగే=అవయవహీనుఁడు. |
| వంగం సీసకరంగయోః. ౨౨ వార్తాకేఽపి చ కార్పాసే పుంభూమ్ని నీవృదంతరే, | వంగం—(న) ౧ సీసక=సీసము, ౨ రంగయోః = తగరము, 3 వార్తాకే = వంకాయ, ౪ కార్పాసే = ప్రత్తికాయ, ౫ నీవృదంతరే= దేశవిశేషము (పు.) |
| వల్గుః స్యాచ్ఛగలే పుంసి సుందరే చాభిధేయవత్. ౨౩ | వల్గుః—(పు) ౧ ఛగలే=మేఁక, ౨ సుందరే=సుందరుఁడు, విశేష్యనిఘ్నము. |
| వేగో జవే ప్రవాహే చ మహాకాలఫలేఽపి చ, | వేగః—(పు) ౧ జవే=వేగము, ౨ ప్రవాహే=ప్రవాహము, 3 మహాకాలఫలే=విషముష్టికాయ. |
| శార్ఙ్గః కార్ముకమాత్రేఽపివిష్ణోరపి శరాసనే. ౨౪ | శార్ఙ్గః—(పు) ౧ కార్ముకమాత్రే=ఆయుధమాత్రము, ౨ విష్ణోరపిశరాసనే=విష్ణుమూర్తి ధనుస్సు. |
| శుంగో వటామ్రాతకయోః పర్కట్యామపిచాస్త్రియాం, | శుంగః—(పు) ౧ వట = మఱ్ఱిచెట్టు, ౨ ఆమ్రాతకయోః=ఇప్పచెట్టు, 3 పర్కట్యాం=జువ్విచెట్టు (స్త్రీ). |

| | |
|---|---|
| శృంగం ప్రభుత్వే శిఖరే చి హ్నే క్రీడాంబుయంత్రకే. ౨౫. విషాణోత్కర్షయో శ్చాథ | శృంగం—(న) ౧ ప్రభుత్వే=ప్రభుత్వము, ౨ శిఖరే=శిఖరము, ౩ చిహ్నే=గుర్తు, ౪ క్రీడాంబుయంత్రకే = చిమ్మిలిగొట్టము, ౫ విషాణ=కొమ్ము, ౬ ఉత్కర్షయోః=ఉత్కర్షము. |
| శృంగః స్యాత్కూర్చశీర్షకే, స్త్రీవిషాయాం స్వర్ణమీన భేదయో ఋషభౌషధౌ. | శృంగః—(పు) ౧ కూర్చశీర్షకే = జీవక మనుచెట్టు, ౨ విషాయాం = అతివస, (స్త్రీ). ౩ స్వర్ణ=సువర్ణభేదము, ౫ మీన భేదయోః=మత్స్యవిశేషము,౪ ఋషభౌషధౌ=వృషభమను ఔషధవిశేషము. |
| సర్గస్తు నిశ్చయాధ్యాయమో హోత్సాహాత్మసృష్టిషు, | సర్గః—(పు) ౧ నిశ్చయము=నిశ్చయము, ౨ అధ్యాయ=అధ్యాయము, ౩ మోహ=మోహము, ౪ ఉత్సాహ=ఉత్సాహము, ౫ ఆత్మసృష్టిషు=బ్రహ్మసృష్టి. |

## గ త్రికం

మూఁడక్షరములుగల గకారాంత శబ్దములు.

| | |
|---|---|
| అయోగో విధురే కూటే వి శ్లేషే కఠినోద్యమే. ౨౬ | అయోగః—(పు) ౧ విధురే = భార్యాహీనుఁడు, ౨ కూటే=అనృతము, ౩ విశ్లేషే=వియోగము, ౪ కఠినోద్యమే= కఠినప్రయత్నము. |
| అనంగో మదనేఽనంగమాకా శమనసోరపి, | అనంగః—(పు) ౧ మదనే=మన్మథుఁడు, అనంగం—(న) ౨ ఆకాశ=ఆకాశము ౩ మనసోః=మనస్సు. |
| అపాంగస్త్వంగహీనే స్యా న్నేత్రాంతే తిలకేఽపి చ. | అపాంగః—(పు) అంగహీనే=శరీరహీనుఁడు, ౨ నేత్రాంతే = కటాక్షము, ౩ తిలకే=బొట్టు. |
| ఆభోగో వరుణచ్ఛత్రే పూర్ణ తాయత్నయోరపి, | ఆభోగః (పు) ౧ వరుణచ్ఛత్రే = వరుణుని గొడుగు, ౨ పూర్ణతా=పూర్ణత్వము, ౩ యత్నయోః=యత్నము. |

| | |
|---|---|
| ఆయోగో వ్యాపృతౌ గంధ మాల్యోపహారబోధయోః. | ఆయోగః—(పు)౧ వ్యాపృతౌ=చుట్టుట, ౨ గంధమాల్యోపహార = గంధమాల్యాది కానుకలు, ౩ బోధయోః = జ్ఞానము. |
| ఆశుగో మారుతే బాణేఽ | ఆశుగః—(పు) ౧ మారుతే = గాలి, ౨ బాణే=బాణము. |
| ప్యుద్వేగం క్రముకే ఫలే, | ఉద్వేగం—(న) ౧ క్రముకే ఫలే = పోఁకపండు. |
| ఉద్వేగోఽప్యుద్బాహులకో ద్వేజనోద్గమనేషు చ. ౩౦. | ఉద్వేగః—(పు)౧ ఉద్బాహులక=ఉన్నతమైనభుజములుగలవాఁడు, ౨ ఉద్వేజన = పీడ, ౩ ఉద్గమనేషు = పైకిపోవడము. |
| ఉత్సర్గః పుంసి సామాన్యే న్యాయే చ త్యాగదానయోః, | ఉత్సర్గః—(పు) ౧ సామాన్యేన్యాయే = సామాన్యన్యాయము, ౨ త్యాగ = వదలుట, ౩ దానయోః=ఇచ్చుట. |
| కళింగః పూతికరజేధూమ్యాటే భూమ్ని నీవృతి. ౩౧. న ద్వయోః కౌటజఫలే మహిలాయాం తు యోషితి, | కళింగః—(పు) ౧ పూతికరజే=నెమలడుగు చెట్టు, ౨ ధూమ్యాటే = కూకటి మూఁగయనుపక్షి, ౩ నీవృతి = దేశవిశేషము (పు.), ౪ కౌటజఫలే = కొడిశపండు, ౫ మహిలాయాం=ఆఁడుది. (స్త్రీ) కళింగా. |
| కాళింగో భూమికర్కారౌ దంతావళభుజంగయోః. | కాళింగః—(పు) ౧ భూమికర్కారౌ = పుచ్చచెట్టు, ౨ దంతావళ = ఏనుఁగు, ౩ భుజంగయోః=సర్పవిశేషము. |
| కాలింగీ రాజకర్కట్యాం | కాలింగీ—(స్త్రీ)౧ రాజకర్కట్యాం=నక్కదోస. |
| చక్రాంగో మానసౌకసి, | చక్రాంగః—(పు) ౧ మానసౌకసి = హంస. |
| చక్రాంగీ కటురోహిణ్యాం | చక్రాంగీ—(స్త్రీ)౧ కటురోహిణ్యాం=కటుకరోహిణి. |

జిహ్మగోఽహౌ చ మందగే.

జిహ్మగః—(పు) ౧ అహౌ = సర్పము, ౨ మందగే=మెల్లఁగానడచువాఁడు.

తడాగోఽస్త్రీ జలాధారవిశేషేయంత్రకూటకే,

తడాగః—(పు) ౧ జలాధారవిశేషే=చెరువు, ౨ యంత్రకూటకే=బోను.

తాతగుః క్షుద్రతాతే నా జనకస్య హితే త్రిషు. ౩౪

తాతగుః—(పు.) ౧ క్షుద్రతాతే=పితృవ్యుఁడు, ౨ జనకస్య హితే = తండ్రికి హితుఁడు. (త్రి)

త్రివర్గో ధర్మకామార్థే త్రిఫలాయాం కటుత్రికే, వృద్ధిస్థానక్షయే సత్వరజస్తమసి చేష్యతే. ౩౫

త్రివర్గః—(పు) ౧ ధర్మకామార్థేః= ధర్మకామార్థములు, ౨ త్రిఫలాయాం= కరక, తాడి, ఉసిరకలు, 3 కటుత్రికే =శొంఠి, పిప్పలి, మిరియాలు, ౪ వృద్ధిస్థానక్షయే = వృద్ధి-స్థితి-నాశనములు, ౫ సత్వరజస్తమసి=సత్వ-రజ-స్తమస్సులు.

తురగీ చాశ్వగంధాయాం

తురగీ—(స్త్రీ) ౧ అశ్వగంధాయాం = పెన్నేరు.

తురగశ్చిత్తవాజినోః,

తురగః—(పు) ౧ చిత్త=మనస్సు, ౨ వాజినోః=గుఱ్ఱము.

ధారాంగోఽసౌ చ తీర్థే చ

ధారాంగః—(పు) ౧ అసౌ=కత్తి, ౨ తీర్థే=రేవు.

నరాంగస్తు వరండకే. ౩౬. మేహనే న ద్వయోశ్చాథ

నరాంగః—(పు) ౧ వరండకే= నీచుఁడు, ౨ మేహనే=మేఢ్రము. (న)

నారంగః పిప్పలీరసే యమజప్రాణిని విటే నాగరంగద్రుమేఽపి చ. ౩౭

నారంగః—(పు) ౧ పిప్పలీరసే = పిప్పలీరసము, ౨ యమజప్రాణిని=కవలపిల్లలు, 3 విటే=విటుఁడు, ౪ నాగరంగద్రుమే =నారింజచెట్టు.

నిషంగః సంగతే తూణే

నిషంగః—(పు) ౧ సంగతే=సంబంధము, ౨ తూణే=అమ్ములపొది.

నిసర్గో రూపసర్గయోః,

నిసర్గః—(పు) ౧ రూప = స్వభావము, ౨ సర్గయోః=సృష్టి.

| | |
|---|---|
| నీలంగుః స్యాత్క్రిమౌ పుంసి బంభరాల్యాం తు యోషితి. 3౮ | నీలంగుః—(పు) ౧ క్రిమౌ=పురుగు, ౨ బంభరాల్యాం=తుమ్మెదచాలు, (స్త్రీ). |
| పత్త్రాంగం నద్వయోర్భూర్జే పద్మకే రక్తచందనే, | పత్త్రాంగం—(న) ౧ భూర్జే=భూర్జవృక్షము, ౨ పద్మకే=పుష్కరదేశ ప్రసిద్ధౌషధివిశేషము, 3 రక్తచందనే = ఎఱ్ఱని గంధము. |
| పన్నగశ్చౌషధీభేదే తథైవ పవనాశనే 3౯ | పన్నగః—(పు) ౧ ఓషధీభేదే=ఓషధిభేదము, ౨ పవనాశనే=సర్పము. |
| ప్లవగో వానరే భేకే సారథా చోష్ణదీధితేః, | ప్లవగః—(పు) ౧ వానరే= కోఁతి, ౨ భేకే=కప్ప, 3 ఉష్ణదీధితేఃసారథౌ=సూర్యసారథి |
| పరాగస్సుమనో రేణౌ ధూళిస్నానీయయోరపి. ౪౦. గిరిప్రభేదే విఖ్యాతావుపరాగే చ చందనే, | పరాగః—(పు) ౧ సుమనో రేణౌ=పుష్పొడి-పుప్పరేణువు, ౨ ధూళి=దుమ్ము, 3 స్నానీయయోః = నలుగుపిండి, ౪ గిరిప్రభేదే=శైలవిశేషము, ౫ విఖ్యాతౌ = ప్రసిద్ధి, ౬ ఉపరాగే=గ్రహణము, ౭ చందనే=చందనము. |
| ప్రయాగస్తీర్థభేదే స్యాద్యజ్ఞే శతమఖాశ్వయోః ౪౧ | ప్రయాగః—(పు) ౧ తీర్థభేదే=పుణ్యస్థలవిశేషము, ౨ యజ్ఞే = యజ్ఞము, 3 శతమఖ= దేవేంద్రుఁడు, ౪ అశ్వయోః =గుఱ్ఱము. |
| ప్రయోగః కర్మణేఽపి స్యాత్ప్రయుక్తౌ చ నిదర్శనే, | ప్రయోగః—(పు) ౧ కర్మణే = కర్మ—యజ్ఞము మొదలైనవాని క్రియాక్రమము, ౨ ప్రయుక్తౌ=ప్రయోజనము, 3 నిదర్శనే=దృష్టాంతము. |
| పతంగశ్శలభే శాలిప్రభేదే పక్షిసూర్యయోః. ౪౨. క్లీబం సుతే | పతంగః—(పు) ౧ శలభే = మిడుత, ౨ శాలిప్రభేదే=ధాన్యవిశేషము, 3 పక్షీ=పక్షి, ౪ సూర్యయోః=సూర్యుఁడు, ౫ సుతే=పాదరసము. (న) |

| | |
|---|---|
| ప్రియంగుః స్త్రీ రాజికాకణయోరపి, ఫలిన్యాం కంగుసస్యే చ | ప్రియంగుః—(స్త్రీ) ౧ రాజికా=నల్లావాలు, ౨ కణయోః = ధాన్యపుపాల్లు, 3 ఫలిన్యాం=ప్రేంకణపుచెట్టు, ౪ కంగుసస్యే=కొఱ్ఱపైరు. |
| పున్నాగస్తు సితోత్పలే. ౪౩. జాతీఫలే నరశ్రేష్ఠే పాండునాగే ద్రుమాంతరే, | పున్నాగః—(పు) ౧ సితోత్పలే = తెల్లకలువ, ౨ జాతీఫలే=జాజికాయ, 3 నరశ్రేష్ఠే = పురుషశ్రేష్ఠుఁడు, ౪ పాండునాగే = తెల్లసర్పము, ౫ ద్రుమాంతరే=సురపొన్నవృక్షవిశేషము |
| వరాంగం యోనిమాతంగమస్తకేషు గుడత్వచి. ౪౪ | వరాంగం—(న) ౧ యోని=భగము, ౨ మాతంగ=గజము, 3 మస్తకేషు=శిరస్సు, ౪ గుడత్వచి=వరాంగమనుగంధద్రవ్యము. |
| భుజంగోఽహౌ చ షింగే చ | భుజంగః—(పు) ౧ అహౌ = సర్పము, ౨ షింగే=విటుఁడు. |
| మాతంగః శ్వపచే గజే, | మాతంగః — (పు) ౧ శ్వపచే=చండాలుఁడు, ౨ గజే=ఏనుఁగు. |
| మృదంగః పటహే ఘోషే | మృదంగః—(పు) ౧ పటహే=డప్పు, ౨ ఘోషే=చాటింపుధ్వని. |
| రక్తాంగస్తు మహీసుతే. ౪౫. కంపిల్లే స్త్రీ తు జీవంత్యాం క్లీబం విద్రుమధీరయోః, | రక్తాంగః—(పు) ౧ మహీసుతే = అంగారకుఁడు, ౨ కంపిల్లే = కంపిల్లమను గ్రంథ్యము, 3 జీవంత్యాం=పాలకూర, (స్త్రీ) ౪ విద్రుమ = పగడము, (న) ౫ ధీరయోః = ధీరుఁడను నాయకవిశేషము. |
| రథాంగం న ద్వయోశ్చక్రే నా చక్రాంగవిహంగమే. ౪౬ | రథాంగం—(న) ౧ చక్రే=విష్ణుచక్రము, ౨ చక్రాంగవిహంగమే (పు) = చక్రవాకపక్షి. |
| వాతిగః పుంసి భంటాక్యాం ధాతువాదిని చాన్యవత్, | వాతిగః—(పు) ౧ భంటాక్యాం=ములకచెట్టు,౨ ధాతువాదిని=ధాతువాదము |

చేయువాఁడు (కంచుపోతపోయువాఁడు) (వి. ని.)

విడంగ స్త్రిష్వభిజ్ఞేస్యాత్క్రిమిఘ్నే పున్నపుంసకం. ౪౭

విడంగః—(త్రి) ౧ అభిజ్ఞే= తెలిసినవాఁడు, ౨ క్రిమిఘ్నే=వాయువిళంగము. (పు)

విసర్గస్తు పుమాన్ దానే త్యాగే చ మలనిర్గమే, విసర్జనీయే ఽప్యయనభేదే ఽపి చ విభావసోః. ౪౮

విసర్గః—(పు) ౧ దానే = దానము, ౨ త్యాగే = విడుచుట, 3 మలనిర్గమే= మలవిసర్జనము, ౪ విసర్జనీయే = విడిచిపెట్టఁదగినది, ౫ అయనభేదే=సూర్యాయనము.

విహంగస్తు త్రిలింగస్స్యాదాశుగే చ విహంగమే

విహంగః—(త్రి) ౧ ఆశుగే=బాణము, ౨ విహంగమే=పక్షి.

సర్వగం సలిలే క్లీబం సర్వగః శ్శంకరే విభౌ. ౪౯

సర్వగం—(న) ౧ సలిలే=నీరు, ౨ సర్వగః (పు) శంకరే = శివుఁడు, 3 విభౌ = వ్యాపకుఁడు.

సంభోగస్తు పుమాన్భోగే సురతే జినశాసనే,

సంభోగః—(పు) ౧ భోగే=భోగము, ౨ సురతే=సంభోగముచేయుట, 3 జినశాసనే=జైనునియొక్క ఆజ్ఞ.

సారంగః పుంసి హరిణే చాతకే చ మతంగజే. ౫౦. శబలే త్రిషు

సారంగః—(పు) ౧ హరిణే = లేడి, ౨ చాతకే=వానకోయిల, 3 మతంగజే= ఏనుఁగు, 3 శబలే=చిత్రవర్ణము. త్రి.

హేమాంగో గరుడే పరమేష్ఠిని

హేమాంగః—(పు) ౧ గరుడే = గరుత్మంతుఁడు, ౨ పరమేష్ఠిని = బ్రహ్మదేవుఁడు.

## గచతుష్కం.

నాలుగక్షరములుగల గకారాంత శబ్దములు

స్యాదపవర్గస్త్యాగే మోక్షే కార్యావసానసాఫల్యే. ౫౧

అపవర్గః—(పు) ౧ త్యాగే=విడుచుట, ౨ మోక్షే = మోక్షము, 3 కార్యావసానసాఫల్యే=కార్యావసానఫలసిద్ధి.

| | |
|---|---|
| అభిషంగో ను పుంలిఙ్గః పరాభవాక్రోశశపథేషు, | అభిషంగః—(పు) ౧ పరాభవ=అవమానము, ౨ ఆక్రోశ=తిట్టుట, 3 శపథేషు =ప్రతిజ్ఞ. |
| ఈహామృగస్తు పుంసి స్యాత్కోక-కరూపకభేదయోః | ఈహామృగః—(పు) ౧ కోక=తోఁడేలు, ౨ రూపకభేదయోః = నాటకవిశేషము. |
| ఉపరాగస్తు పుంసి స్యాద్రాహుగ్రస్తార్క-చంద్రయోః, దుర్నయే గ్రహకల్లోలే వ్యసనేఽపి నిగద్యతే. ౫౩ | ఉపరాగః—(పు) ౧ రాహుగ్రస్తార్క-చంద్రయోః = చంద్రసూర్యుల గ్రహణము, ౨ దుర్నయే = దుర్నీతి, 3 గ్రహకల్లోలే = రాహుగ్రహము, ౪ వ్యసనే=విచారము. |
| ఉపసర్గః పుమాన్ రోగభేదోపప్లవయోరపి, | ఉపసర్గః—(పు) ౧ రోగభేద = ఒకానొక రోగము, ౨ ఉపప్లవయోః = ఉపద్రవము. |
| కటభంగస్తు సస్యానాం హస్తచ్ఛేదే నృపాత్యయే. ౫౪ | కటభంగః—(పు) ౧ సస్యానాంహస్తచ్ఛేదే=పైరులను జేతితోఁగోయుట, ౨ నృపాత్యయే=రాజునశించుట. |
| ఛత్రభంగోఽపి వైధవ్యే స్వాతంత్ర్యనృపనాశయోః, | ఛత్రభంగః—(పు) ౧ వైధవ్యే=ముండతనము, ౨ స్వాతంత్ర్య=స్వతంత్రము చెడుట, 3 నృపనాశయోః = రాజనాశనము. |
| దీర్ఘాధ్వగః పుమానుష్ట్రే లేఖ్యహారే తు భేద్యవత్. | దీర్ఘాధ్వగః—(పు) ౧ ఉష్ట్రే=ఒంటె, ౨ లేఖహారే=వార్తాహరుఁడు. (త్రి) |
| మల్లనాగోఽభ్రమాతంగేవాత్స్యాయనమునావపి, | మల్లనాగః—(పు) ౧ అభ్రమాతంగే = ఐరావతము, ౨ వాత్స్యాయనమునౌ= వాత్స్యాయనుఁడనుముని. |
| సమాయోగస్తు సంయోగే సమవాయే ప్రయోజనే. | సమయోగః—(పు) ౧ సంయోగే=అస్త్రముసంధించుట, ౨ సమవాయే=సముదాయము, 3 ప్రయోజనే=ప్రయోజనము. |

| | |
|---|---|
| సంప్రయోగో రతేఽపి స్యా దన్వితౌ కార్మణేఽపి చ | సంప్రయోగః—(పు) ౧ రతే = సంభోగము, ౨ అన్వితౌ=కలియఁగూడుట, 3 కార్మణే=మంత్రతంత్రాది ప్రయోజనము. |
| గ పంచకం. | అయిదక్షరములుగల గకారాంత శబ్దములు. |
| కథాప్రసంగో వాతూలే విష వైద్యే చ వాచ్యవత్, | కథాప్రసంగః—(పు) ౧ వాతూలే=సుడిగాలి, ౨ విషవైద్యే=విషవైద్యుఁడు, (వి. ని) |
| నాడీతరంగః కాకోలే హిండకే రతహిండకే. | నాడీతరంగః—(పు) ౧ కాకోలే=జముడుకాకి, ౨ హిండకే = దొంగవాఁడు, (నీచజాతుఁడు), 3 రతహిండకే= స్త్రీచోరుఁడు. |
| ఇతి గాంతవర్గః. | ఇది గాంతవర్గము. |
| ఘైకం | ఏకాక్షర ఘ శబ్దములు. |
| ఘో ఘంటాయాం ఘర్ఘరే నా స్త్రియాం తు కాంచి ఘాతయోః, | ఘః—(పు) ౧ ఘంటాయాం=గంట, ౨ ఘర్ఘరే = ఘర్ఘరధ్వని, 3 కాంచి = మొలనూలు, (స్త్రీ) 3 ఘాతయోః = దెబ్బ. |
| ఘు ద్వికం. | రెండక్షరములుగల ఘుకారాంత శబ్దములు. |
| అఘం తు వ్యసనే దుఃఖే దురితే చ నపుంసకం. ౧ | అఘం—(పు) ౧ వ్యసనే=సప్తవ్యసనాదులు, ౨ దుఃఖే=ఏడ్పు, 3 దురితే = పాపము. |
| అర్ఘః పూజావిధౌ మూల్యేఽ | అర్ఘః—(పు) ౧ పూజావిధౌ = పూజావిధి, ౨ మూల్యే=వెల. |
| ప్యుద్ఘస్స్యాద్దేహజానిలే అగ్నౌ హస్తపుటే శస్తే | ఉద్ఘః—(పు) ౧ దేహజానిలే= దేహమువలన పుట్టినగాలి, ౨ అగ్నౌ = అగ్ని |

3 హస్తపుటే = దోసిలి, ౪ శస్తే = ప్రశస్తము.

ఓఘో వేగే జలస్య చ. ౨. బృందే పరంపరాయాం చ ద్రుతనృత్యోపదేశయోః,

ఓఘః—(పు) ౧ జలస్య వేగే=జలవేగము, ౨ బృందే=సముదాయము, 3 పరంపరాయాం=వరుస, ౪ ద్రుతనృత్యే = శీఘ్రనృత్యము, ౫ ద్రుతోపదేశయోః =శీఘ్రోపదేశము.

మఘా మఘీచ నక్షత్రే ధాన్యభేదే యథాక్రమం. 3 మఘో ద్వీపాంతరే మేఘో ముస్తాజలదయోః పుమాన్,

మఘా—(స్త్రీ) ౧ నక్షత్రే=మఘానక్షత్రము మఘీ=ధాన్యభేదము.
మఘః—(పు) ౧ ద్వీపాంతరే = ద్వీపవిశేషము.
మేఘః—(పుం) ౧ ముస్తా=తుంగముస్తె, ౨ జలదయోః=మేఘము.

మోఘా స్త్రీ పాటలాయాం స్యాద్ధీననిష్ఫలయోస్త్రిషు.

మోఘా—(స్త్రీ) ౧ పాటలాయాం = కలిగొట్టుచెట్టు, ౨ హీన=నీచుఁడు, (త్రి) నిష్ఫలయోః=ఫలరహితమైనది.

లఘురగురౌ చ మనోజ్ఞే నిస్సారే వాచ్యవల్లింగం, శీఘ్రే చ కృష్ణాగురుణి స్పృక్కానామౌషధౌ తు స్త్రీ.

లఘుః—(పు) ౧ అగురౌ = గురువుగాని వర్ణము, ౨ మనోజ్ఞే=మనోహరమైనది 3 నిస్సారే సారములేనిది, (వి. ని) (న) ౪ శీఘ్రే=తొందర, ౫ కృష్ణాగురుణి = కాలాగురు, ౬ స్పృక్కానామఓషధి=ఓషధీవిశేషము (స్త్రీ).

శ్లాఘా స్త్రియాం ప్రశంసాయాం పరిచర్యాభిలాషయోః,

శ్లాఘా—(స్త్రీ) ౧ ప్రశంసాయాం=స్తోత్రము, ౨ పరిచర్యా=సేవ, 3 అభిలాషయోః=కోరిక.

## ఘ త్రికం.

మూడక్షరములుగల ఘకారాంత శబ్దములు.

అనఘో నిర్మలాపాపమనోజ్ఞేష్వభిధేయవత్. ౬

అనఘః—(పు) ౧ నిర్మల=నిర్మలుఁడు, ౨ అపాప=పాపరహితుఁడు, 3 మనోజ్ఞే=మనోహరమైనవాఁడు. (వి. ని)

| | |
|---|---|
| అమోఘుం సఫలే వాచ్యవత్ స్త్రీ పథ్యావిడంగయోః, | అమోఘుం—(న) ౧ సఫలే=ఫలవంతమైనది. (వి. ని) ౨ పథ్యా=కరక్కెట్టు, (స్త్రీ) ౩ విడంగయోః=వాయువిడంగము. |
| ఉల్లాఘోఽపి శుచౌ కృష్ణే దక్షనీరోగయోస్త్రిషు. ౭ | ఉల్లాఘః—(పు) ౧ శుచౌ=పరిశుభ్రుఁడు, ౨ కృష్ణః = నల్లనివాఁడు, 3 దక్ష = నేర్పరి (త్రి) ౪ నీరోగయోః = రోగరహితుఁడు. |
| కాచిఘః కాంచనేఽపి స్యా చ్ఛేమండే మూషికేఽపి చ, | కాచిఘః—(పు) ౧ కాంచనే=బంగారు, ౨ ఛేమండే=పతృహీనుఁడు, 3 మూషికే=ఎలుక. |
| నిదాఘో గ్రీష్మకాలే స్యా దుష్ణస్వేదాంబునోరపి. ౮ | నిదాఘః—(పు) ౧ గ్రీష్మకాలే=ఎండకాలము, ౨ ఉష్ణ=వేఁడిమి, 3 స్వేదాంబునోః=చెమటనీరు. |
| పలిఘః కాచకలశే ఘటే ప్రాకారగోపురే, | పలిఘః—(పు) ౧ కాచకలశే = గాజుపాత్రము, ౨ ఘటే=కుండ, 3 ప్రాకారగోపురే=ప్రాకారగోపురము. |
| పరిఘో యోగభేదేఽస్త్రవిశేషేఽర్గలఘాతయోః. ౯ | పరిఘః—(పు) ౧ యోగభేదే = పంచాగయోగభేదము, ౨ అస్త్రవిశేషే=ఇనుపకట్లగుదె, 3 అర్గల=గడియమ్రాను, ౪ ఘాతయోః=దెబ్బ. |
| ప్రతిఘః ప్రతిఘాతే స్యా త్క్రోధేఽపి పరికీర్తితః, | ప్రతిఘః—(పు) ౧ ప్రతిఘాతే=పగతీర్చుకొనుట, ౨ క్రోధే=కోపవిశేషము. |
| మహార్ఘస్తు మహామూల్యే త్రిషు స్యాల్లావకేపుమాన్. | మహార్ఘః—(త్రి) ౧ మహామూల్యే = విలువలేనిది, ౨ లావకే=లావుకపక్షి. |
| సర్వౌఘో గురుభేదే చ సర్వసన్నహనే పుమాన్, | సర్వౌఘః—(పు) ౧ గురుభేదే=గురువిశేషము, ౨ సర్వసన్నహనే = చతురంగబలముతో రాజు యుద్ధమునకాయత్తమగుట. |
| ఇతి ఘాంతవర్గః. | ఇది ఘాంతవర్గము. |

| | |
|---|---|
| జైకం. | ఏకాక్షర జశబ్దము. |
| జః పుమాన్ విషయేఖ్యాతః స్పృహాయాం విషయస్యచ | జః—(పు) ౧ విషయే = దేశము, ౨ విషయస్యస్పృహాయాం = శబ్దాదివిషయముయొక్క అపేక్ష. |
| ఇతి జాంతవర్గః. | ఇది జాంతవర్గము. |
| చైకం. | ఏకాక్షర చశబ్దములు. |
| చశ్చండేశే పుమానుక్తః కచ్ఛపే చంద్రచౌరయోః, | చః—(పు) ౧ చండేశే=చండికేశ్వరుఁడు, ౨ కచ్ఛపే = కూర్మము, 3 చంద్ర = చంద్రుఁడు, ౪ చౌరయోః = దొంగవాఁడు. |
| చ ద్వికం. | రెండక్షరములుగల చకారాంత శబ్దములు. |
| అర్చా పూజాప్రతిమయోః | అర్చా—(స్త్రీ) ౧ పూజా=పూజనము, ౨ ప్రతిమయోః=విగ్రహము. |
| కచః కేశే గురోస్సుతే. ౧. బంధే శుష్కవ్రణే పుంసి కరిణ్యాం తు కచా స్త్రియాం, | కచః—(పు) ౧ కేశే=వెంట్రుకలు, ౨ గురోస్సుతే = బృహస్పతిపుత్రుఁడు, 3 బంధే=ముడి, ౪ శుష్కవ్రణే=ఎండినవ్రణము, (పు) కరిణ్యాం=ఆఁడుఏనుగ, (స్త్రీ) కచా. |
| కాచః శిక్యే మణౌ నేత్రరోగభేదే మృదంతరే. ౨ | కాచః—(పు) ౧ శిక్యే=కావెడియుట్టి, ౨ మణౌ=మణి, 3 నేత్రరోగభేదే=నేత్రరోగవిశేషము, ౪ మృదంతరే=మృద్విశేషము. |
| కాంచీ స్యాన్మేఖలాదామ్ని ప్రభేదే నగరస్య చ, | కాంచీ—(స్త్రీ) ౧ మేఖలాదామ్ని=మొలనూలు, ౨ నగరస్యప్రభేదే = కాంచీపట్టణము. |
| కూర్చమస్త్రీ భ్రువోర్మధ్యే కఠినశ్మశ్రుకైతవే. 3 | కూర్చం—(న్న) ౧ భ్రువోర్మధ్యే = కనుబొమ్మలనడుమ, ౨ కఠిన=కఠినము, 3 శ్మశ్రు=మీసాలు, ౪ కైతవే=మిష. |

| | |
|---|---|
| క్రౌంచో ద్వీపవిశేషే స్యా త్పక్షిపర్వతభేదయోః, | క్రౌంచః—(పు) ౧ ద్వీపవిశేషే = ద్వీపవిశేషము, ౨ పక్షి = పక్షివిశేషము, 3 పర్వతభేదయోః = పర్వతవిశేషము. |
| చర్చా చింతాస్థాసకయోః చర్చికాయాం తు యోషితి. | చర్చా—(స్త్రీ) ౧ చింతా = విచారణ, ౨ స్థాసకయోః=కుంకుమ మొదలగువాని పూత, 3 చర్చికాయాం = పార్వతీదేవి. |
| చంచా తు నలనిర్మాణే తృణనిర్మితపూరుషే, | చంచా—(స్త్రీ) ౧ నలనిర్మాణే = నలమను తృణనిర్మాణము, (లేక బొక్కెనఁజేయడము) ౨ తృణనిర్మితపూరుషే=గడ్డితోఁజేయబడిన దృష్టిబొమ్మ. |
| చంచూస్త్రోట్యాం స్త్రియాం పుంసి గోనాడీకే వ్యడంబకే. | చంచూః—(స్త్రీ) ౧ త్రోట్యాం = పక్షిముక్కు, ౨ గోనాడికే = బచ్చలికూర, 3 వ్యడంబకే = ఆముదపుచెట్టు. |
| త్వక్ స్త్రీ చర్మణి వల్కే చ గుడత్వచి విశేషతః, | త్వక్—(స్త్రీ) ౧ చర్మణి = చర్మ, (అనఁగా త్వగింద్రియము) ౨ వల్కే = వృక్షాదులత్వక్కు, 3 గుడత్వచి = లవంగపుచెక్క. |
| న్యఙ్నీచ నిమ్నయో | న్యఙ్—(పు) ౧ నీచ=పొట్టిది, ౨ నిమ్నయోః=లోతుది. |
| ర్నీచః పామరే వామనేఽపి చ. | నీచః—(పు) ౧ పామరే = పామరుఁడు, వామనే=పొట్టివాఁడు. |
| ప్రాక్ఖద్బో దిశి దేశే చ కాలే చ వాచ్యలింగకః, | ప్రాక్—(త్రి) ౧ దిశి = దిగ్విశేషము, ౨ దేశే= దేశవిశేషము, 3 కాలే = కాలవిశేషము. (విశేష్యనిఘ్నము.) |
| పిచుర్నా కుష్ఠభేదే చ కర్షే తూలే సురాంతరే. ౭ | పిచుః—(పు) ౧ కుష్ఠభేదే=కుష్ఠరోగము, ౨ కర్షే=తాండ్రచెట్టు, 3 తూలే=దూది, ౪ సురాంతరే=కల్లు. |

| | |
|---|---|
| మోచశ్శోభాంజనే పుంసి | మోచః—(పు) ౧ శోభాంజనే = మునగ చెట్టు. |
| మోచా శాల్మలిరంభయోః, | మోచా—(స్త్రీ) ౧ శాల్మలి=బూరుగచెట్టు, రంభయోః=అరటిచెట్టు. |
| రుచిస్త్రీ దీప్తౌ శోభాయామభిష్వంగాభిలాషయోః. ౮ | రుచిః—(స్త్రీ) ౧ దీప్తౌ = ప్రకాశము, ౨ శోభాయాం=కాంతి, ౩ అభిష్వంగ = తిట్టడము, ౪ అభిలాషయోః = అభిలాష, ప్రీతి. |
| రుక్ స్త్రీ శోభాద్యుతీచ్ఛాసు | రుక్—(స్త్రీ) ౧ శోభా=కాంతి, ౨ ద్యుతి =ప్రకాశము, ౩ ఇచ్ఛాసు=కోరిక. |
| వచః కరే | వచః—(పు) ౧ కీరే=శుకము. |
| వచౌషధౌ, శారికాయాంచ | వచా—(స్త్రీ) ౧ ఓషధౌ = నల్లపసయను ఓషధి, ౨ శారికాయాం=గోరువంక. |
| వాగ్వాచే భారత్యాం వచనే స్త్రియాం. ౯ | వాక్, వాచా—(స్త్రీ) ౧ భారత్యాం=సరస్వతిదేవి, ౨ వచనే=మాట. |
| వీచిః స్వల్పతరంగే స్యాదవకాశే ముఖేద్వయోః | వీచిః—(స్త్రీ) ౧ స్వల్పతరంగే= కొద్దిఅల, ౨ అవకాశే=అవకాశము, ౩ ముఖే= ముఖము. |
| శచీంద్రాణ్యాంశతావర్యాం తథా స్త్రీ కరణాంతరే. ౧౦ | శచీ—(స్త్రీ) ౧ ఇంద్రాణ్యాం = ఇంద్రుని భార్య, ౨ శతావర్యాం = పిల్లిపీచర చెట్టు, ౩ కరణాంతరే = సాధనాంతరము. |
| శుచిర్గ్రీష్మాగ్నిశృంగారేష్వాషాఢే శుద్ధమంత్రిణి, జ్యేష్ఠే చ పుంసి ధవలే శుద్ధేఽనుపహతే త్రిషు. ౧౧ | శుచిః—(పు) ౧ గ్రీష్మ = గ్రీష్మర్తువు, ౨ అగ్ని=అగ్నిహోత్రము, ౩ శృంగారే =శృంగారము, ౪ ఆషాఢే = ఆషాఢమాసము, ౫ శుద్ధమంత్రిణి=శుద్ధసచివుఁడు, ౬ జ్యేష్ఠే=జ్యేష్ఠమాసము, ౭ ధవళే=తెల్లనిది. (త్రి) ౮ శుద్ధే = పరిశుద్ధమయినది, ౯ అనుపహతే=క్రొత్తది. (కొట్టఁబడనిది). |

| | |
|---|---|
| సూచీ తు సేవనద్రవ్యేఽప్యాంగికాభినయాంతరే. | సూచీ—(స్త్రీ) ౧ సేవనద్రవ్యే=కుట్టుడుసాధనమగుసూది, ౨ ఆంగికాభినయాంతరే=హస్తాభినయవిశేషము. |
| **చత్రికం.** | **మూడక్షరములుగల చకారాంత శబ్దములు.** |
| ఉదగ్దిగ్దేశకాలేషు వాచ్యవత్త్రితయే వ్యయం. ౧౨ | ఉదక్—(త్రి) ౧ దిక్ = దిగ్విశేషము, ౨ దేశ=దేశవిశేషము (ఉత్తరదేశము.) ౩ కాలేషు = కాలవిశేషము, విశేష్యనిఘ్నం. మూటికిపేరగునప్పుడు అవ్యయం (ఉదక్.) |
| కణీచీ పుష్పితలతాగుంజయోః శకటే స్త్రియాం. | కణీచీ—(స్త్రీ) ౧ పుష్పితలతా=పుష్పించినతీగ, ౨ గుంజయోః = గురిగింజతీగ, ౩ శకటే=శకటము. |
| కవచో గర్దభాండే చ సన్నాహే పటహేఽపి చ. ౧౩ | కవచః—(పు) ౧ గర్దభాండే = కలజువ్విచెట్టు, ౨ సన్నాహే = ప్రయత్నము, ౩ పటహే=డప్పు. |
| క్రకచః కరపత్రే స్త్రీ గ్రంధిలాఖ్యతరౌ పుమాన్, | క్రకచః—(పు) ౧ కరపత్రే = ఱంపము, ౨ గ్రంధిలాఖ్యతరౌ = వెణుదురుచెట్టు. (పు) |
| నముచిస్తు పుమాన్దైత్యభేదే కుసుమకార్ముకే. ౧౪ | నముచిః—(పు) ౧ దైత్యభేదే = దానవవిశేషము, ౨ కుసుమకార్ముకే = మన్మథుఁడు. |
| నారాచ్యేషణికాయాం నా లోహబాణాంబుహస్తినోః, | నారాచీ—(స్త్రీ) ౧ ఏషణికాయాం = శాణము, ౨ లోహబాణ = ఇనుపబాణము ౩ అంబుహస్తినోః = నీటియేనుఁగ. (పు). |
| ప్రపంచస్సంచయేఽపిస్యాద్విస్తారే చ ప్రతారణే. ౧౫ | ప్రపంచః—(పు) ౧ సంచయే = సముదాయము, ౨ విస్తారే=విస్తృతి, ౩ ప్రతారణే=వచించుట. |

ప్రత్యగ్దిగ్దేశకాలేషు వాచ్యవత్త్రితయేఽవ్యయం,

ప్రత్యక్—(త్రి) ౧ దిక్=పశ్చిమదిక్కు, ౨ దేశే=పశ్చిమ దేశము, 3 కాలేషు=గడచిన కాలము, (విశేష్యనిఘ్నము) మూడు అర్థములకు పేరగునప్పుడు, (అవ్యయము.)

మరీచిర్మునిభేదే నా గభస్తావనపుంసకమ్. ౧౬

మరీచిః—(పు) ౧ మునిభేదే=మరీచియను మునివిశేషము, ౨ గభస్తౌ = కిరణము (పు.)

మారీచో రక్షసోభేదే కక్కోలే యాజకద్విజే,

మారీచః—(పు) ౧ రక్షసోభేదే=రాక్షస విశేషము, ౨ కక్కోలే=తక్కోలాల చెట్టు, 3 యాజకద్విజే=యాజకబ్రాహ్మణుఁడు.

మారీచీ దేవతాభేదే

మారీచీ—(స్త్రీ) ౧ దేవతాభేదే=దేవతా విశేషము.

విపంచీ కేలివీణయోః. ౧౭

విపంచీ—(స్త్రీ) ౧ కేలి=క్రీడ, ౨ వీణయోః=వీణ.

వికచః క్షపణే కేతావకేశే స్ఫుటితేఽన్యవత్,

వికచః—(పు)౧ క్షపణే=క్షపణమతస్థుఁడు, ౨ కేతౌ=జండా, 3 అకేశే=వెండ్రుకలు లేనిది, ౪ స్ఫుటితే = బద్ధలైనది, (విశేష్యనిఘ్నము).

విరించిర్నా విరించశ్చ వైకుంఠే పరమేష్ఠిని. ౧౮

విరించిః, విరించః—(పు) ౧ వైకుంఠే = విష్ణుమూర్తి, ౨ పరమేష్ఠిని = బ్రహ్మదేవుఁడు.

సంకోచో మీనభేదే స్యాద్బంధే క్లీబం తు కుంకుమే,

సంకోచః—(పు) ౧ మీనభేదే=మత్స్య విశేషము, ౨ బంధే=బంధము, 3 కుంకుమే=కుంకుమ (న.)

సమ్యక్ స్యాద్వాచ్యలిఙ్గస్తు మనోజ్ఞే సంగతేఽపి చ. ౧౯

సమ్యక్—౧ మనోజ్ఞే=మనోహరమైనది, ౨ సంగతే = సంగతమైనది, (విశేష్యనిఘ్నము.)

—● చ చతుష్కం. ●—

జలసూచిః కంకత్రోటీమత్స్య శృంగాటయోరపి, శింశుమారే చ పుంలిఙ్గో జలౌకాయాం తు యోషితి.

మలిమ్లుచో మాంసభేదే చోరజ్వలనయోః పుమాన్

—● చ పంచకం. ●—

రతనారీచో నారీణాం సీత్కారే చ శుని స్మరే. ౨౧

ఇతి చాంతవర్గః.

—● ఛైకం. ●—

ఛా ఛాదనే స్త్రియాం ఖ్యాతా నిర్మలేన్యవదిష్యతే,

—● ఛద్వికమ్. ●—

అచ్ఛః స్ఫటికభల్లూకనిర్మలే ష్వచ్ఛమవ్యయం. ౧

ఆభిముఖ్యేఽథ కచ్ఛస్స్యాదనూపే తున్నకద్రుమే, నౌకాంగే పుంసి వారాహ్యాం

నాలుగక్షరములుగల చకారాంత శబ్దములు.

జలసూచిః—(పు) ౧ కంకత్రోటీ=తాబులుగుముక్కు, ౨ మత్స్యే=చేప, 3 శృంగాటయోః = ఏనుఁగుపల్లేరు, ౪ శింశుమారే=శింశుమారచక్రము, ౫ జలౌకాయాం=జెలగ (స్త్రీ).

మలిమ్లుచః—(పు)౧ మాంసభేదే=మాంసవిశేషము, ౨ చోర=దొంగ, 3 జ్వలనయోః=అగ్నిహోత్రము.

అయిదక్షరములుగల చకారాంత శబ్దములు.

రతనారీచః— (పు) ౧. నారీణాంసీత్కారే = స్త్రీలసీత్కారధ్వని, ౨ శుని = కుక్క, స్మరే=మన్మథుఁడు.

ఇది చాంతవర్గము.

ఏకాక్షరఛాంతశబ్దములు.

ఛా—(స్త్రీ) ౧ ఆఛాదనే= ఆఛాదనము, ౨ నిర్మలే=నిర్మలమైనది.

రెండక్షరములుగల ఛకారాంత శబ్దములు.

అచ్ఛః—(పు) ౧ స్ఫటిక = స్ఫటికము, ౨ భల్లూక=ఎలుగుబంటు, 3 నిర్మలేషు= నిర్మలమైనది. యీ మూడర్థములయందు అవ్యయము, (అచ్ఛమ్.)

కచ్ఛః—(పు) ౧ ఆభిముఖ్యే=ఆభిముఖ్యము, ౨ అనూపే=నిరంతరము నీళ్లుగల ప్రదేశము, 3 తున్నకద్రుమే = నంది

| | |
|---|---|
| చీరికాయాం చ యోషితి. | వృక్షము, ౪ నౌకాంగే=ఓడయొక్క అవయవము, ౫ వారాహ్యాం=వారహి యను దేవతావిశేషము, (స్త్రీ) ౬ చీరికాయాం = గట్టిపడినమలవిశేషము. |
| స్యాద్గుచ్ఛస్తబకే స్తంబే హారభేదకలాపయోః, | గుచ్ఛః—(పు) ౧ స్తబకే=పూలగుత్తి, ౨ స్తంబే=కాడ, ౩ హారభేద = హారవిశేషము, ౪ కలాపయోః=భూషణము. |
| పిచ్ఛా పూగఘటాకోశమోచాశాల్మలివేష్టకే. భక్తసంభూతమండే చ పంక్తౌ వశ్వపదామయే, స్త్రియాంపుంసి తు లాఙ్గూలే న ద్వయోర్బర్హచూడయోః. ౪ | పిచ్ఛా—(స్త్రీ) ౧ పూగ=పోఁకచెట్టు, ౨ ఘటా = సముదాయము, ౩ కోశ = మొగ్గ, ౪ మోచా = అరటిచెట్టు, ౫ శాల్మలివేష్టకే=బూరుగుబంక, ౬ భక్తసంభూతమండే = అన్నముమీఁదిగంజి మీఁగడ, ౭ పంక్తౌ=పంక్తి, ౮ అశ్వపదామయే=గుఱ్ఱపుకాలిరోగము, ౯ లాంగూలే = తోఁక, (పు) ౧౦ బర్హా= నెమలిపింఛము, (న) ౧౧ చూడయోః =శిఖ, (మగవానిజుట్టు.) |
| పుచ్ఛః పశ్చాత్ప్రదేశే స్యాల్లాంగూలే పుచ్ఛమిష్యతే, మ్లేచ్ఛః పామరభేదే చ సాపరక్తేఽపభాషణే. ౫ | పుచ్ఛః—(పు) ౧ పశ్చాత్ప్రదేశే=వెనుక ప్రదేశము, ౨ లాంగూలే=తోఁక.(న) మ్లేచ్ఛః— ౧ పామరభేదే = పామరవిశేషము, ౨ పాపరక్తే=పాపాసక్తుఁడు, ౩ అపభాషణే=చెడ్డమాట. |

---

| | |
|---|---|
| ఛ చతుష్కం. | నాలుగక్షరములుగల ఛకారాంత శబ్దములు. |
| మహాకచ్ఛస్తు పుంసి స్యాత్సముద్రే చ ప్రచేతసి. ౫ | మహాకచ్ఛః—(పు) ౧ సముద్రే = సముద్రుఁడు, ౨ ప్రచేతసి=వరుణుఁడు. |
| ఇతి ఛాంతవర్గః | ఇది ఛాంతవర్గము. |

◆ జైకమ్. ◆

ఏకాక్షర జశబ్దములు.

జో నా మృత్యుంజయే జన్యాం తాతమాత్రే జనార్దనే

జః—(పు) ౧ మృత్యుంజయే=మృత్యుంజయుఁడు, ౨ జన్యాం = పుట్టుక, 3 తాతమాత్రే = పితృమాత్రుఁడు, ౪ జనార్దనే=విష్ణువు

జూస్త్వరాగమనే ప్రోక్తా సామాన్యగమనే స్త్రియాం. ౧ జూరాకాశేసరస్వత్యాం పిశాచ్యాం జవనేఽపి చ

జూః—(స్త్రీ) ౧ త్వరాగమనే=తొందరగల రాకడ, ౨ సామాన్యగమనే = మామూలునడక, 3 ఆకాశే=ఆకాశము, ౪ సరస్వత్యాం = సరస్వతి, ౫ పిశాచ్యాం పిశాచి. జవనే=వేగము.

---

◆ జ ద్వికం. ◆

రెండక్షరములుగల జకారాంత శబ్దములు.

అజః ఛాగే హరిబ్రహ్మవిధుస్మర నృపే హరే. ౨

అజః—(పు) ౧ ఛాగే=మేక, ౨ హరి = విష్ణువు, 3 బ్రహ్మ=బ్రహ్మదేవుఁడు, ౪ విధు=చంద్రుఁడు, ౫ స్మర = మన్మథుఁడు, ౬ నృపే=అజమహారాజు, ౭ హరే=శంకరుఁడు

అబ్జోఽస్త్రీ శంఖే నా నిచులే ధన్వంతరౌ చ హిమకిరణే, క్లీబం పద్మేఽ

అబ్జః—(పు) ౧ శంఖే = శంఖము, ౨ నిచులే = నీటిప్రబ్బలిచెట్టు (పు), 3 ధన్వంతరౌ = ధన్వంతరి, ౪ హిమకిరణే=చంద్రుఁడు, ౫ పద్మే = తామరపూవు (న).

ఆజిః స్త్రీ సమభూమౌ చ సంగ్రామే. 3

ఆజిః—(స్త్రీ) ౧ సమభూమౌ = సమభూమి ౨ సంగ్రామే=యుద్ధము.

ఊర్జస్తు కార్తికోత్సాహబలేషు ప్రాణనేఽపి చ,

ఊర్జః—(పు) ౧ కార్తిక = కార్తికమాసము, ౨ ఉత్సాహ=ఉత్సాహము, 3 బలేషు=బలము, ౪ ప్రాణనే=బ్రదుకుట.

కంజః కేశే విరించౌ చ

కంజః—(పు) ౧ కేశే = వెండ్రుకలు, ౨ విరించౌ=బ్రహ్మ.

| | |
|---|---|
| కంజం పీయూషపద్మయోః. ౪ | కంజం—(న) ౧ పీయూష=అమృతము, పద్మయోః=పద్మము, |
| కుజా కాత్యాయనీదేవ్యాం | కుజా—(స్త్రీ). ౧ కాత్యాయనీదేవ్యాం=పార్వతి. |
| కుజో నరకభౌమయోః, | కుజః—(స్త్రీ) ౧ నరక=నరకాసురుఁడు, ౨ భౌమయోః=అంగారకుఁడు. |
| కుబ్జో వృక్షప్రభేదే నాన్యుబ్జే స్యాద్వాచ్యలిఙ్గకః. ౫ | కుబ్జః—(పు) ౧ వృక్షప్రభేదే=ఉత్తరేణు ౨ న్యుబ్జే=బొక్కిరొమ్ము (మఱుగుజ్జు) వాఁడు. (త్రి). |
| కుంజో౽స్త్రియాం నికుంజే౽పి హనౌ దంతే౽పి హస్తినాం | కుంజః—(ప్న) ౧ నికుంజే = పొదరిల్లు, ౨ హనౌ=దౌడ, 3 హస్తినాందంతే =ఏనుఁగుదంతము. |
| ఖంజా ఛందఃప్రభేదే స్త్రీ కుటిలాంఘ్రౌ తు వాచ్యవత్. ౬ | ఖంజా—(స్త్రీ) ౧ ఛందఃప్రభేదే=ఛందోభేదము, ౨ కుటిలాంఘ్రౌ = కుంటివాఁడు. త్రి. |
| ఖజా మంథే ప్రహస్తే౽ | ఖజా—(స్త్రీ) ౧ మంథే=కవ్వము, ౨ ప్రహస్తే=అరచేయి. |
| ·థ ఖర్జుః కీటాంతరేస్మృతా, | ఖర్జుః—(పు) ౧ కీటాంతరే = ఒకానొక పురుగు. |
| ఖర్జూరీ పాదపే కండ్వాం | ఖర్జూరీ—(స్త్రీ) ౧ పాదపే=ఖర్జూరపుచెట్టు ౨ కండ్వాం=దురద. |
| గజో మానే మతంగజే. ౭. వాస్తునః స్థానభేదే౽పి | గజః—(పు) ౧ మానే = కొలతలోని గజము, ౨ మతంగజే=ఏనుఁగు, 3 వాస్తునఃస్థానభేదే=వాస్తువునందలిస్థల విశేషము. |
| గంజా ఖనౌ సురాగృహే, | గంజా—(స్త్రీ) ౧ ఖనౌ=గని, ౨ సురాగృహే=కల్లంగడి. |
| గంజఃస్యాత్పుంసి రిఘాయాం భాండాగారే తు న స్త్రియాం. ౮ | గంజః—(పు) ౧ రిఘాయాం = అవమానము, ౨ భాండాగారే = ఖజానాకొట్టు. (ప్న). |

| | |
|---|---|
| గుంజా తు కాకచించాయాం పటహే చ కలధ్వనౌ | గుంజా—(స్త్రీ) ౧ కాకచించాయాం = పూసగురువిందచెట్టు, ౨ పటహే = తప్పెట, 3 కలధ్వనౌ = మనోహరధ్వని. |
| ద్విజఃస్యాద్బ్రాహ్మణక్షత్రవైశ్యదంతాండజేషు నా. ౯ | ద్విజః—(పు) ౧ బ్రాహ్మణ=బ్రాహ్మణుఁడు, ౨ క్షత్ర=క్షత్రియుఁడు, 3 వైశ్య = కోమటి, ౪ దంత = దంతములు, ౫ అండజేషు=పక్షులు. |
| ద్విజా భార్గ్యాం హరేణౌ చ | ద్విజా—(స్త్రీ) ౧ భార్గ్యాం=భారంకియను చెట్టు, హరేణౌ=తక్కోలము. |
| ధ్వజఃస్యాచ్ఛౌండికేపుమాన్, న స్త్రియాం తు పతాకాయాం ఖట్వాంగే మేఢ్రచిహ్నయోః. ౧౦ | ధ్వజః—(పు) ౧ శౌండికే = కల్లమ్ముకొని బ్రదుకువాఁడు, ౨ పతాకాయాం= జెండా, (పు) 3 ఖట్వాంగే=ఆయుధవిశేషము, ౪ మేఢ్రే = శిశ్నము, ౫ చిహ్నయోః=గుర్తు. |
| నిజం స్వీయే చ నిత్యే చ | నిజం—(న) ౧ స్వీయే = స్వకీయము, ౨ నిత్యే=నిలుకడగలది. |
| న్యుబ్జో దర్భమయస్రుచి, కర్మరంగఫలే క్లీబం కుబ్జాధోముఖయో స్త్రిషు. ౧౧ | న్యుబ్జః—(పు) ౧ దర్భమయస్రుచి=దర్భతోఁజేసిన స్రుక్కు. ౨ కర్మరంగఫలే= ఒకానొకవృక్షఫలము (న) 3 కుబ్జా= మఱుగుజ్జు, (త్రి). ౪ అధోముఖయోః =అధోముఖుఁడు. |
| ప్రజా లోకే చ సంతానే | ప్రజా—(స్త్రీ) ౧ లోకే = లోకము, ౨ సంతానే=సంతతి. |
| పింజా తూలహారిద్రయోః, బలే క్లీబం వధే పుంసివ్యాకులే త్రిష్వథో | పింజా—(స్త్రీ) ౧ తూల = దూదిపింజె, ౨ హారిద్రయోః=పసుపు, 3 బలే=బలము, (న). ౪ వధే = చంపుట, (పు), ౫ వ్యాకులే=కలతనొందుట (త్రి). |
| భుజా. ౧౨. ద్వయో ర్బాహౌ కరే | భుజా—(ప్ర) ౧ బాహౌ=బాహువులు, ౨ కరే=చేయి. |

మర్జూః స్త్రీ శుద్ధౌ ధావకే౽పిచ

మర్జూః—(స్త్రీ). ౧ శుద్ధౌ=పరిశుద్ధిచేయుట, ౨ ధావకే=చాకలివాడు.

రజో రేణౌ పరాగే స్యాదార్తవే చ గుణాంతరే. ౧౩

రజః—(న) ౧ రేణౌ = దుమ్ము, ౨ పరాగే = పుప్పొడి, ౩ ఆర్తవే = ఋతురక్తము, ౩ గుణాంతరే=రజోగుణము.

రజ్జుర్వేణ్యాం గుణే యోషి

రజ్జుః—(స్త్రీ) ౧ వేణ్యాం=జడ, ౨ గుణే=త్రాడు.

రాజిః స్త్రీ పఙ్క్తిలేఖయోః,

రాజిః—(స్త్రీ) ౧ పంక్తి=వరుస, ౨ లేఖయోః=గీత.

రుజా రోగే చ భంగే౽

రుజా—(స్త్రీ) ౧ రోగే = రోగము, ౨ భంగే=పరాభవము

థ లాజస్యాదార్ద్రతండులే. ౧౪. నపుంసకముశీరే౽థ స్త్రియాం పుంభూమ్ని చాక్షతే,

లాజః—(పు) ౧ ఆర్ద్రతండులే=తడిసిన బియ్యము, ౨ ఉశీరే=వట్టివేరు. (న). ౩ అక్షతే=అక్షతలు, (స్త్రీ) (పేలాలు.)

వ్రజో గోష్ఠాధ్వబృందేషు

వ్రజః—(పు) ౧ గోష్ఠ = గోవులదొడ్డి, ౨ అధ్వ=బాట, ౩ బృందేషు = సముదాయము.

వాజో నిస్వనపక్షయోః. ౧౫. వేగే పుమానథ క్లీబే ఘృతయజ్ఞాన్నవారిషు,

వాజః—(పు) ౧ నిస్వన=ధ్వని, ౨ పక్షయోః=రెక్క, వేగే = వేగము, ౪ ఘృత=నెయ్యి, (న). ౫ యజ్ఞ=యాగము, ౬ అన్న=అన్నము, ౭ వారిషు=నీరు.

వ్యాజశ్శాఠ్యే౽పదేశే౽థ

వ్యాజః—(పు) ౧ శాఠ్యే=దౌర్జన్యము, ౨ అపదేశే=నెపము.

బీజమంకురకారణే. ౧౬. హేతుతత్త్వావధానశుక్రే

బీజం—(న) ౧ అంకురకారణే = విత్తనము, ౨ హేతు = కారణము, ౩ తత్త్వావధాన = తత్వ నిరూపణము, ౪ శుక్రే=రేతస్సు.

శితిర్భూర్జే నా సితాసితయో స్త్రిషు,

శితిః—(పు) ౧ భూర్జే=భూర్జవృక్షము, ౨ సిత=తెల్లనిది, ౩ అసితయోః=నల్లనిది (త్రి.)

శీతం హిమగుణే క్లీబం శీతలాలసయో స్త్రిషు. ౬౪. వానీరే బహువారే నా

శీతం—(న) ౧ హిమగుణే = మంచుగుణము, (త్రి) ౨ శీతల=చల్లనిది, ౩ అలసయోః = మందమైనది, ౪ వానీరే= నీటిప్రబ్బ, ౫ బహువారే = విరిగిచెట్టు (పు.)

శుక్తం పూతామ్లనిష్ఠురే,

శుక్తం—(న) ౧ పూత=పవిత్రమైనది. ౨ ఆమ్ల=పుల్లనిది, ౩ నిష్ఠురే = కఠినమైనది.

శ్రుతిః శ్రోత్రే చ తత్కర్మ ణ్యామ్నాయ వార్తయోః స్త్రియాం. ౬౫

శ్రుతిః—(స్త్రీ) ౧ శ్రోత్రే = శ్రోత్రము, ౨ తత్కర్మణి=వినుట, ౩ ఆమ్నాయ=వేదము, ౪ వార్తయోః=వార్త.

శుక్తిః కపాలశకలే శంఖే శంఖనఖేఽపి చ, నఖ్యశ్వావర్తదుర్నామ ముక్తాస్ఫోటేషు చ స్త్రియామ్. ౬౬

శుక్తిః —(స్త్రీ) ౧ కపాలశకలే=కపాలపుప్రక్క, ౨ శంఖే=శంఖము, ౩ శంఖనఖే=నత్తగుల్ల, ౪ నఖీ=నఖముచిప్ప, ౫ అశ్వావర్త = గుఱ్ఱముసుడి, ౬ దుర్నామ=ఏనుఁగజెలగ, ౭ ముక్తాస్ఫోటేషు=ముత్తెపుచిప్ప.

శ్రుతమాకర్ణితే శాస్త్రే

శ్రుతం—(న) ౧ ఆకర్ణితే=వినఁబడినది, ౨ శాస్త్రే=శాస్త్రము.

శ్వేతో ద్వీపాద్రిభేదయోః,

శ్వేతః—(పు) ౧ ద్వీప = శ్వేతదీపము, ౨ అద్రిభేదయోః= శ్వేతపర్వతము, (కైలాసపర్వతము.)

శ్వేతా వరాటికా కాష్ఠపాటలా శంఖినీషు చ. ౬౭. క్లీబం రూప్యేఽన్యవచ్ఛుక్లే సత్సాధౌ ధీరశస్త్రయోః, మాన్యే సత్యే విద్యమానే

శ్వేతా—(స్త్రీ) వరాటికా=గవ్వ, ౨ కాష్ఠ=కట్టె, ౩ పాటలా=కలిగొట్టుచెట్టు, ౪ శంఖినీషు=స్త్రీజాతివిశేషము, ౫ రూప్యే=వెండి (న) ౬ శుక్లే = తెల్లనిది, (వి. ఘ్న) ౭ సత్సాధౌ=శ్రేష్ఠసాధువు,

త్రిషు సాధ్వ్యుమయోః స్త్రియామ్. ౬౮ — ౮ ధీర=ధైర్యముగలవాఁడు, ౯ శస్త్రయోః=బాణము, ౧౦ మాన్యే=మాన్యుఁడు, ౧౧ సత్యే=సత్యమైనది, ౧౨ విద్యమానే=ఉన్నది, (త్రి) ౧3 సాధ్వీ=పతివ్రత, ౧౪ ఉమయోః=పార్వతి. (స్త్రీ)

సాతిర్దానేఽవసానే స్త్రీ — సాతిః—(స్త్రీ) ౧ దానే=దానము, ౨ అవసానే=అవసానము.

స్వాంతం చేతసి గహ్వరే, — స్వాంతం—(న) ౧ చేతసి = మనస్సు, ౨ గహ్వరే=గుహ.

స్థితం ప్రతిజ్ఞాతవతి చోర్ధ్వే నిశ్చలయో స్త్రిషు. ౬౯ — స్థితం—(త్రి) ౧ ప్రతిజ్ఞాతవతి = ప్రతిజ్ఞగలది, ౨ ఊర్ధ్వే=పైది, 3 నిశ్చలయోః =నిశ్చలమైనది.

స్థితిః స్త్రియామవస్థానే మర్యాదాయాం చ సీమని, — స్థితిః—(స్త్రీ) ౧ అవస్థానే = ఉండుట, ౨ మర్యాదాయాం=మర్యాద, 3 సీమని =పొలిమేర.

సితమవసితే చ బద్ధే ధవలే త్రిషు ధవలాయాం స్త్రీ. — సితం—(త్రి) ౧ అవసితే = అవసానము పొందినది, ౨ బద్ధే = కట్టఁబడినది, 3 ధవలే = తెల్లనిది, ౪ ధవలాయాం = చక్కనిది. (స్త్రీ)

సీతా లాంగలపద్ధతిర్వైదేహీ స్వర్గంగాసు, — సీతా—(స్త్రీ) ౧ లాంగలపద్ధతి = నాగేటిచాలు, ౨ వైదేహీ=సీతాదేవి, 3 స్వర్గంగాసు=ఆకాశగంగ.

సుతస్తు పార్థివే పుత్రే స్త్ర్యపత్యే తు సుతా స్మృతా. ౭౧ — సుతః—(పు) ౧ పార్థివే=రాజు, ౨ పుత్రే = కొడుకు, 3 స్త్ర్యపత్యే = స్త్రీసంతానము. (సుతా)

సుప్తిస్స్పర్శాజ్ఞతానిద్రావిశ్రంభే శయనే స్త్రియామ్, — సుప్తిః—(స్త్రీ) ౧ స్పర్శాజ్ఞతా = స్పర్శను గుర్తెఱుగకపోవుట, ౨ నిద్రా=నిద్ర, 3 విశ్రంభే=విశ్వాసము, ౪ శయనే=శయనము.

| | |
|---|---|
| సూతస్తు సారథౌ తక్ష్ణి క్షత్రియాద్బ్రాహ్మణీసుతే. ౭-౨. వందిపారదయోః పుంసిప్రసూతే ప్రేరితే త్రిషు, | సూతః—(పు) ౧ సారథౌ = సారథి, ౨ తక్ష్ణి = వడ్లవాఁడు, (వడ్రంగి.) 3 క్షత్రియాత్ బ్రాహ్మణీసుతే = క్షత్రియునివల్ల బ్రాహ్మణస్త్రీయందు పుట్టినవాఁడు, ౪ వంది = స్తుతిపాఠకుఁడు, ౫ పారదయోః=పాదరసము, (పు) ౬ ప్రసూతే = కనుట, ౭ ప్రేరితే=ప్రేరేపింపఁబడినది. (త్రి) |
| స్యూతిస్సీవనసంతత్యోః స్త్రియాం, | స్యూతిః—(స్త్రీ) ౧ సీవన=బట్టకుట్టుట, ౨ సంతత్యోః=సంతతి. |
| స్యూతః ప్రసేవకే. ౭౩. నా త్రిషూతే | స్యూతః—(పు) ౧ ప్రసేవకే=పల్లికతట్ట, ౨ ఊతే=కుట్టఁబడినది. (త్రి) |
| స్మృతిర్ధర్మశాస్త్ర స్మరణయోః స్త్రియాం, | స్మృతిః—(స్త్రీ) ౧ ధర్మశాస్త్ర = ధర్మశాస్త్రము, ౨ స్మరణయోః=జ్ఞాపకము. |
| సృతిః స్త్రీ గమనే మార్గే, | సృతిః—(స్త్రీ) ౧ గమనే = పోవుట, ౨ మార్గే=మార్గము. |
| సేతుర్నా ఽఽలౌ కుమారకే | సేతుః—(పు) ౧ ఆలౌ = కట్ట, ౨ కుమారకే=కుమారుఁడు. |
| హస్తః కరే కరికరే సప్రకోష్ఠకరేఽపి చ, ఋక్షే కేశాత్పరో వ్రాతే | హస్తః—(పు) ౧ కరే=చెయ్యి, ౨ కరికరే=ఏనుఁగతుండము, 3 సప్రకోష్ఠకరే=ముంజేయితోఁ గూడిన హస్తము, ౪ ఋక్షే=హస్తానక్షత్రము, ౫ కేశాత్పరఃహస్తః = కేశశబ్దానంతరహస్తశబ్దము, ౬ వ్రాతే=సముదాయము. |
| హితం పథ్యే గతే ధృతే. | హితం--(న)౧ పథ్యే=హితమైనది, ౨ గతే =పోయినది, 3 ధృతే=ధరింపఁబడినది. |
| హేతిస్స్యాదాయుధజ్వాలా సూర్యతేజస్సు యోషితి, | హేతిః—(స్త్రీ) ౧ ఆయుధ = ఆయుధము, ౨ జ్వాలా=జ్వాల, 3 సూర్యతేజస్సు= సూర్యతేజస్సు. |

## త త్రికం.

## మూడక్షరములుగల తకారాంత శబ్దములు.

అమృతం యజ్ఞశేషే స్యాత్పీయూషే సలిలే ఘృతే. ౭౬. అయాచితే చ మోక్షే చ నా ధన్వంతరిదేవయోః

అమృతం—(న) ౧ యజ్ఞశేషే = యజ్ఞశేషము, ౨ పీయూషే=అమృతము, 3 సలిలే = ఉదకము, ౪ ఘృతే = ఘృతము, ౫ అయాచితే=యాచింపఁబడనిది, ౬ మోక్షే=మోక్షము, (పు) ౭ ధన్వంతరి=ధన్వంతరి, ౮ దేవయోః= దేవతలు.

అమృతా మాగధీపథ్యాగుడూచ్యామలకీషు చ. ౭౭

అమృతా—(స్త్రీ) ౧ మాగధీ=అడవిమొల్ల, ౨ పథ్యా=కరక చెట్టు, 3 గుడూచీ= తిప్పఁతీగ, ౪ అమలకేషు=ఉసిరిక చెట్టు.

అనృతం కృషావసత్యే౽

అనృతం—(న) ౧ కృషౌ = కృషి, ౨ అసత్యే=అసత్యము.

ప్యజితో నా హరౌ త్రిషు, అనిర్జితే

అజితః—(పు) ౧ హరౌ = విష్ణువు, ౨ అనిర్జితే=జయింపఁబడనివాఁడు.

చాచ్యుతస్తు హరౌ పుంసి త్రిషు స్థిరే. ౭౮

అచ్యుతః—(పు) ౧ హరౌ = విష్ణువు, ౨ స్థిరే=స్థిరుఁడు. (త్రి)

అర్థితం యాచితే౽పి స్యాద్వాతవ్యాధౌ చ హింసితే,

అర్థితం—(న) ౧ యాచితే = యాచింపఁబడినది, ౨ వాతవ్యాధౌ = వాతరోగము, 3 హింసితే=చంపఁబడినది.

అక్షతం న ద్వయోః పండే లాజేషు త్రిష్వహింసితే. ౭౯. యవే౽పి క్వచి

అక్షతం—(న) ౧ పండే = నపుంసకుఁడు, ౨ లాజేషు=పేలాలు, (త్రి) 3 అహింసితే=హింసింపఁబడనివాఁడు, ౪ యవే =యవలున్ను.

దవ్యక్తో హరౌ స్మరహరే పుమాన్, పరమాత్మమహదాద్యోః క్లీబం స్యాదస్ఫుటే త్రిషు. ౮౦

అవ్యక్తః—(పు) ౧ హరౌ = విష్ణువు, ౨ స్మరహరే = హరుఁడు, (న) 3 పరమాత్మ=పరమాత్మ, ౪ మహదాద్యోః =మహత్తు మొదలగునవి, ౫ అస్ఫుటే= స్ఫుటముగానిది. (త్రి)

| | |
|---|---|
| అనంతః కేశవే శేషే పుమా ననవధౌ త్రిషు, | అనంతః—(పు) ౧ కేశవే = విష్ణువు, ౨ శేషే=ఆదిశేషువు, 3 అనవధౌ=అవధి లేనిది. (త్రి) |
| అనంతా చ విశల్యాయాం శారిబాదూర్వయోరపి. ౮౧ కణాదురాలభా పథ్యాపా ర్వత్యామలకీషు చ, విశ్వం భరాగుడూచ్యోస్స్యా | అనంతా—(స్త్రీ) ౧ విశల్యాయాం = తరిగొట్టకూర, ౨ శారిబా=సుగంధిపాల, 3 దూర్వయోః=గరికె, ౪ కణా=జీలకఱ్ఱ, ౫ దురాలభా=పిన్నదూలగొండి, ౬ పథ్యా = కరక్కాయ, ౭ పార్వతి = పార్వతి దేవి, లేక (అందుగుచెట్టు), ౮ ఆమలకీషు = ఉసిరిక, ౯ విశ్వంభరా=భూమి, ౧౦ గుడూచ్యోః=తిప్పతీఁగ. |
| దనంతం సురవర్త్మని. ౮౨ | అనంతం—(న) ౧ సురవర్త్మని=ఆకాశము. |
| అశ్మంతమశుభే చుల్ల్యాం మరణేఽనవధావపి, క్షేత్రేఽప్య | అశ్మంతం—(న) ౧ అశుభే=అమంగళము, ౨ చుల్ల్యాం = పొయ్యి, 3 మరణే= మరణము, ౪ అనవధౌ = అవధిలేక పోవుట, ౫ క్షేత్రే=క్షేత్రము. |
| థాఽయతిః పుంసి హిమదీధితికాలయోః. ౮3 | ఆయతిః—(పు) ౧ హిమదీధితి = చంద్రుఁడు, ౨ కాలయోః = ఉత్తర కాలము. |
| అర్హాంస్తు క్షపణే బుద్ధే పుంసి మాన్యేఽన్యలింగకః, | అర్హాన్—(పు) ౧ క్షపణే = క్షపణమతస్థుఁడు, ౨ బుద్ధే = బుద్ధుఁడు, 3 మాన్యే=పూజ్యుఁడు, (వి. ని.) |
| అర్హంతశ్చాపి సుగతే క్షపణేఽపి చ దృశ్యతే. ౮౪ | అర్హంతః—(పు) ౧ సుగతే=బుద్ధుఁడు, ౨ క్షపణే=క్షపణమతస్థుఁడు. |
| అగస్తిః కుంభయోనౌ చ వంకసేనతరౌ పుమాన్, | అగస్తిః—(పు) ౧ కుంభయోనౌ = అగస్త్యుఁడు, ౨ వంకసేనతరౌ = అగిసచెట్టు. |
| అర్వతీ కుంభదాస్యాంచ బడబాయాం చ యోషితి. | అర్వతీ—(స్త్రీ)౧ కుంభదాస్యాం=యింట్లో పనిజేయునది, ౨ బడబాయాం=ఆడుగుఱ్ఱము. |

| | |
|---|---|
| అంగతిః పుంస్యగ్నిహోత్రి బ్రహ్మవహ్నిష్వ | అంగతిః—(పు) ౧ అగ్నిహోత్రి = (అగ్నుల వేల్చువాఁడు, ౨ బ్రహ్మ = బ్రహ్మదేవుఁడు, 3 వహ్నిషు=అగ్ని. |
| థాదితిః, భూదేవమాత్రోః | అదితిః—(స్త్రీ) ౧ భూ = భూమి, ౨ దేవమాత్రోః= దేవతలతల్లి. |
| రంహతిస్త్యాగే రోగేఽప్యథ స్త్రీయా. ౨౬ | అంహతిః—(స్త్రీ) ౧ త్యాగే=దానము, ౨ రోగే=రోగము. |
| ఆపాతః పుంసి పతనే తదాత్వే చ ప్రకీర్తితః, | ఆపాతః—(పు) ౧ పతనే = పతనము, ౨ తదాత్వే=అప్పుడు. |
| ఆఘ్రాతం శింఘితే క్రాంతేఽ | ఆఘ్రాతం—(న) ౧ శింఘితే=వాసనజూడఁబడినది, ౨ క్రాంతే=ఆక్రమింపఁబడినది. |
| ప్యాఖ్యాతం భాషితే తిజి. | ఆఖ్యాతం—(న) ౧ భాషితే = వాక్కు, ౨ తిజి=తిఙ్ప్రత్యయము. |
| ఆధ్మాతశ్శబ్దితే దగ్ధే వాతరుగ్భేద సంయుతే, | ఆధ్మాతః—(పు) ౧ శబ్దితే=ఊదఁబడినది, ౨ దగ్ధే=తగులబెట్టఁబడినది, 3 వాతరుగ్భేదసంయుతే = వాతరోగభేదముచేఁ గూడుకొన్నది. కూడుకొన్నది. |
| ఆప్లుతస్స్నాతకే స్నాతేఽ | ఆప్లుతః—(పు) ౧ స్నాతకే= వ్రతస్థుఁడు, ౨ స్నాతే=స్నానముజేసినవాఁడు. |
| ప్యాదృతస్సాదరేఽర్చితే. | ఆదృతః—(పు) ౧ సాదరే=ఆదరముతోఁ గూడుకొన్నవాఁడు, ౨ అర్చితే = పూజింపఁబడినవాఁడు |
| ఆచితశ్శకటోన్మేయే పలానామయుతద్వయే, పుల్లింగస్సంగృహీతేఽపి ఛన్నేఽపి స్యాత్త్రిలింగకః. ౨౯ | ఆచితః—(పు) ౧ శకటోన్మేయే = బండెడు బరువు, ౨ పలానామయుతద్వయే = రెండువేల పలముల యెత్తుబరువు, 3 సంగృహీతే=సంగ్రహింపఁబడినది, ౪ ఛన్నే = కప్పఁబడినది, |

| | |
|---|---|
| ఆహతం గుణితే చాపి తాడితే చ మృషార్థకే, స్యాత్పురాతనవస్త్రేఽపి నవవస్త్రే చ నానకే. ౬౦ | ఆహతం—(న) ౧ గుణితే = హెచ్చువేయఁబడినది, ౨ తాడితే=కొట్టఁబడినది, 3 మృషార్థకే=అనృతార్థముగలవచనము, ౪ పురాతనవస్త్రే = పాతగుడ్డ, ౫ నవవస్త్రే = నూతనవస్త్రము, ౬ ఆనకే = తప్పెట. (పు) |
| ఆనర్తో దేశభేదేఽపి నృత్యస్థానే జలే రణే, | ఆనర్తః—(పు) ౧ దేశభేదే = దేశవిశేషము, ౨ నృత్యస్థానే=నృత్యస్థానము, 3 జలే=జలము, ౪ రణే=యుద్ధము. |
| ఆవర్తశ్చింతనే వారిభ్రమే చావర్తనే పుమాన్. ౬౧ | ఆవర్తః—(పు) ౧ చింతనే = ఆవృత్తిజేయుట, ౨ వారిభ్రమే=నీటిసుడి, 3 ఆవర్తనే = రోమములసుడి. |
| ఆస్ఫోతం తు పుమానర్కపర్ణే స్యాత్కోవిదారకే | ఆస్ఫోతం—(పు) ౧ అర్కపర్ణే = జిల్లేడుచెట్టు, ౨ కోవిదారకే = ఎఱ్ఱకాంచనచెట్టు. |
| ఆస్ఫోతా గిరికర్ణ్యాం చ వనమాల్యాం చ యోషితి. | ఆస్ఫోతా—(స్త్రీ)౧గిరికర్ణ్యాం=విష్ణుక్రాంతచెట్టు, ౨ వనమాల్యాం=అడవిమల్లె. |
| ఆయస్తస్తేజితే క్షిప్తే క్లేశితే కుపితే హతే, | ఆయస్తః—(పు) ౧ తేజితే = సానపెట్టఁబడినది, ౨ క్షిప్తే = చిమ్మఁబడినది, 3 క్లేశితే=కష్టపెట్టఁబడినది, ౪ కుపితే = కోపముజేయఁబడినది, ౫ హతే=కొట్టఁబడినది. |
| ఆయతిస్తు స్త్రియాం దైర్ఘ్యే ప్రభావాగామికాలయోః. | ఆయతిః—(స్త్రీ) ౧ దైర్ఘ్యే = పొడగు, ౨ ప్రభావ = ప్రభావము, 3 ఆగామికాలయోః=ఉత్తరకాలము. |
| ఆయత్తిస్తుస్త్రియాం స్నేహే వశిత్వే వాసవే బలే, | ఆయత్తిః—(స్త్రీ) ౧ స్నేహే=స్నేహము, ౨ వశిత్వే=అష్టవిభూతులలోనొకటి, 3 వాసవే=దేవేంద్రుఁడు, ౪ బలే=బలము. |

| | |
|---|---|
| ఆకృతిస్తు స్త్రియాం రూపే సామాన్యవపుషోరపి. ౯౪ | ఆకృతిః—(స్త్రీ) ౧ రూపే=రూపము. (సౌందర్యము), ౨ సామాన్య = గాత్ర సామాన్యము, ౩ వపుషోః = శరీరము. |
| ఆసత్తిస్సంగమే లాభే స్త్రియా | ఆసత్తిః—(స్త్రీ) ౧ సంగమే = సంగమము, ౨ లాభే=లాభము. |
| మాపత్తిరాపది, ప్రాపణేఽపి చ యోషిత్స్యా | ఆపత్తిః—(స్త్రీ) ౧ ఆపది=ఆపత్తు, ౨ ప్రాపణే=పొందించుట. |
| దుదంత స్సాధువార్తయోః. | ఉదంతః—(పు) ౧ సాధు=సజ్జనుఁడు, ౨ వార్తయోః=వృత్తాంతము. |
| ఉషితం వ్యుషితే దగ్ధేఽ | ఉషితం—(న) ౧ వ్యుషితే = ఉన్నది, ౨ దగ్ధే=తగులపెట్టఁబడినది. |
| ప్యుదాత్తస్తు స్వరాంతరే, దయాత్యాగాదిసంపన్నే కావ్యాలంకారకృత్యయోః. | ఉదాత్తః—(పు) ౧ స్వరాంతరే = స్వరవిశేషము, ౨ దయాత్యాగాదిసంపన్నే = దయాత్యాగములుగలవాఁడు, ౩ కావ్యాలంకార = కావ్యాలంకారము, ౪ కృత్యయోః = చేయతగిన పని. |
| ఉత్తప్తం శుష్కమాంసేఽథ త్రిషు తప్తే పరిప్లుతే, | ఉత్తప్తం—(న) ౧ శుష్కమాంసే=ఎండినమాంసము, ౨ తప్తే = తపింపఁజేయఁబడినది, పరిప్లుతే=తడుపఁబడినది. (త్రి). |
| ఉచితం తు భవే న్యస్తే మితే జ్ఞాతే సమంజసే. ౯౫ | ఉచితం—(న) ౧ భవే=భవము, (రుద్రుఁడు, జన్మసంసారము, భవ మందురు, ౨ న్యస్తే=ఉంచఁబడినది, ౩ మితే=పరిమితమైనది, ౪ జ్ఞాతే=తెలియఁబడినది, ౫ సమంజసే=మంచిది. |
| ఉద్ధృతం స్యాత్త్రిషూత్క్షిప్తే పరిభుక్తోజ్ఝితేఽపి చ, | ఉద్ధృతం—(త్రి) ౧ ఉత్క్షిప్తే=పైకిచిమ్మఁబడినది, ౨ పరిభుక్తోజ్ఝితే = భుజించి వదిలినది. |

| | |
|---|---|
| ఉద్ధితం స్యాత్త్రిషూత్పన్నే ప్రోద్యతే వృద్ధిమత్యపి. ౯౮ | ఉద్ధితం—(త్రి) ౧ ఉత్పన్నే=పుట్టినది, ౨ ప్రోద్యతే = ఉద్యుక్తమైనది, 3 వృద్ధిమతి=వృద్ధిగలది. |
| ఉద్ఘాతస్తు పుమాన్పాదస్ఖలనే సముపక్రమే, పవనాభ్యాసయోగస్య కాలభేదే చ కీర్తితః. ౯౯. ఉత్తుంగే ముద్గరేఽపి | ఉద్ఘాతః—(పు) ౧ పాదస్ఖలనే = కాలుజారుట, ౨ సముపక్రమే = ఉపక్రమించుట, 3 పవనాభ్యాసయోగస్య కాలభేదే=వాయునిరోధాభ్యాసయోగముయొక్క-కాలవిశేషము. ర ఉత్తుంగే = ఉన్నతమైనది, ౫ ముద్గరే = ఇనుపగుదియ. |
| స్యాదుదితం తూక్త ఆగతే, | ఉదితం—(న) ౧ ఉక్తే=పలుకఁబడినది, ౨ ఆగతే=వచ్చినది. |
| ఉచ్ఛ్రితం త్రిషు సంజాతే సమున్నాహప్రవృద్ధయోః. | ఉచ్ఛ్రితం—(త్రి) ౧ సంజాతే=పుట్టినది, ౨ సమున్నాహే=పొడవు, 3 ప్రవృద్ధయోః=అభివృద్ధి. |
| ఉన్మత్త ఉన్మాదవతి ధూస్తూరముచుకుందయోః, | ఉన్మత్తః—(పు) ౧ ఉన్మాదవతి = పిచ్చివాఁడు, ౨ ధూస్తూర = ఉమ్మెత్త, 3 ముచుకుందయోః=ముచుకుందరాజు. |
| ఉద్భ్రాంతో నిర్మదగజే పుమానుద్వమితే త్రిషు.౧౦౧ | ఉద్భ్రాంతః —(పు) ౧ నిర్మదగజే=మదములేని యేనుఁగు, ౨ ఉద్వమితే = వెళ్లఁగ్రక్కఁబడినది. |
| ఏధతుః పురుషేఽగ్నౌ నా | ఏధతుః—(పు.) ౧ పురుషే = పురుషుఁడు, ౨ అగ్నౌ=అగ్ని. |
| కలితం విదితాప్తయోః, | కలితం—(న) ౧ విదిత = తెలియఁబడినది, ౨ ఆప్తయోః=పొందఁబడినది. |
| కపోతస్స్యాచ్చిత్రకంఠపారావతవిహంగయోః. ౧౦౨ | కపోతః—(పు) ౧ చిత్రకంఠ=గువ్వ, ౨ పారావతవిహంగయోః=పావురాయి, |
| అథ క్రందితమాహ్వానే రుదితేఽపి నపుంసకం, | క్రందితం—(న) ౧ ఆహ్వానే=ఆహ్వానము, ౨ రుదితే=రోదనము, |

క్షారితస్స్రావితే క్షారే అభిశస్తేఽపి చ త్రిషు. ౧౦౩

క్షారితః—(త్రి) ౧ స్రావితే = స్రవింపఁజేయఁబడినది, క్షారే=ఉప్పు, 3 అభిశస్తే=ప్రశస్తమైనది.

కాపోతో రుచకే క్లీబే కపోతౌఘే జనాన్తరే,

కాపోతః—(పు) ౧ రుచకే = సర్జికాక్షారము, ౨ కపోతౌఘే = గువ్వలగుంపు, 3 జనాన్తరే=జనవిశేషము.

కిరాతో మ్లేచ్ఛభేదే స్యాద్భూనింబే ఽల్పతనావపి. ౧౦౪. స్త్రియాం చామరధారిణ్యాం కుట్టినీదుర్గయోరపి,

కిరాతః—(పు) ౧ మ్లేచ్ఛభేదే = మ్లేచ్ఛవిశేషము, ౨ భూనింబే = నేలవేము, 3 అల్పతనౌ = కుఱుచశరీరము, ౪ చామరధారిణ్యాం=నెమలిపింఛమును ధరించు కిరాతజాతి, (స్త్రీ) ౫ కుట్టనీ= కుంటనకత్తె, ౬ దుర్గయోః = దుర్గాదేవి.

కృతాన్తో యమసిద్ధాన్త దైవాకుశలకర్మసు. ౧౦౫

కృతాన్తః—(పు) ౧ యమ=యముఁడు, ౨ సిద్ధాన్త=సిద్ధాంతము, 3 దైవ = దైవము, ౪ కుశలకర్మసు=కుశలకర్మ.

గర్జితం వారివాహాదిధ్వనౌ నా మత్తకుఞ్జరే

గర్జితం—(న) ౧ వారివాహాదిధ్వనౌ = మేఘము మొదలగువాని ధ్వని, ౨ మత్తకుఞ్జరే=మదించినయేనుఁగు. (పు)

గ్రన్థితం గుమ్భితే క్రాన్తే హింసితే చ త్రిలిఙ్గకం.

గ్రన్థిత—(త్రి) ౧ గుమ్భితే = కూర్పఁబడినది, ౨ క్రాన్తే=ఆక్రమింపఁబడినది, 3 హింసితే=హింసింపఁబడినది.

గభస్తిః కిరణే సూర్యే నా స్వాహాయాంతు యోషితి,

గభస్తిః—(పు) ౧ కిరణే = కిరణము, ౨ సూర్యే=సూర్యుఁడు, 3 స్వాహాయాం =స్వాహాదేవి. (స్త్రీ).

గరుత్ స్త్రీ స్వర్ణనడయోః.

గరుత్—(పు) ౧ స్వర్ణ = సువర్ణము, ౨ నడయోః=కిక్కిసపుతీగె.

గోపతిశ్శివషణ్డయోః. ౧౦౬. నృపభాస్కరయోః పుంసి

గోపతిః—(పు) ౧ శివ=శివుఁడు, ౨ షండయోః=నపుంసకుఁడు, 3 నృప= రాజు, ౪ భాస్కరయోః=సూర్యుఁడు.

| | |
|---|---|
| చేష్టితం గతి చేష్టయోః | చేష్టితం—(న) ౧ గతి = గమనము, ౨ చేష్టయోః=చేష్ట. |
| జగత్స్యాద్విష్టపే క్లీబం వాయౌ నా జంగమే త్రిషు. | జగత్—(న) ౧ విష్టపే = లోకము, ౨ వాయౌ=వాయువు, (పు) ౩ జంగమే =పశుపక్ష్యాదికము. (త్రి) |
| జగతీ భువనే క్ష్మాయాం ఛందోభేదే జనేఽపి చ, | జగతీ—(స్త్రీ) ౧ భువనే = లోకము, ౨ క్ష్మాయాం=భూమి, ౩ ఛందోభేదే=ఛందోవిశేషము, ౪ జనే=జనము. |
| జయంతీ వృక్షభిద్గౌర్యోరింద్రపుత్రీపతాకయోః. ౧౦౯ పుమానైంద్రౌ హరే భీమే | జయంతీ—(స్త్రీ) ౧ వృక్షభిత్ = వృక్షవిశేషము, ౨ గౌర్యోః = పార్వతి, ౩ ఇంద్రపుత్రీ=ఇంద్రసుత, ౪ పతాకయోః=టెక్కెము, ౫ ఐంద్రౌ = ఇంద్రుని కొడుకు, (పు) ౬ హరే=రుద్రుడు, ౭ భీమే=భీముఁడు, (భయంకరమైనవాఁడు.) |
| జ్వలితం దగ్ధ ఉజ్జ్వలే, | జ్వలితం—(న) ౧ దగ్ధ=తగుల పెట్టఁబడినది, ౨ ఉజ్జ్వలే=ప్రకాశించుచున్నది. |
| జామాతా దుహితుః పత్యౌ సూర్యావర్తే ధవేపుమాన్ | జామాతా—(పు) ౧ దుహితుః-పత్యౌ = అల్లుఁడు, ౨ సూర్యావర్తే ప్రొద్దుతిరుగుచెట్టు, ౩ ధవే=భర్త. |
| జీమూతోఽద్రౌ భృతికరే దేవతాడే పయోధరే, | జీమూతః—(పు) ౧ అద్రౌ=పర్వతము, ౨ భృతికరే=సంతుష్టిఁజేయువాఁడు, ౩ దేవతాడే= దేవతాటిచెట్టు, ౪ పయోధరే=మేఘము. |
| జీవాతురస్త్రియాం భక్తే జీవితే జీవనౌషధే. ౧౧౦ | జీవాతుః—(పు) ౧ భక్తే=అన్నము, ౨ జీవితే=జీవితము, ౩ జీవనౌషధే = జీవనౌషధము. |
| జీవంతీ జీవనీశమ్యోర్గుడూచీ వందయోరపి, | జీవంతీ—(స్త్రీ) ౧ జీవనీ = పాలకూర, ౨ శమ్యోః=జమ్మి, ౩ గుడూచీ=తిప్పతీగ, ౪ వందయోః=బదనిక. |

| | |
|---|---|
| జృభితం కరణే స్త్రీణామీహా స్ఫుటితయోరపి. ౧౧౨ | జృంభితం—(న) ౧ స్త్రీణాం కరణే=స్త్రీల రతిబంధవిశేషము, ౨ ఈహా = ఇచ్ఛ, 3 అస్ఫుటితయోః=తట్టుట. |
| త్వరితం ప్రజవే శీఘ్రే | త్వరితం—(న) ౧ ప్రజవే = వేగముగలవాఁడు, ౨ శీఘ్రే=శీఘ్రము. |
| త్రిగర్తో గణితాంతరే, దేశేఽపి నా ఘుర్ఘురికాకాముకాంగనయోః స్త్రియాం. | త్రిగర్తః—(పు) ౧ గణితాంతరే=గణితవిశేషము, ౨ దేశే=దేశవిశేషము, 3 ఘుర్ఘురికా=ఘుర్ఘురధ్వని, (పందికూఁత) ౪ కాముకాంగనయోః = కాముకస్త్రీ. |
| తృణతా ధనుషి తృణత్వే | తృణతా—(స్త్రీ) ౧ ధనుషి = ధనుస్సు, ౨ తృణత్వే=తృణత్వము. |
| దంశితమపిజాతదంశే స్యాత్, కవచాచితే | దంశితం—(న) ౧ జాతదంశే=కుట్టఁబడినది, ౨ కవచాచితే=కవచము వేయఁబడినది. |
| ద్విజాతిర్విప్రాండజయోశ్చ పుంలింగః. ౧౧౪. | ద్విజాతిః—(పు) ౧ విప్ర = బ్రాహ్మణుఁడు, ౨ అండజయోః=పక్షి. |
| దుర్జాతం వ్యసనే క్లీబేఽసమ్యగ్జాతేఽన్యలిఙ్గకం, | దుర్జాతం—(న) ౧ వ్యసనే = వ్యసనము, (దుఃఖము), ౨ అసమ్యగ్జాతే = మంచిజన్మము లేనివాఁడు. |
| దుర్గతిర్నరకే నైస్స్వే స్త్రీ | దుర్గతిః—(స) ౧ నరకే = నరకము, ౨ నైస్స్వే=దారిద్ర్యము. |
| దృష్టాంత ఉదాహృతౌ. ౧౧౫. శాస్త్రే చ మరణే ధీమాన్ పండితే చ బృహస్పతౌ, | దృష్టాంతః—(పు) ౧ ఉదాహృతౌ=ఉదాహరణము, ౨ శాస్త్రే = శాస్త్రము, 3 మరణే-ధీమాన్=మరణమును దెలుసుకొన్నవాఁడు, ౪ పండితే = నిశ్చయజ్ఞానముగల పండితుఁడు, ౫ బృహస్పతౌ=బృహస్పతి. |
| నిరృతిస్స్యాదలక్ష్మ్యాం స్త్రీ దిశాంపాలాంతరే పుమాన్. | నిరృతిః—(స్త్రీ) ౧ అలక్ష్మ్యాం=అలక్ష్మి, ౨ దిశాంపాలాన్తరే=నైఋతి. |

నికృతం విప్రలంభే స్యాన్నీచే విప్రకృతేఽపి చ,

నికృతం—(న) ౧ విప్రలంభే=వంచన, ౨ నీచే=నీచుఁడు, 3 విప్రకృతే=తిరస్కరింపఁబడినవాఁడు.

నిర్ముక్తస్త్యక్తసంగే స్యాన్ముక్తకంచుకభోగిని. ౧౧౭

నిర్ముక్తః—(పు) ౧ త్యక్తసంగే = వదిలిపెట్టఁబడినసంగమము గలవాఁడు, ౨ ముక్తకంచుకభోగిని = పొర విడిచిన పాము.

నిరస్తస్త్రిషు నిష్ఠ్యూతే ప్రేషితేషౌ ద్రుతోదితే,సంత్యక్తే చ ప్రతిహతే

నిరస్తః—(త్రి) ౧నిష్ఠ్యూతే=వెళ్లగ్రక్కఁబడినది, ౨ ప్రేషితేషౌ=పంపబడినబాణము, 3 ద్రుతోదితే=శీఘ్రముగాఁజెప్పఁబడినది, ౪ సంత్యక్తే=వదిలిపెట్టఁబడినది, ౫ ప్రతిహతే=కొట్టఁబడినది.

నిమిత్తం హేతులక్ష్మణోః.

నిమిత్తం—(న) ౧ హేతు=కారణము, ౨ లక్ష్మణోః=గుర్తు.

నివాతో దృఢసన్నాహే వాతశూన్యేఽపి చాశ్రయే,

నివాతః—(పు) ౧ దృఢసన్నాహే=దృఢసన్నాహము, ౨వాతశూన్యే=వాయువులేని ప్రదేశము, ౩ ఆశ్రయే=ఆశ్రయము.

నిశాంతస్త్రిషు శాంతే స్యాత్క్లీబం తు భవనోషసోః.

నిశాంతః—(త్రి) ౧ శాంతే=శాంతమైనవాఁడు, ౨ భవన=గృహము, 3 ఉషసోః=ఉషఃకాలము. (న)

నికృతిర్భర్త్సనే క్షేపే శఠే శాఠ్యేఽపి చ స్త్రియాం,

నికృతిః—(స్త్రీ) ౧ భర్త్సనే = భయపెట్టుట, ౨ క్షేపే = నింద, 3 శఠే=దుర్జనుఁడు, ౪ శాఠ్యే = దౌర్జన్యము.

నిర్వృతి స్స్వస్థితావస్తంగమనే చ సుఖే స్త్రియాం.

నిర్వృతిః—(స్త్రీ) ౧ స్వస్థితా=ఆరోగ్యము ౨ అస్తంగమనే=నాశమునొందుట, 3 సుఖే=సుఖము.

నియతిర్నియమే దైవే స్త్రీ

నియతిః—(స్త్రీ) ౧ నియమే=నియమము, ౨ దైవే=దైవము.

| | |
|---|---|
| పతన్ పాతుకే ఖగే, | పతన్——(పు) ౧ పాతుకే = పడువాఁడు, ఖగే=పక్షి. |
| ప్రహతం వితతే క్షుణ్ణే | ప్రహతం——(న) ౧ వితతే = విస్తృతమైనది, ౨ క్షుణ్ణే=క్షుణ్ణమైనది. |
| పర్యస్తః పతితే హతే. ౧౨౧ | పర్యస్తః——(పు) ౧ పతితే = పడినది, ౨ హతే=కొట్టఁబడినది. |
| ప్రభూతముద్గతే ప్రాజ్యే | ప్రభూతం——(న) ౧ ఉద్గతే=పుట్టినది, ౨ ప్రాజ్యే=బహుళమైనది. |
| పండితస్సిల్హకే కవౌ, | పండితః—— (పు) ౧ సిల్హకే = అందుగుబంకతోఁజేయబడిన ధూపద్రవ్యము, ౨ కవౌ=పండితుఁడు. |
| పలితం శైలజే తాపే కేశపాకే చ కర్దమే. ౧౨౨ | పలితం——(న) ౧ శైలజే=ఱాతిపువ్వు, ౨ తాపే=తాపము, ౩ కేశపాకే = వెంట్రుకలు నెరయుట, ౪ కర్దమే=బురద. |
| ప్రసృతస్సుప్రసారే స్యాద్వినీతే వేగితే త్రిషు, అర్ధాంజలౌ తు పుంలింగో జంఘాయాం ప్రసృతా మతా. | ప్రసృతః——(త్రి) ౧ సుప్రసారే=బాగుగా జాచఁబడినది, ౨ వినీతే = శిక్షింపఁబడినది, ౩ వేగితే=వేగముతోఁగూడినది, అర్ధాంజలౌ=చేరెడు, (పు). ౫ జంఘాయాం=పిక్క. (స్త్రీ.) |
| ప్రసృతం కుసుమే క్లీబం త్రిషు సంజాతసూతయోః, | ప్రసృతం——(న) ౧ కుసుమే = పుష్పము, (త్రి) ౨ సంజాత=పుట్టినవాఁడు, ౩ సూతయోః=సారథి. |
| ప్రణీతః సంస్కృతాగ్నౌ నా యజ్ఞపాత్రాంతరేఽ స్త్రియాం. ౧౨౪. త్రిషు క్షిప్తోపసంపన్న విహితేషు ప్రవేశితే, | ప్రణీతః——(పు) ౧ సంస్కృతాగ్నౌ=మంత్రములచే సంస్కారము చేయఁబడిన యగ్ని, ౨ యజ్ఞపాత్రాంతరే=ప్రణీతిపాత్ర, (స్త్రీ) ౩ క్షిప్తే = ప్రేరేపింపఁబడినది, ౪ ఉపసంపన్నే = సిద్ధమయినది, ౫ విహితేషు = విహితమయినది, (త్రి) ౬ ప్రవేశితే = ప్రవేశింపఁజేయఁబడినది. |

| | |
|---|---|
| ప్రతీతస్సాదరే జ్ఞాతే హృష్ట ప్రఖ్యాతయో స్త్రిషు. | ప్రతీతః—(త్రి) ౧ సాదరే=ఆదరముతో కూడినవాఁడు, ౨ జ్ఞాతే=తెలియఁబడినది, 3 హృష్ట = హర్షముగలది, ౪ ప్రఖ్యాతయోః=ప్రసిద్ధమయినది. |
| ప్రమీతం వాచ్యలింగంస్యా త్ప్రోక్షితేఽపి మృతేఽపి చ, | ప్రమీతం—(త్రి) ౧ ప్రోక్షితే = యజ్ఞముకొఱకుఁ జంపఁబడిన పశువు, ౨ మృతే=మృతిఁజెందినవాఁడు. |
| పరేతో వాచ్యలింగస్స్యాత్ మృతే భూతాంతరే పుమాన్, | పరేతః—(త్రి) ౧ మృతే=మృతిఁజెందినవాఁడు, ౨ భూతాంతరే = భూతములలోనొకటి (పు) |
| పర్వతః పాదపే పుంసి శాకమత్స్యప్రభేదయోః, దేవమున్యంతరే శైలే | పర్వతః—(పు) ౧ పాదపే=వృక్షము, ౨ శాక=శాకములలోనొకటి, 3 మత్స్యప్రభేదయోః = చేపలలోనొకటి, ౪ దేవమున్యంతరే = దేవమునులలోనొకఁడు, (పర్వతమహర్షి) ౫ శైలే=కొండ. |
| ప్రపాతో నిర్ఝరే తటే. | ప్రపాతః—(పు) ౧ నిర్ఝరే=సెలయేఱు, ౨ తటే=కొండచరియ. |
| పర్యాప్తం తు యథేష్టే స్యా త్తృప్తౌ శక్తే నివారణే, | పర్యాప్తం—(న) ౧ యథేష్టే=యథేచ్ఛ, ౨ తృప్తౌ=సంతుష్టిఁజెందుట, 3 శక్తే=సామర్థ్యము, ౪ నివారణే=నిషేధించుట. |
| పంచతా పంచభావేఽపి మరణేఽపి చ యోషితి. ౧౨౮ | పంచతా—(స్త్రీ) ౧ పంచభావే=ఐదగుట, ౨ మరణే=చనిపోవుట. |
| పక్షతిశ్చ భవేత్పక్షమూలే చప్రతిపత్తిథౌ, | పక్షతిః—(స్త్రీ) ౧ పక్షమూలే = ఱెక్కలయొక్క మొదటిభాగము, ౨ ప్రతిపత్తిథౌ=పాడ్యమి. |
| ప్రసూతిరుద్భవేఽపి స్యాత్తనయే దుహితర్యపి. ౧౨౯. | ప్రసూతిః—(స్త్రీ) ౧ ఉద్భవే=పుట్టుట, ౨ తనయే=కుమారుఁడు, 3 దుహితరి=కుమార్తె. |

| | |
|---|---|
| ప్రతతిర్విస్తృతౌ వల్ల్యాం | ప్రతతిః—(స్త్రీ) ౧ విస్తృతౌ=విస్తారము, ౨ వల్ల్యాం=తీగె. |
| పద్ధతిః పఙ్క్తివర్త్మనోః, | పద్ధతిః—(స్త్రీ) ౧ పఙ్క్తి=పంక్తి, ౨ వర్త్మనోః=మార్గము. |
| ప్రవృత్తిస్తు ప్రవాహే స్యాదుదంతేచ ప్రవర్తనే.౧౩౦. అవంత్యాదౌ చ | ప్రవృత్తిః—(స్త్రీ) ౧ ప్రవాహే=ప్రవాహము, ౨ ఉదంతే=వార్త, 3 ప్రవర్తనే=ప్రవర్తించుట, ౪ అవన్త్యాదౌ=అవన్తి మొదలుగాగల దేశములు. |
| పర్యాప్తిః ప్రకామప్రాప్తి రక్షణే, | పర్యాప్తిః—(స్త్రీ) ౧ ప్రకామ=మిక్కిలి, ౨ ప్రాప్తి=పొందుట, 3 రక్షణే=రక్షించుట. |
| ప్రకృతిర్గుణసామ్యే స్యాదమాత్యాది స్వభావయోః. ౧౩౧. యోనౌ లిఙ్గే పౌరవర్గేఽమీ పక్షత్యాదయః స్త్రియాం, | ప్రకృతిః—(స్త్రీ) ౧ గుణసామ్యే = మూలప్రకృతి, ౨ అమాత్యాది=మంత్రులు మొదలైనవారు, 3 స్వభావయోః = స్వభావము, ౪ యోనౌ=యోనిప్రదేశము, ౫ లిఙ్గే=శిశ్నము, ౬ పౌరవర్గే=పురజనము. ఈపక్షతి మొదలగుశబ్దములు స్త్రీలింగములు. |
| పార్వతీ సల్లకీదుర్గాగోపాలపుత్రికాసు చ. ౧౩౨ | పార్వతీ—(స్త్రీ) ౧ సల్లకీ=అందుగుచెట్టు, ౨ దుర్గా=పార్వతి, 3 గోపాలపుత్రికాసు=గోపకన్య. |
| ప్రార్థితం యాచితే శత్రుసంరుద్ధేఽభిహితే త్రిషు, | ప్రార్థితం—(న) ౧ యాచితే=అడుగఁబడినది, ౨ శత్రుసంరుద్ధే=శత్రువులచేనరికట్టఁబడినది, 3అభిహితే=చెప్పఁబడినది. |
| పితృన్విహంగమే పుంసి పతనేచ్ఛౌ పునస్త్రిషు. ౧౩౩ | పిత్సన్—(పు) ౧ విహంగమే = పక్షి, ౨ పతనేచ్ఛౌ=పడనిశ్చయించినది. (త్రి) |
| పిశితం మాంసేమాంస్యాం స్త్రీ | పిశితం—(న) ౧ మాంసే=మాంసము, ౨ మాంస్యాం=జటామాంసి. (స్త్రీ) |
| పిండితం గణితే ఘనే, | పిండితం—(న) ౧ గణితే=లెక్కించఁబడినది, ౨ ఘనే=దట్టమైనది. |

| | |
|---|---|
| పీడితం కరణే స్త్రీణాం యం త్రితే బాధితేఽపి చ.౧3౪ | పీడితం—(న) స్త్రీణాంకరణే = స్త్రీలరతి విశేషము, ౨ యన్త్రితే=కట్టఁబడినది, 3 బాధితే=పీడించఁబడినది. |
| పుటితంస్యాద్ధస్తపుటే పాటిత స్యూతయోరపి, | పుటితం—(న) ౧ హస్తపుటే = దోసిలి ౨ పాటితే = బద్దలుచేయఁబడినది, 3 స్యూతయోః=కుట్టఁబడినది. |
| పృషన్మృగే పుమాన్బిందౌ న ద్వయోః | పృషత్—(పు) ౧ మృగే = ఇఱ్ఱి, ౨ బిందౌ=బిందువు. (న) |
| పృషతోఽపి నా. ౧3౫. అనయోశ్చ | పృషతః—(పు) ౧ అనయోః = ఇఱ్ఱి ౨ ఉదకబిందువు. |
| త్రిషు శ్వేతబిందుయుక్తేఽప్యృభావపి, | పృషత్—(త్రి) ౧ శ్వేతబిందుయుక్తే =మచ్చలతోఁగూడుకొన్న మృగము. |
| ప్రోక్షితం నిహతే సిక్తే | ప్రోక్షితం—(న) ౧ నిహతే = కొట్టఁబడినది, ౨ సిక్తే=తడుపఁబడినది. |
| బృహతీ వసనాంతరే. ౧3౬. ఛందోభిత్ క్షుద్రవార్తాకీ వారిధానీషు వాచిచ,కంట కారీమహత్యోశ్చ | బృహతీ—(స్త్రీ) ౧ వసనాన్తరే = వస్త్ర విశేషము, ౨ ఛందోభిత్ = బృహతీ ఛందస్సు, 3 క్షుద్రవార్తాకీ = నేలములకచెట్టు, ౪ వారిధానీషు=జలపాత్రము, ౫ వాచి=వాక్కు, ౬ కంటకారీ=వాకుడుచెట్టు, ౭ మహత్యోః= నారదునివీణ |
| భవద్యుష్మత్సతోస్త్రిషు౧3౭ స్త్రీ బాణభేదే | భవత్—(త్రి) ౧ యుష్మత్ = నీవు, ౨ సతోః = ఉండునది, 3 బాణభేదే= విషదిగ్ధబాణవిశేషము. (స్త్రీ) |
| భరతో నాట్యశాస్త్ర మునౌ నటే, రామానుజే చ దౌష్యంతౌ | భరతః—(పు) ౧ నాట్యశాస్త్రమునౌ = భరతముని, ౨ నటే = నాట్యము చేయువాఁడు, 3 రామానుజే = రామునితమ్ముఁడైన భరతుఁడు, ౪ దౌష్యంతౌ = దుష్యన్తమహారాజు కొడుకు. |

| | |
|---|---|
| భాస్వాన్భాస్వరసూర్యయోః. | భాస్వాన్—(పు) ౧ భాస్వర = ప్రకాశించునది, ౨ సూర్యయోః = సూర్యుఁడు. |
| భారతం గ్రంథభేదే స్యాద్వర్షభేదేఽథ | భారతం—(న) ౧ గ్రంథభేదే = భారతము, ౨ వర్షభేదే=భారతవర్షము. |
| భారతీ, వచనేచ సరస్వత్యాం పక్షివృత్తిప్రభేదయోః | భారతీ—(స్త్రీ) ౧ వచనే = వాక్యము, ౨ సరస్వత్యాం=సరస్వతీదేవి, ౩ ౪. పక్షివృత్తిప్రభేదయోః = పక్షివిశేషము, భారతీవృత్తి. |
| భాసంత స్సుందరాకారే త్రిషు నా భాసపక్షిణి, | భాసన్తః—(త్రి) ౧ సుందరాకారే = సుందరమైన దేహముకలవాఁడు, ౨ భాసపక్షిణి=భాసమనుపక్షివిశేషము. |
| భావితం వాసితే ప్రాప్తే | భావితం—(న) ౧ వాసితే = పరిమళింపఁజేయఁబడినది, ౨ ప్రాప్తే = పొందఁబడినది. |
| భూభృన్నాద్రౌమహీపతౌ. | భూభృత్—(పు) ౧ అద్రౌ= పర్వతము, ౨ మహీపతౌ= రాజు. |
| మహతి వల్లకీభేదే రాజ్యే స్యాత్తు నపుంసకం, తత్వభేదే పుమాన్వృద్ధౌ వాచ్యవ | మహతీ—(స్త్రీ) ౧ వల్లకీభేదే = నారదమునివీణే, ౨ రాజ్యే=రాజ్యము, (న) ౩ తత్వభేదే = తత్వవిశేషము (పు,) ౪ వృద్ధౌ=సమృద్ధి. (త్రి) |
| న్మథితం పునః. ౧౪౧. క్లీబం నిర్జలఘోలే స్యాత్త్రిష్వాలోడితఘృష్టయోః, | మథితం—(న) ౧ నిర్జలఘోలే = నీరుకలయనిచల్ల, ౨ఆలోడిత=చిలుకఁబడినది, ౩ ఘృష్టయోః=ఒఱచఁబడినది. (త్రి) |
| మరుద్దేవే సమీరే నా గ్రంథిపర్ణే నపుంసకమ్. ౧౪౨ | మరుత్—(పు) ౧ దేవే = వేలుపు, ౨ సమీరే=వాయువు, ౩ గ్రంథిపర్ణే=పచ్చాకుమాచిపత్రి. (న) |
| ముషితం హృతఖండితయో | ముషితం—(న) ౧ హృత = దొంగిలింపఁబడినది, ౨ ఖండితయోః=ఖండింపఁబడినది. |

| | |
|---|---|
| మూర్ఛితమపి సోచ్ఛ్రయే చ మూఢే చ, | మూర్ఛితం—(న) ౧ సోచ్ఛ్రయే = పొడువైనది, ౨ మూఢే = తెలివి లేనిది. |
| రజతం త్రిషు శుక్లే స్యాత్క్లీబం హారే చ దుర్వర్ణే. | రజతం —(త్రి) ౧ శుక్లే = తెల్లనిది, ౨ హారే=ముత్యాలహారము, (న) 3 దుర్వర్ణే=వెండి. |
| రమతిర్నాయకే నాకే పుంసి స్యాత్ | రమతిః—(పు) ౧ నాయకే = ప్రియుడు, ౨ నాకే=స్వర్గము. |
| రేసితం పునః, రుతస్తనితయోః క్లీబం స్వర్ణాదిఖచితే త్రిషు. ౧౪౪ | రేసితం—(న) ౧ రుత=ధ్వని, ౨ స్తనితయోః=ఉఱుము, 3 స్వర్ణాదిఖచితే=సువర్ణము మొదలైనవానిచేత బిగింపఁబడినది. (త్రి) |
| రేవతీ హలిపత్న్యాం స్యాత్తారాభిన్మాతృభేదయోః, | రేవతీ—(స్త్రీ) ౧ హలిపత్న్యాం = బలరాముని భార్య, ౨ తారాభిత్=రేవతీ నక్షత్రము, 3 మాతృభేదయోః=మాతృకాభేదము. |
| రైవతస్తు సువర్ణాలౌ శైలభేదే చ శంకరే. ౧౪౫ | రైవతః—(పు) ౧ సువర్ణాలౌ = బంగారువన్నెగల పువ్వులుగలది (రేల చెట్టు), ౨ శైలభేదే = రైవతకపర్వతము, 3 శంకరే=ఈశ్వరుఁడు. |
| రోహితం కుంకుమే రక్తే ఋజుశక్రశరాసనే, పుంసి స్యాన్మీన మృగయోర్భేదే రోహితకద్రుమే. ౧౪౬ | రోహితం—(న) ౧ కుంకుమే = కుంకుమ, ౨ రక్తే = నెత్తురు, 3 ఋజుశక్ర శరాసనే = వంకరలేని యింద్రధనుస్సు, ౪, ౫ మీనమృగయోర్భేదే = చేపలలో నొకటి, మృగభేదము, (పు) ౬ రోహితకద్రుమే = ములుమోదుగు. |
| రోహిన్మృగ్యాం లతాభేదే స్త్రీ నార్కే, | రోహిత్—(స్త్రీ) ౧ మృగ్యాం = ఆడుమృగము, ౨ లతాభేదే = లతావిశేషము, 3 అర్కే=సూర్యుఁడు. (పు) |

| | |
|---|---|
| లలితం త్రిషు,లలితే చేప్సితేఽపి స్యాద్ధారభేదే తు న ద్వయోః. ౧౪౭ | లలితం—(త్రి) ౧ లలితే=మనోహరమైనది, ౨ ఈప్సితే=అభిలషింపఁబడినది, ౩ హారభేదే = హారవిశేషము. (న) |
| లోహితం రక్తగోశీర్షే కుంకుమే రక్తచందనే, పుమాన్నదాంతరే భౌమే వర్ణే చ త్రిషు తద్వతి. ౧౪౮ | లోహితం—(న) ౧ రక్త = నెత్తురు, ౨ గోశీర్షే= చందనవిశేషము, ౩ కుంకుమే=కుంకుమము, ౪ రక్తచందనే= ఎఱ్ఱనిచంటనము,(పు)౫నదాన్తరే=నదవిశేషము, ౬ భౌమే=అంగారకుఁడు, ౩ వర్ణే = రక్తవర్ణము, ౮ తద్వతి = రక్తవర్ణముకలది. (త్రి) |
| వర్ధితం ప్రసృతే చ్ఛిన్నే పూరితే | వర్ధితం—(న) ౧ ప్రసృతే = విస్తరింపఁజేయఁబడినది, ౨ ఛిన్నే=ఛేదించఁబడినది, ౩ పూరితే=నింపఁబడినది. |
| వహతిర్గవి, సచివే పుంసి | వహతిః—(పు) ౧ గవి = గోవు, ౨ సచివే=మంత్రి. |
| వహతుః పథికే వృషభే పుమాన్. ౧౪౯ | వహతుః—(పు) ౧ పథికే = బాటసారి, ౨ వృషభే=ఎద్దు. |
| వనితా జాతరాగస్త్రీ స్త్రియోః స్త్రీ త్రిషు యాచితే, సేవితే | వనితా—(స్త్రీ) ౧ జాతరాగస్త్రీ = అనురాగముకలపడతి, ౨ స్త్రియోః=స్త్రీ, (త్రి) ౩ యాచితే=అడుగఁబడినది, ౪ సేవితే=సేవింపఁబడినది. |
| వాపితం బీజాకృతముండితయో స్త్రిషు. ౧౫౦ | వాపితం—(త్రి) ౧ బీజాకృత=విత్తఁబడినది, ౨ ముండితయోః = గొరిగింపఁబడినది. |
| వసతిస్స్యాత్ స్త్రియాంవాసే యామిన్యాం చ నికేతనే, | వసతిః—(స్త్రీ) ౧ వాసే = నివాసము, ౨ యామిన్యాం=రాత్రి, ౩ నికేతనే=ఇల్లు. |
| వ్యాయతం వ్యాపృతే దీర్ఘే దృఢేఽచాతిశయేఽన్యవత్ | వ్యాయతం—(న) ౧ వ్యాపృతే = వ్యాపించినటువంటిది, ౨ దీర్ఘే=పొడవైనది, ౩ దృఢే=దృఢమైనది, ౪ అతిశయే=గొప్పైనది. (త్రి) |

| | |
|---|---|
| వ్యాఘాతో యోగభేదేస్యా దంతరాయప్రహారయోః, | వ్యాఘాతః— (పు) ౧ యోగభేదే = వ్యాఘాతమను పంచాంగయోగము, ౨ అంతరాయ=విఘ్నము, ౩ ప్రహారయోః=కొట్టడము. |
| వాసితా కరిణీనార్యో | వాసితా—(స్త్రీ) ౧ కరిణీ=ఆఁడేనుఁగు, ౨ నార్యోః=పడఁతి. |
| ర్వాసితం భావితే రుతే.౧౫౨ | వాసితం—(న) ౧ భావితే=కర్పూరాదులచేఁ బరిమళింపఁ జేయఁబడినది, ౨ రుతే=ధ్వని. |
| వాసంతీ మాధవీయూథ్యో రుష్ట్రే నావహితే త్రిషు, | వాసంతీ—(స్త్రీ) ౧ మాధవీ = బండిగురివెంపతీఁగ, ౨ యూథ్యోః=అడవిమల్లె, ౩ ఉష్ట్రే=ఒంటె, (పు.) ౪ అవహితే=ఏకాగ్రతకలది. (త్రి) |
| వివిక్తం త్రిష్వసంపృక్తే రహః పూతవివేకిషు. ౧౫౩. వసునందేనా | వివిక్తం—(త్రి) ౧ అసంపృక్తే=కలయికలేనిది, ౨ రహః=రహస్యము, ౩ పూత=పవిత్రమైనది, ౪ వివేకిషు=వివేకముకలవాఁడు, ౫ వసునందే=వసునందుఁడు(పు) |
| విహస్తః పండితే వ్యాకులే త్రిషు, | విహస్తః—(పు) ౧ పండితే=పండితుఁడు, ౨ వ్యాకులే=వ్యాకులమైనది. (త్రి) |
| వినీత స్సువహాశ్వే స్యాద్వణిజ్యపి పుమాంస్త్రిషు. ౧౫౪ జితేంద్రియేఽపనీతే చ, నిభృతే వినయాన్వితే, | వినీతః—(పు) ౧ సువహాశ్వే = బాగుగ మోయుగుఱ్ఱము, ౨ వణిజి = వర్తకుఁడు, ౩ జితేంద్రియే=జయింపఁబడిన యింద్రియములుకలవాఁడు, (త్రి) ౪ అపనీతే=తీసుకపోఁబడినది,౫ నిభృతే=నిశ్చలమైనది, ౬ వినయాన్వితే=వినయముతోఁ గూడుకొనినవాఁడు. |
| విశ్వస్తో జాతవిశ్వాసే. | విశ్వస్తః— (పు) ౧ జాతవిశ్వాసే = నమ్మకముకలవాఁడు. |
| విశ్వస్తా విధవాస్త్రియాం. | విశ్వస్తా—(ఆ. స్త్రీ) ౧ విధవాస్త్రియాం = భర్తలేనియాఁడుది. |

| | |
|---|---|
| విద్యుత్తడితి సంధ్యాయాం స్త్రియాం త్రిషుతు నిష్ప్రభే, | విద్యుత్—(స్త్రీ) ౧ తటితి = మెఱుపు, ౨ సంధ్యాయాం = సంధ్యాకాలము, 3 నిష్ప్రభే=కాంతివిహీనమైనది.(త్రి) |
| వివృతా క్షుద్రరుగ్భేదే వి స్తృతేఽత్వభిధేయవత్. | వివృతా— (స్త్రీ) ౧ క్షుద్రరుగ్భేదే = చెడువ్యాధులలోనొకటి, ౨ విస్తృతే =విస్తారమయినది. (త్రి) |
| వినేతా దేశకే రాజ్ఞి నా | వినేతా—(పు) ౧ ఆదేశకే = శిక్షించువాఁడు, ౨ రాజ్ఞి=రాజు. |
| విధాతాతువేధసి స్మరే నా, | విధాతా—(పు) ౧ వేధసి = బ్రహ్మ, ౨ స్మరే=మన్మథుఁడు. |
| వినతా తార్క్ష్యజనన్యాం పిటకాభిది. ౧౫౭ | వినతా—(స్త్రీ) ౧ తార్క్ష్యజనన్యాం = గరుత్మంతునితల్లి, ౨ పిటకాభిది=వ్రణవిశేషము. |
| వినతః ప్రణతే భుగ్నే శిక్షితే చాభిధేయవత్, | వినతః—(త్రి) ౧ ప్రణతే=నమస్కరించువాఁడు, ౨ భుగ్నే=వంగినది, 3 శిక్షితే=శిక్షింపఁబడినది. |
| వికృతం త్రిషు బీభత్సరాగితే సంస్కృతేఽపి చ. ౧౫౮ | వికృతం—(త్రి) ౧ బీభత్సరాగితే=బీభత్సరసముకలవాఁడు, ౨ అసంస్కృతే = సంస్కారహీనమయినది. |
| విచ్ఛిత్తిరంగరాగే విచ్ఛేదే హారభేదే స్త్రీ, | విచ్ఛిత్తిః— (స్త్రీ) ౧ అంగరాగే = మైపూత, ౨ విచ్ఛేదే=ముగియుట అనఁగా అంతమొందుట, 3 హారభేదే = హారవిశేషము. |
| విదితం బుధితార్థితయో | విదితం—(న) ౧ బుధిత = తెలియఁబడినది, ౨ అర్థితయోః=యాచింపఁబడినది. |
| ర్విపత్తిరపియాతనాపదోర్యోషిత్. ౧౫౯ | విపత్తిః—(స్త్రీ) ౧ యాతనా = నరకసంబంధమయిన తీవ్రవేదన, ౨ ఆపదోః =ఆపద. |
| వృత్తాంతః ప్రక్రియాయాం స్యాత్కార్త్స్న్యే వార్తా | వృత్తాంతః—(పు) ౧ ప్రక్రియాయాం= ప్రకరణము, ౨ కార్త్స్న్యే=సంపూ |

ప్రభేదయోః, ప్రస్తావే

ర్ణము, 3 వార్తా = వృత్తాంతము, ౪ ప్రభేదయోః = ప్రకారము, ౫ ప్రస్తావే=ప్రస్తావము.

వేష్టితం రుద్ధే లాసకే కరణాంతరే. ౧౬౦

వేష్టితం—(న) ౧ రుద్ధే = అరికట్టఁబడినది, ౨ లాసకే= గృహశిరోభాగము, 3 కరణాన్తరే=కరణవిశేషము.

వేల్లితం గమనే క్లీబం కుటిలే విధుతే త్రిషు,

వేల్లితం—(న) ౧ గమనే = వెళ్లుట, ౨ కుటిలే=వంకరయినది,(త్రి) 3 విధుతే= చలింపఁబడినది.

వివర్తః సముదాయే స్యాదపవర్తననృత్యయోః. ౧౬౧

వివర్తః—(పు) ౧ సముదాయే = సమూహము, ౨ అపవర్తన = పొర్లుట, 3 నృత్యయోః=నాట్యము.

శకుంతః కీటభేదే స్యాద్భాసపక్షివిహంగయోః,

శకుంతః—(పు) ౧ కీటభేదే = పురుగులలో నొకటి, ౨ భాసపక్షి=పాలపిట్ట, 3 విహంగయోః=పక్షి.

శ్రీమాం స్తిలకవృక్షే నా మనోజ్ఞే ధనికే త్రిషు. ౧౬౨

శ్రీమాన్—(పు) ౧ తిలకవృక్షే = తిలకపుచెట్టు,౨మనోజ్ఞే=మనోహరమయినది, (త్రి) 3 ధనికే=ధనికుఁడు.

శ్రీపతిః పుంసి పృథివీనాథే చ మధుసూదనే,

శ్రీపతిః—(పు) ౧ పృథివీనాథే = రాజు, ౨ మధుసూదనే=విష్ణుమూర్తి.

శుద్ధాంతోఽన్తఃపురే క్ష్మాభృత్ రహఃకక్షాంతరేఽపి చ.

శుద్ధాంతః— (పు) అన్తఃపురే = అంతఃపురము, ౨ క్ష్మాభృద్రహఃకక్షాంతరే= రాజగృహమందిరవిశేషము. (బంకులు సోఫాలనఁబడుతావు.)

స్రవంతీ తు తరంగిణ్యాం గుల్మస్థానౌషధీభిదోః,

స్రవంతీ—(స్త్రీ) ౧ తరంగిణ్యాం = నది, ౨ గుల్మస్థాన = చీలమండ, 3 ఓషధీభిదోః=ఎలుకచెవిచెట్టు.

సంవర్తః ప్రళయే మున్యంతరే కర్షఫలేఽపి చ. ౧౬౪

సంవర్తః—(పు) ౧ ప్రళయే = ప్రళయము, ౨ మున్యంతరే=సంవర్తుఁడనే ముని, 3 కర్షఫలే=తాడిచెట్టు.

| | |
|---|---|
| స్ఖలితం చలితే భ్రంశే | స్ఖలితం—(న) ౧ చలితే = తొట్రుపడుట, ౨ భ్రంశే = జాతివిహితధర్మభ్రంశము. |
| సంహతం సంగతే దృఢే, | సంహతం— (న) ౧ సంగతే = కలిసియున్నది, ౨ దృఢే=దృఢమయినది. |
| సంస్కృతః కృత్రిమే శస్తే భూషితే ఽప్యన్యలిఙ్గకః. ౧౬౫. క్లీబం తు లక్ష్మణోపేతే | సంస్కృతః—(త్రి) ౧ కృత్రిమే=కల్పితమయినది, ౨ శస్తే=ప్రశస్తమయినది, 3 భూషితే=అలంకరింపఁబడినది, ౪ లక్ష్మణోపేతే = వ్యాకరణాదిలక్షణయుక్తమయినది. (న) |
| స్థపతిః కంచుకిన్యపి, జీవేష్టియాజకే శిల్పిభేదే నాసత్తమే త్రిషు. ౧౬౬ | స్థపతిః— (పు) ౧ కంచుకిని = అంతఃపురపు కావలివాఁడు, ౨ జీవేష్టియాజకే = బృహస్పతీష్టిని జేసినవాఁడు, 3 శిల్పిభేదే=శిల్పివిశేషము, ౪ సత్తమే = శ్రేష్ఠుఁడు. (త్రి) |
| సంఘాతః పుంసి ఘాతే చ సంహతౌ నరకాంతరే, | సంఘాతః—(పు) ౧ ఘాతే = చంపుట, ౨ సంహతౌ = సమూహము, 3 నరకాన్తరే=సంఘాతమను నరకభేదము. |
| సంవిత్తిః ప్రతిపత్తౌ స్యాదవివాదే జనస్య చ. ౧౬౭ | సంవిత్తిః—(స్త్రీ) ౧ ప్రతిపత్తౌ=గౌరవము, ౨ జనస్య అవివాదే = జనులయొక్క వివాదము లేకపోవుట. |
| సంతతిస్స్యాత్పంక్తౌ గోత్రే పారంపర్యేచ పుత్రయోః, | సంతతిః—(స్త్రీ) ౧ పంక్తౌ = పంక్తి, ౨ గోత్రే = వంశము, 3 పుత్రయోః పారంపర్యే=పుత్రులు మనుమలు వీరి పరంపర. |
| సంగతిస్సంగమే జ్ఞానే | సంగతిః—(స్త్రీ) ౧ సంగమే = కలియుట, ౨ జ్ఞానే=జ్ఞానము. |

| | |
|---|---|
| సన్నతిః ప్రణతౌ ధ్వనౌ. | సన్నతిః—(స్త్రీ) ౧ ప్రణతౌ = నమస్కారము, ౨ ధ్వనౌ=ధ్వని. |
| సమితిస్సంపరాయే స్యాత్స భాయాం సంగమేఽపి చ, | సమితిః—(స్త్రీ) ౧ సంపరాయే=యుద్ధము, ౨ సభాయాం = సభ, 3 సంగమే= కలియుట. |
| సమాప్తిరవసానే స్యాత్సమర్థనేఽ | సమాప్తిః—(స్త్రీ) ౧ అవసానే = ముగియుట, ౨ సమర్థనే=సమర్థించుట. |
| థ సమ్మతిః. ౧౬౯. అభిలాషేఽప్యనుజ్ఞాయాం సంవిత్త్యాద్యాస్తు యోషితి, | సమ్మతిః—(స్త్రీ) ౧ అభిలాషే = ఇచ్ఛ, ౨ అనుజ్ఞాయాం = అనుజ్ఞ, సంవిత్త్యాద్యాః యోషితి, సంవిత్తిశబ్దము మొదలుకొని సమ్మతిశబ్ద పర్యన్తము లయిన శబ్దములు స్త్రీలింగములు. |
| స్థాపితం నిశ్చితే న్యస్తే | స్థాపితం—(న) ౧ నిశ్చితే = నిశ్చయింపఁబడినది, ౨ న్యస్తే=ఉంచఁబడినది. |
| స్తిమితోఽచంచలార్ద్రయోః. | స్తిమితః—(పు) ౧ అచంచల = నిశ్చలమయినది, ౨ ఆర్ద్రయోః=తడిసినది. |
| సికతా స్త్రీ సికతిలే వాలుకాయాం తు భూమని, | సికతా—(స్త్రీ) ౧ సికతిలే = ఇసుకగల భూమి, ౨ వాలుకాయాం = ఇసుక. (స్త్రీ. ని. బ.) |
| సురతం స్యాన్నిధువనే దేవత్వే సురతా స్మృతా. | సురతం—(న) ౧ నిధువనే = మైథునము. సురతా—(స్త్రీ) ౧ దేవత్వే = దేవభావము. |
| సుకృతం తు శుభే పుణ్యే క్లీబం సువిహితే త్రిషు, | సుకృతం—(న) ౧ శుభే = శుభము, ౨ పుణ్యే = పుణ్యము, 3 సువిహితే= బాగుగాఁజేయఁబడినది. (త్రి) |
| సువ్రతా సుఖసందోహ్యా శోభనవ్రతయోరపి. ౧౭౨ | సువ్రతా— (స్త్రీ) ౧ సుఖసందోహ్యా = తిన్నగా పిదుకనిచ్చెడియావు, ౨ శోభనవ్రతయోః = మంచివ్రతము గలది. |

| | |
|---|---|
| సునీతిశ్శోభనవయే ధ్రువమాతరి యోషితి, | సునీతిః—(స్త్రీ) ౧ శోభననయే=యోగ్యమైననీతి, ౨ ధ్రువమాతరి = ధ్రువుని తల్లి. |
| సూనృతం మంగలేఽపి స్యాత్ప్రియసత్యవచస్యపి. ౧౭౩ | సూనృతం—(న) ౧ మంగలే = మంగళము, ౨ ప్రియసత్యవచసి = ప్రియమైన యథార్థమైనమాట. |
| హరిద్దిశి స్త్రియాం పుంసి హయవర్ణవిశేషయోః, అస్త్రియాం స్యాత్తృణే | హరిత్—(స్త్రీ) ౧ దిశి=దిక్కు, ౨హయ=సూర్యునిగుఱ్ఱము, ౩ వర్ణవిశేషయోః =ఆకుపచ్చరంగు, ౪ తృణే=గడ్డిపోచ. (పు) |
| చాథ హర్మితం క్షిప్తదగ్ధయోః. ౧౭౪ | హర్మితం—(న) ౧ క్షిప్త = ప్రేరణచేయఁబడినది, ౨ దగ్ధయోః=కాల్చఁబడినది. |
| హరితా స్త్రీ చ దూర్వాయాం హరిద్వర్ణయుతేఽన్యవత్, | హరితా.— (స్త్రీ) ౧ దూర్వాయాం = గఱిక, ౨ హరిద్వర్ణయుతే=పచ్చరంగుగలది. (త్రి) |
| హసంత్యంగారధాన్యాం చ మల్లికాశాకినీభిదోః. ౧౭౫ | హసంతీ—(స్త్రీ) ౧ అంగారధాన్యాం = కుంపటి, ౨ మల్లికా = మల్లెచెట్టు, ౩ శాకినీభిదోః = తోఁటకూరలలో నొకభేదము. |
| హారీతః పక్షిభేదే స్యాన్ముని భేదే చ కైతవే, | హారీతః—(పు) ౧ పక్షిభేదే = పచ్చనివన్నెగలపిట్ట, ౨ మునిభేదే=హారీతుఁడనుముని, ౩ కైతవే=కపటము. |
| హృషితం విస్మితే ప్రీతే ప్రహతే హృష్టలోమని. ౧౭౬ | హృషితః—(పు) ౧ విస్మితే = ఆశ్చర్యముపొందినవాఁడు, ౨ ప్రీతే=సంతోషించినవాఁడు, ౩ ప్రణతే = నమస్కరించినవాఁడు, ౪ హృష్టలోమని = రోమాంచముగలవాఁడు. |

| త చతుష్కం. | నాలుగక్షరములుగల తకారాంత శబ్దములు. |
| --- | --- |
| అవసితమృద్ధే జ్ఞాతేఽప్యవసానగతే చ వాచ్యలింగం స్యాత్, | అవసితం—(త్రి) ౧ ఋద్ధే=సమృద్ధిగలది ౨ జ్ఞాతే= తెలియఁబడినది, 3 అవసానగతే=సమాప్తిఁబొందినది. |
| అర్థపతిః పుంలిఙ్గో ధనాధినాథే చ నరనాథే. ౧౭౭ | అర్థపతిః—(పు) ౧ ధనాధినాథే = కుబేరుఁడు, ౨ నరనాథే=రాజు. |
| అవదాతస్సితే గౌరే విశుద్ధే ఽప్యన్యలిఙ్గకః, | అవదాతః—(త్రి) ౧ సితే = తెల్లనిది, ౨ గౌరే=పచ్చనిది, 3 విశుద్ధే = పరిశుద్ధమైనది. |
| అవగీతం తు నిర్వాదే దృష్టగర్హితయోరపి. ౧౭౮ | అవగీతం—(న) ౧ నిర్వాదే = వాదములేనిది, ౨ దృష్ట = చూడఁబడినది, 3 గర్హితయోః=నిందింపఁబడినది. |
| అంతర్గతం విస్మృతే స్యాన్మధ్యప్రాప్తే చ వాచ్యవత్, | అంతర్గతం—(త్రి) ౧ విస్మృతే = మరువఁబడినది, ౨ మధ్యప్రాప్తే=మధ్యమును పొందినది. |
| అంగారితం తు దగ్ధే స్యాత్పలాశకలికోద్గమే. ౧౭౯. హసంత్యాం చ లతామాత్రే నదీభేదే చ యోషితి, | అంగారితం—(న) ౧ దగ్ధే = కాల్పఁబడినది, ౨ పలాశకలికోద్గమే = మోదుగమొగ్గపుట్టుట, 3 హసంత్యాం=కుంపటి, (స్త్రీ) ౪ లతామాత్రే = సామాన్యపుతీఁగె, ౫ నదీభేదే = నదీవిశేషము. |
| అపావృతస్తు పిహితే స్వతంత్రేఽపి చ వాచ్యవత్. | అపావృతః—(త్రి) ౧ పిహితే = కప్పఁబడినది, ౨ స్వతంత్రే=స్వతంత్రము |
| అత్యాహితం మహాభీతౌ జీవనాపేక్షకర్మణి, | అత్యాహితం— (న) ౧ మహాభీతౌ = గొప్పభయము, ౨ జీవనాపేక్షకర్మణి = జీవనము నపేక్షించిచేయు కార్యము. |
| అభినీతం త్రిషు న్యాయ్యే సంస్కృతామర్షిణోరపి ౧౮౧ | అభినీతం—(త్రి) ౧ న్యాయ్యే = న్యాయము, ౨ సంస్కృత = సవరింపఁబడినది, 3 అమర్షిణోః=కోపముగలది. |

| | |
|---|---|
| అభిజాతః కులీనే స్యాన్న్యాయ్యపండితయో స్త్రిషు, | అభిజాతః—(పు) ౧ కులీనే = గొప్పకులమువాఁడు, ౨ న్యాయ్య=న్యాయము, 3 పండితయోః=పండితుఁడు. (త్రి) |
| అభియుక్తః పరైరుద్ధే తత్పరేఽప్యభిధేయవత్. ౧౮౨ | అభియుక్తః—(పు) ౧ పరైరుద్ధే=శత్రువులచేత నరిగట్టఁబడినది, ౨ తత్పర= మిక్కిలియాసక్తిగలది. (త్రి). |
| అతిముక్తస్తు నిస్సంగే వాసంత్యాం తినిశేఽపి చ, | అతిముక్తః—(పు) ౧ నిస్సంగే = సంగములేనివాఁడు, ౨ వాసంత్యాం=బండిగురివెంచతీఁగె, 3 తినిశే = నెమ్మిచెట్టు. |
| అవధ్వస్తః పరిత్యక్తే నిందితేఽప్యవచూర్ణితే. ౧౮౩ | అవధ్వస్తః—(పు) ౧ పరిత్యక్తే=విడువఁబడినవాఁడు, ౨ నిందితే = నిందింపఁబడినవాఁడు, 3 అవచూర్ణితే=పరులచేతఁ బీడింపఁబడినవాఁడు |
| ఆధిక్షిప్తః ప్రణిహితే కుత్సితే భర్త్సితే త్రిషు, | అధిక్షిప్తః—(త్రి) ౧ ప్రణిహితే=ఉంచఁబడినది, ౨ కుత్సితే = నికృష్టుఁడు, 3 భర్త్సితే=బెదరింపఁబడినవాఁడు. |
| అంశుమాన్ భాస్కరే శాలపర్ణ్యామంశుమతీ స్మృతా. ౧౮౪. భవే, | అంశుమాన్—(పు) ౧ భాస్కరే = సూర్యుఁడు, ౨ శాలపర్ణ్యాం = వృక్షవిశేషము, యీయర్థమునందు అంశుమతీ అనియుండును. |
| దపచితిఃపూజావ్యయనిష్కృతిహానిషు, | అపచితిః—(స్త్రీ) ౧ పూజా = పూజ, ౨ వ్యయ = ఖర్చు, 3 నిష్కృతి = ప్రతీకారము, ౪ హానిషు=నాశము. |
| అథానుమతిరూనేందు పూర్ణిమానుజ్ఞయోరపి. ౧౮౫ | అనుమతిః—(స్త్రీ) ౧ ఊనేందుపూర్ణిమా= ఒకకళచేత తక్కువయైనచంద్రుఁడుగల పున్నమ, ౨ అనుజ్ఞయోః=ఆజ్ఞ. |
| అభిశస్తిః ప్రార్థనాపవాదయోశ్చ త్రయం స్త్రియామ్, | అభిశస్తిః—(స్త్రీ) ౧ ప్రార్థనా = కోరిక, ౨ అపవాదయోః=అపవాదము. |

| | |
|---|---|
| ఆయుష్మాన్యోగభేదే నా వా<br>చ్యవచ్చిరజీవిని. ౧౮౬ | ఆయుష్మాన్—(పు) ౧ యోగభేదే = ఆయుష్మాన్నామయోగము, ౨ చిరజీవిని = చిరకాలము జీవించువాఁడు. (త్రి) |
| ఉపాహితోఽనలోత్పాతే పు<br>మానారోపితే త్రిషు, | ఉపాహితః—(పు) ౧ అనలోత్పాతే = అగ్నివలనియపాయము, ౨ ఆరోపితే= ఆరోపింపఁబడినది. (త్రి) |
| ఉపాకృతో ఽధ్వరహతపశౌ<br>నోపద్రవే త్రిషు. ౧౮౭ | ఉపాకృతః—(పు) ౧ అధ్వరహతపశౌ = యజ్ఞమందుచంపఁబడిన పశువు, ౨ ఉపద్రవే=ఉపద్రవము. (త్రి) |
| ఉదాస్థితః ప్రతీహారే ప్రవ్ర<br>జ్యావసితే చరే స్యా | ఉదాస్థితః—(పు) ౧ ప్రతీహారే = ద్వారపాలకుఁడు, ౨ ప్రవ్రజ్యావసితే=సన్న్యాసమువల్ల భ్రష్టుఁడైనవాఁడు ౩ చరే = చారుఁడు. |
| దుల్లిఖితముత్కీర్ణే తనూకృ<br>తే చ వాచ్యవత్. ౧౮౮ | ఉల్లిఖితం—(త్రి) ౧ ఉత్కీర్ణే=తొలువఁబడినది, ౨ తనూకృతే=చెక్కఁబడినది |
| ఉద్గ్రాహితముదీర్ణే స్యాద్బ<br>ద్ధగ్రాహితయోస్త్రిషు, | ఉద్గ్రాహితం—(త్రి) ౧ ఉదీర్ణే = పురుషార్థములయందధికేచ్ఛగలవాఁడు, ౨ బద్ధ=కట్టఁబడినది, ౩ గ్రాహితయోః= పుచ్చుకోఁబడ్డది. |
| భవేదుపచితం దిగ్ధే సమృద్ధే<br>వాచ్యలింగకం. ౧౮౯ | ఉపచితం—(త్రి) ౧ దిగ్ధే = పూయఁబడినది, ౨ సమృద్ధే=సమృద్ధికలది. |
| ఉజ్జృంభితం త్రిషూత్ఫుల్లే<br>చేష్టాయాం తు నపుంసకం, | ఉజ్జృంభితం—(త్రి) ౧ ఉత్ఫుల్లే=వికసించినది, ౨ చేష్టాయాం=వ్యాపారము.(న) |
| ఉపరక్తో వ్యసనార్తే రాహు<br>గ్రస్తేందుసూర్యయోః. | ఉపరక్తః—(పు) ౧ వ్యసనార్తే = వ్యసనముచేతపీడితుఁడు, ౨ రాహుగ్రస్తేందుసూర్యయోః = రాహువుచే మ్రింగఁబడిన సూర్యచంద్రులు. |
| ఉపసత్తిస్సంగమాత్రే సేవా<br>యామపి యోషితి, | ఉపసత్తిః—(స్త్రీ) ౧ సంగమాత్రే=సామాన్యముగా సమీపము, ౨ సేవాయాం = సేవ. |

ఋష్యప్రోక్తా శతావర్యతి బలాశూకశింబిషు. ౧౯౧

ఋష్యప్రోక్తా—(స్త్రీ) ౧ శతావరీ=పిల్లిపీచరచెట్టు, ౨ అతిబలా = అతిబల యనుచెట్టు, ౩ శూకశింబిషు = దూలగొండిచెట్టు.

ఐరావతో౽భ్రమాతంగే నారంగే లకుచద్రుమే నాగభేదే చ పుంసి స్యాద్విద్యుత్తద్భేదయోః స్త్రియాం ౧౯౨ నపుంసకం మహేంద్రస్య ఋజుదీర్ఘశరాసనే,

ఐరావతః—(పు) ౧ అభ్రమాతంగే = ఇంద్రునియేనుఁగు, ౨ నారంగే=నారంజిచెట్టు, ౩ లకుచద్రుమే = కమ్మరేఁగుచెట్టు, ౪ నాగభేదే=సర్పభేదము, ౫ విద్యుత్ = మెఱుపు, ౬ తద్భేదయోః= మెఱుపులలోనిభేదము, ౭ మహేంద్రస్యఋజుదీర్ఘశరాసనే = ఇంద్రుని యొక్క పొడవగు ఇంద్రధనుస్సు. (న)

కలధౌతం సువర్ణే స్యాద్రజతే చ నపుంసకం. ౧౯౩ భవేత్కుహారితం క్లీబం పికాలాపే రతధ్వనౌ,

కలధౌతం—(న) ౧ సువర్ణే=బంగారము, ౨ రజతే=వెండి.

కుహారితం—(న) ౧ పికాలాపే = కోకిలధ్వని, ౨ రతధ్వనౌ=సురతముయొక్క ధ్వని.

కుముద్వాన్కుముదప్రాయే దేశే స్యాద్వాచ్యలిఙ్గకః.

కుముద్వాన్—(త్రి) ౧ కుముదప్రాయదేశే=కలువలుబాలాగల ప్రదేశము.

కుముద్వతీ కుముదిన్యాం కుశపత్న్యాం చ యోషితి,

కుముద్వతీ—(స్త్రీ) ౧ కుముదిన్యాం=సరస్సు, ౨ కుశపత్న్యాం=కుశునిభార్య.

కృష్ణవృంతా పాటలాయాం మాషపర్ణ్యాంచ యోషితి.

కృష్ణవృన్తా—(స్త్రీ) ౧ పాటలాయాం = కలిగొట్టుచెట్టు, ౨ మాషపర్ణ్యాం= కారుమినపచెట్టు.

అథ గంధవతీ పృథ్వీపురీభిద్వ్యాసమాతృషు, సురాయాం చ

గంధవతీ—(స్త్రీ) ౧ పృథ్వీ = పుడమి, ౨ పురీభిది=వాయుపట్టణము, ౩ వ్యాసమాతృషు = వ్యాసునితల్లి, ౪ సురాయాం=కల్లు.

| | |
|---|---|
| గరుత్మాంశ్చ పక్షిమాత్రే ఖగాధిపే. ౧౯౬. భవే | గరుత్మాన్— (పు) ౧ పక్షిమాత్రే = సామాన్యపుపక్షి, ౨ ఖగాధిపే=గరుత్మంతుఁడు. |
| ద్గృహపతిః పుంసి గృహస్థేఽపి చ సత్రిణి, | గృహపతిః—(పు) ౧ గృహస్థే=గృహస్థుఁడు, ౨ సత్రిణి=యజ్ఞము చేసినవాఁడు. |
| చంద్రకాంతస్తు పుంసి స్యాన్మణిభేదే చ కైరవే. ౧౯౭ | చంద్రకాన్తః— (పు) ౧ మణిభేదే = చంద్రకాన్తమణి, ౨ కైరవే= తెల్లకలువ. |
| చర్మణ్వతీ నదీభేదే కదలీపాదపే స్త్రియాం, | చర్మణ్వతీ—(స్త్రీ) ౧ నదీభేదే = నదీ విశేషము, ౨ కదలీపాదపే = అరటిచెట్టు. |
| చిత్రగుప్తస్తు పుంసి స్యాద్యమే తస్య చ లేఖకే. ౧౯౮ | చిత్రగుప్తః—(పు) ౧ యమే = యముఁడు, ౨ తస్యచలేఖకే=చిత్రగుప్తుఁడు. |
| దివాభీతః కుంభిలే స్యాదులూకే కుముదాకరే, | దివాభీతః—(పు) ౧ కుంభిలే = దొంగ, ౨ ఉలూకే=గుడ్లగూబ, 3 కుముదాకరే=కలువలుండుసరస్సు. |
| దివాకీర్తిస్తు పుంసి స్యాన్నాపితాంతావసాయినోః. | దివాకీర్తిః—(పు) ౧ నాపిత = మంగలవాఁడు, ౨ అన్తావసాయినోః. మాదిగవాఁడు. |
| ద్వీపవాన్ సింధునదయోః | ద్వీపవాన్—(పు) ౧ సింధు=సముద్రము, ౨ నదయోః=నదము. |
| ద్వీపవత్యాపగాభువోః, | ద్వీపవతీ—(స్త్రీ) ౧ ఆపగా = నది, ౨ భువోః=భూమి. |
| దృషద్వతీ నదీభేదే కాత్యాయన్యామపి స్త్రియామ్. | దృషద్వతీ—(స్త్రీ) ౧ నదీభేదే = నదీవిశేషము, ౨ కాత్యాయన్యాం=పార్వతీదేవి. |
| స్యాద్ధూమకేతురుత్పాతభేదే వైశ్వానరే పుమాన్, | ధూమకేతుః—(పు) ౧ ఉత్పాతభేదే = తోఁకచుక్క, ౨ వైశ్వానరే=అగ్ని. |
| నంద్యావర్తః పుమాన్వేశ్మప్రభేదే తగరద్రుమే. ౨౦౧ | నంద్యావర్తః—(పు) ౧ వేశ్మప్రభేదే = గృహవిశేషము, ౨ తగరద్రుమే = తగరపుచెట్టు. |

| | |
|---|---|
| నదీకాంతస్సముద్రే స్యాద్విజ్జలే సింధువారకే, | నదీకాన్తః—(పు) ౧ సముద్రే = సముద్రము, ౨ హిజ్జలే = ఎఱ్ఱగన్నేరు, 3 సింధువారకే=వావిలిచెట్టు. |
| నదీకాంతా స్త్రియాం జంబ్వాం కాకజంఘాపథావపి. | నదీకాన్తా—(స్త్రీ) ౧ జంబ్వాం = నేరేడుచెట్టు, ౨ కాకజంఘాపథా = కాకిదొండచెట్టు. |
| నాగదంతో ద్విపరదే గృహాన్నిర్గతదారుణి, | నాగదన్తః—(పు) ద్విపరదే = ఏనుఁగుదంతము, ౨ గృహాన్నిర్గతదారుణి = ఇంటికివేసినదూలము. |
| నాగదంతీ తు కుంభాయాం శ్రీహస్తిన్యామపిస్త్రియాం. | నాగదన్తీ—(స్త్రీ) ౧ కుంభాయాం=నాగదంతిచెట్టు, ౨ శ్రీహస్తిన్యాం=గురుగుచెట్టు. |
| నిష్కాసితో నిర్గమితేఽప్యాహితేధిక్కృతేఽపి చ, | నిష్కాసితః—(పు)౧ నిర్గమితే=వెళ్లఁగొట్టఁబడినవాఁడు, ౨ ఆహితే=స్థాపింపఁబడినది, 3 ధిక్కృతే=తిరస్కరింపఁబడినది. |
| అథ నిష్ఠుషితం త్యక్తే త్వగ్నిహీనే లఘూకృతే. ౨౦౪ | నిష్ఠుషితం—(త్రి) ౧ త్యక్తే = విడిచిపెట్టఁబడినది, ౨ అగ్నిహీనే = నిప్పులేనినివురు, 3 లఘూకృతే=సానపెట్టఁబడినది. |
| నిరాకృతి రనాకారేఽస్వాధ్యాయే త్రిషువారణే,స్త్రియాం | నిరాకృతిః—(త్రి) ౧ అనాకారే=ఆకారములేనిది,౨ అస్వాధ్యాయే=వేదముచదువనివాఁడు, 3 వారణే = నిరాకరించుట. (స్త్రీ) |
| పరిగతం ప్రాప్తే విస్మృతజ్ఞాతవేష్టితే. ౨౦౫ | పరిగతం—(త్రి) ౧ ప్రాప్తే = పొందఁబడినది, ౨ విస్మృతే = మరువఁబడినది, 3 జ్ఞాత=తెలియఁబడినది,3 వేష్టితే=చుట్టఁబడినది. |
| అథ ప్రణిహితం న్యస్తే ప్రాప్తేఽపి చ సమాహితే, | ప్రణిహితం—(త్రి) ౧ న్యస్తే=ఉంచఁబడినది, ప్రాప్తే=పొందఁబడినది, 3 సమాహితే=ధ్యానముజేయఁబడినది. |

| | |
|---|---|
| భగవాన్నాజినే గౌర్యాం స్త్రియాం పూజ్యే తు వాచ్యవత్. ౨౧౪ | భగవాన్—(పు) ౧ జినే=బుద్ధుఁడు, ౨ గౌర్యాం = పార్వతి, (స్త్రీ) 3 పూజ్యే=పూజ్యుఁడు. (త్రి.) |
| అథ భోగవతీ నాగపురీ నద్యోరహా పుమాన్, | భోగవతీ—(స్త్రీ) ౧ నాగపురీ = పాతాళలోకమందలి పట్టణము, నద్యోః=పాతాళగంగా, 3 అహా = సర్పము. (పు.) |
| రంగమాతా తు కుట్టన్యాం వృక్షరోగాంతరేపుమాన్ | రంగమాతా—(స్త్రీ) ౧ కుట్టన్యాం = కుంటెనకత్తె, ౨ వృక్షరోగాన్తరే=వృక్షరోగభేదము. (పు) |
| లక్ష్మీపతిః పుమాన్వాసుదేవే నరపతావపి, | లక్ష్మీపతిః—(పు) ౧ వాసుదేవే = విష్ణువు, ౨ నరపతౌ=రాజు. |
| వ్యతీపాతో మహోత్పాతే యోగభేదాపయానయోః. | వ్యతీపాతః—(పు) ౧ మహోత్పాతే = ధూమకేతువు మొదలయినవి, ౨ యోగభేద=యోగభేదము, 3 అపయానయోః=వెళ్లుట. |
| వనస్పతిర్నా ద్రుమాత్రే వినా పుష్పంఫలిద్రుమే, | వనస్పతిః—(పు) ౧ ద్రుమాత్రే=సామాన్యమైన వృక్షము, ౨ వినాపుష్పం ఫలిద్రుమే=పూవులుపూయకనేఫలించు వృక్షము. (అత్తిచెట్టు) |
| వినిపాతో నిపాతే స్యాద్దైవాదివ్యసనే పుమాన్. | వినిపాతః—(పు) ౧ నిపాతే = పడుట, ౨ దైవాదివ్యసనే = దైవము మొదలయినవారివల్ల వచ్చినదుఃఖము. |
| విజృంభితం తు చేష్టాయాం క్లీబం త్రిషు వికస్వరే, | విజృంభితం—(న) ౧ చేష్టాయాం = చేష్ట, ౨ వికస్వరే = వికసించినది, (త్రి) |
| వివస్వాన్విబుధే సూర్యే తన్నగర్యాం వివస్వతీ. ౨౧౮ | వివస్వాన్—(పు) ౧ విబుధే = దేవత. ౨ సూర్యే = సూర్యుఁడు. 3 తన్నగర్యాం=సూర్యపట్టణము. (వివస్వతీ) |

| | |
|---|---|
| వైజయంతో మహేంద్రస్య ధ్వజప్రాసాదయోఃపుమాన్ | వైజయన్తః—(అ. పు) ౧, ౨, మహేంద్రస్యధ్వజప్రాసాదయోః = ఇంద్రధ్వజము, ఇంద్రప్రాసాదము. |
| వైజయంతీ పతాకాయాం జయంతీపాదపే స్త్రియాం. | వైజయంతీ—(స్త్రీ) ౧ పతాకాయాం = జండ, ౨ జయంతీపాదపే = తక్కిలిచెట్టు. |
| భవేచ్ఛతధృతిః పుంసి శక్రే చ పరమేష్ఠిని, | శతధృతిః—(పు) ౧ శక్రే = ఇంద్రుఁడు, ౨ పరమేష్ఠిని= బ్రహ్మ. |
| శుభదంతీ సుదంత్యాం స్యాత్పుష్పదంతేభయోషితి. | శుభదంతీ—(స్త్రీ) ౧ సుదంత్యాం=మంచి దంతములు గలది, ౨ పుష్పదంతేభయోషితి = పుష్పదంతమనుగజము యొక్క భార్య. |
| సముద్ధతం సముత్క్షిప్తేఽప్యవినీతే చ వాచ్యవత్, | సముద్ధతం—(త్రి) ౧ సముత్క్షిప్తే = వెళ్లగ్రక్కఁబడినది, ౨ అవినీతే=గర్వించినవాఁడు. |
| సదాగతిర్నార్కవాతనిర్వాణేషు సదీశ్వరే. ౨౨౨ | సదాగతిః—(పు) ౧ అర్క=సూర్యుఁడు, ౨ వాత=వాయువు, ౩ నిర్వాణేషు = మోక్షము, ౪ సదీశ్వరే = సత్ప్రభువు. |
| సరస్వాంశ్చ నదే చాబ్ధౌ నాన్యవద్రసికే స్త్రియాం, వాణీస్త్రీరత్న వాగ్దేవీగోనదీషు నదీభిది. ౨౨౩. మనుపత్న్యామపి | సరస్వాన్—(త్రి) ౧ నదే = నదము, ౨ అబ్ధౌ=సముద్రము, ౩ రసికే=రసికుఁడు, (స్త్రీ) ౪ వాణీ = వాక్కు, ౫ స్త్రీరత్న=శ్రేష్ఠమైనస్త్రీ, ౬ వాగ్దేవీ=సరస్వతీ, ౭ గో=గోవు, ౮ నదీ=ఏరు, ౯ నదీభిది = సరస్వతీనది, ౧౦ మనుపత్న్యాం=మనుభార్య. |
| సత్యవతీ వ్యాసస్య మాతరి, నారదర్షికయోః పత్న్యాం స్త్రియాంపుంసినృపాంతరే. | సత్యవతీ—(స్త్రీ) ౧ వ్యాసస్యమాతరి = వ్యాసునియొక్కతల్లి, ౨ నారదర్షికయోః పత్న్యాం=నారదునిభార్య, ౩ |

| | |
|---|---|
| | ఋచీకమహామునిభార్య, ౪ నృపాంతరే=సత్యవంతుడనే రాజు (పు) |
| సముద్రాంతా తు కార్పాసీ పృక్కాదురాలభాసు చ, | సముద్రాన్తా—(స్త్రీ) ౧ కార్పాసీ = ప్రత్తి చెట్టు, ౨ పృక్కా=ఒకానొకశాకము ౩ దురాలభాసు=తీటకసింద. |
| సమాహిత స్సమాధిస్థే ఽప్యుక్తసిద్ధాంత ఆహితే. ౨౨౫. నిర్వివాదీకృతేఽపి స్యాత్ప్రతిజ్ఞాతే చ వాచ్యవత్, | సమాహితః—(త్రి) ౧ సమాధిస్థే=సమాధిలో నున్నవాఁడు, ౨ ఉక్తసిద్ధాంతే = సిద్ధాన్తము చేయఁబడినది, ౩ ఆహితే=ఉంచఁబడినది, ౪ నిర్వివాదీకృతే=వివాదములేకుండునట్లు జేయఁబడినది, ౫ ప్రతిజ్ఞాతే=ప్రతిజ్ఞ చేయఁబడినది. |
| సమాఘాతో వధే యుద్ధే | సమాఘాతః—(పు) ౧ వధే=చంపుట, ౨ యుద్ధే=యుద్ధము. |
| సంఖ్యావాన్పండితే పుమాన్. ౨౨౬. సంఖ్యాయుక్తేఽన్యలింగోఽ | సంఖ్యావాన్—(పు) ౧ పండితే=విద్వాంసుఁడు, ౨ సంఖ్యాయుక్తే=సంఖ్యతో కూడినది. (త్రి) |
| థ సుధాసూతిః పుమాన్మఖే, చంద్రే | సుధాసూతిః—(పు) ౧ మఖే=యజ్ఞము, ౨ చంద్రే=చంద్రుఁడు. |
| సుభాషితో బుద్ధే పుమాన్ సూక్తే నపుంసకమ్. ౨౨౭ | సుభాషితః—(పు) ౧ బుద్ధే=బుద్ధదేవుఁడు, ౨ సూక్తే=బాగుగాఁజెప్పుట. (న) |
| సూర్యభక్తస్తు బంధూకేపుంసి త్రిష్వర్కపూజకే, | సూర్యభక్తః—(పు) ౧ బంధూకే=మంకెనచెట్టు, ౨ అర్కపూజకే=సూర్యుని పూజించువాఁడు. (త్రి) |
| సేనాపతిః కార్తికేయేఽప్యనీకాధిపతౌ పుమాన్. ౨౨౮ | సేనాపతిః—(పు) ౧ కార్తికేయే=కుమారస్వామి, ౨ అనీకాధిపతౌ=సేనానాయకుఁడు. |
| హిమారాతిః పుమాన్వీతిహోత్రే కిరణమాలిని, | హిమారాతిః—(పు) ౧ వీతిహోత్రే = అగ్ని, ౨ కిరణమాలిని=సూర్యుఁడు. |

హైమవత్యభయా స్వర్ణక్షీ రోర్యోః శ్వేతవచోమయోః.

హైమవతీ—(స్త్రీ) ౧ అభయా = కరక చెట్టు, ౨ స్వర్ణక్షీరోర్యోః=కంకుష్ఠమనెడుచెట్టు, 3 శ్వేతవచా=తెల్లవస, ౪ ఉమయోః=పార్వతి.

---

## త-పంచకం.

## ఐదక్షరములుగల తకారాంత శబ్దములు.

అవలోకితో నా లోకనాథే త్రిషు నిరీక్షితే,

అవలోకితః—(పు) ౧ లోకనాథే=బుద్ధుఁడు, ౨ నిరీక్షితే=చూడఁబడినవాఁడు. (త్రి)

అపరాజిత ఈశాజేష్ట్యంతరే నాఽజితే త్రిషు. ౨౩౦. గిరికర్ణిజయా దుర్గాసనపర్ణీషు యోషితి,

అపరాజితః—(పు) ౧ ఈశ=ఈశ్వరుఁడు, ౨ అజ=విష్ణువు, 3 ఇష్ట్యన్తరే=యజ్ఞవిశేషము, ౪ అజితే=జయింపఁబడనిది, (త్రి) ౫ గిరికర్ణీ=నల్లదింటెనచెట్టు, ౬ జయా=జయతిథి, ౭ దుర్గా=పార్వతి, ౮ సనపర్ణీషు=సోమెదపుచెట్టు.

ఉపధూపిత ఆసన్నమరణే పరిధూపితే. ౨౩౧

ఉపధూపితః—(పు) ౧ ఆసన్నమరణే = చావుకుసిద్ధమయినవాఁడు, ౨ పరిధూపితే=ధూపమువేయఁబడినది.

స్యాద్గణాధిపతిః పుంసి శంకరేఽపి గజాననే,

గణాధిపతిః—(పు) ౧ శంకరే = శంకరుఁడు, ౨ గజాననే = వినాయకుఁడు.

భవేత్పిపతిషన్పిత్సౌ త్రిషు పుంసి విహంగమే. ౨౩౨

పిపతిషన్—(త్రి) ౧ పిత్సౌ=పడఁదలంచినది, ౨ విహంగమే=పక్షి (పు)

పృథివీపతిస్తు భూపే ఋషభాఖ్యౌషధౌపుమాన్,

పృథివీపతిః—(పు) ౧ భూపాలే = రాజు, ౨ ఋషభాఖ్యౌషధే = ఋషభమను ఔషధము,

మూర్ధాభిషిక్తో భూపాలే మంత్రిణి క్షత్రియేఽపి చ.

మూర్ధాభిషిక్తః ౧ భూపాలే = రాజు, ౨ మంత్రిణి = మంత్రి, 3 క్షత్రియే = క్షత్రియజాతీయుఁడు.

యాదసాంపతిరంభోధౌ ప శ్చిమాశాపతౌ పుమాన్,

యాదసాంపతిః—(పు) ౧ అంభోధౌ = సముద్రము, ౨ పశ్చిమాశాపతౌ = వరుణదేవుఁడు.

వసంతదూతశ్చూతేస్యాత్పిక పంచమరాగయోః. ౨౩౪

వసన్తదూతః—(పు) ౧ చూతే=మామిడిచెట్టు, ౨ పిక = కోకిల, 3 పంచమరాగయోః=పంచమస్వరము.

వసంతదూతీ పాటల్యామతి ముక్తే చ యోషితి,

వసన్తదూతీ—(స్త్రీ) ౧ పాటల్యాం = కలిగొట్టుచెట్టు, ౨ అతిముక్తే=బండిగురివెంద.

---

## త షట్కం.

## ఆఱక్షరములుగల తకారాంత శబ్దములు.

అర్ధపారావతశ్చిత్రకంఠే తిత్తిరిపక్షిణి. ౨౩౫

అర్ధపారావతః—(పు) ౧ చిత్రకంఠే = పావురములలో నొకభేదము, ౨ తిత్తిరిపక్షిణి=తీతువపిట్ట.

---

## త సప్తకం.

## ఏడక్షరములుగల తకారాంత శబ్దములు.

సముద్రనవనీతం స్యాత్క్లీబం పీయూషచంద్రయోః.

సముద్రనవనీతం—(న) ౧ పీయూష = అమృతము, ౨ చంద్రయోః = చంద్రుఁడు.

ఇతి తాంతవర్గః.

ఇది తాంతవర్గము.

---

## థైకం.

## ఏకాక్షర థ శబ్దములు.

థం రక్షణే మంగలే చ సాధ్వసే చ నపుంసకం, శిలోచ్చయే పుమానేవ క్వచిత్తు భయరక్షకే. ౧

థం—(న) ౧ రక్షణే = రక్షించుట, ౨ మంగలే = మంగళము, 3 సాధ్వసే = భయము, ౪ శిలోచ్చయే=పర్వతము, (పు) ౫ భయరక్షకే = భయమునుండి రక్షించువాఁడు.

---

## థద్వికం.

## రెండక్షరములుగల థకారాంత శబ్దములు.

అర్థో విషయార్థనయోర్ధనకారణవస్తుషు, అభిధేయే చ శబ్దానాం నివృత్తౌ చ ప్రయోజనే. ౨

అర్థః—(పు) ౧ విషయ = ప్రత్యక్షాదిప్రమాణగోచరమయినది, ౨ అర్థనయోః =యాచించుట, ౩ ధన = ధనము, ౪ కారణ=కారణము, ౫ వస్తుషు=వస్తుమాత్రము, ౬ శబ్దానామభిధేయే = శబ్దములయొక్క అర్థము, ౭ నివృత్తౌ = నివర్తించుట, ౮ ప్రయోజనే = ప్రయోజనము.

ఆస్థా త్వాలంబనాస్థాన యత్నాపేక్షాసు యోషితి,

ఆస్థా—(స్త్రీ) ౧ ఆలంబన = ఆశ్రయము, ౨ ఆస్థాన = కొలువుకూటము, ౩ యత్న=ప్రయత్నము, ౪ అపేక్షాసు = కోరిక.

కంథా మృణ్మయభిత్తౌ చ తథా ప్రావరణాంతరే. ౩

కంథా—(స్త్రీ) ౧ మృణ్మయభిత్తౌ = మట్టిగోడ, ౨ ప్రావరణాన్తరే=బొంతగుడ్డ.

క్వాథస్స్యా దతిదుఃఖేఽపి నిష్పాకేఽపి ద్రవస్య చ

క్వాథః—(పు) ౧ అతిదుఃఖే = మిక్కిలిదుఃఖము, ౨ ద్రవస్య నిష్పాకే=ద్రవద్రవ్యముయొక్కవంట.

కుథః స్త్రీపుంసయోర్వర్ణకంబలే పుంసి బర్హిషి. ౪

కుథః—(స్త్రీపు) ౧ వర్ణకంబలే = ఏనుఁగుమీఁదబఱుచురత్నకంబళి, ౨ బర్హిషి =దర్భ. (పు)

కోథో నా నేత్రరోగస్య భేదే చ శటితే త్రిషు

కోథః—(పు) ౧ నేత్రరోగస్యభేదే=కంటిరోగము, ౨ శటితే = మథితమైనది, (చిలుకబడినది.) (త్రి)

గ్రంథో గ్రంథనధనయో స్స్యాచ్ఛాస్త్రాక్షర సంఖ్యయోః.

గ్రంథః—(పు) ౧ గ్రంథనా=కూర్పు, ౨ ధనయోః = ధనము, ౩ శాస్త్ర=శాస్త్రము, ౪ అక్షరసంఖ్యయోః = అక్షరసమూహము.

| | |
|---|---|
| గ్రంథిస్తు గ్రంథిపర్ణే నా బంధే రుగ్భేదపర్వణోః, | గ్రంథి—(పు) ౧ గ్రంథిపర్ణే=మాచిపత్రి, ౨ బంధే = ముడి, 3 రుగ్భేద=రోగభేదము, ౪ పర్వణోః=గణుపు. |
| గాథా శ్లోకే సంస్కృతాన్య భాషాయాం గేయవృత్త యోః. ౬ | గాథా—(స్త్రీ) ౧ శ్లోకే=శ్లోకము, ౨ సంస్కృతాన్యభాషాయాం = సంస్కృతముకంటె వేరైనభాష, 3 గేయ=గానముచేయఁదగినది, ౪ వృత్తయోః=చరిత్రము (నడత) |
| తీర్థం శాస్త్రాధ్వర క్షేత్రోపాయనారీరజస్సు చ, అవతారర్షి జుష్టాంబుపాత్రోపాధ్యాయమంత్రిషు. ౭ | తీర్థం—(న) శాస్త్ర=శాస్త్రము, ౨ అధ్వర=యజ్ఞము, 3 క్షేత్ర=పుణ్యస్థలము, ౪ ఉపాయ = ఉపాయము, ౫ నారీరజస్సు = స్త్రీరజస్సు, ౬ అవతార = రేవు, ౭ ఋషిజుష్టాంబు = మహర్షులు స్నానముజేయు జలాశయము, ౮ పాత్ర=పాత్రము, ౯ ఉపాధ్యాయ = గురువు, ౧౦ మంత్రిషు = మంత్రి. |
| తుత్థమంజనభేదే స్యాన్నీలీ సూక్ష్మైలయోఃస్త్రియాం, | తుత్థం—(న) ౧ అంజనభేదే = మైలతుత్తము, ౨ నీలీ=నీలిచెట్టు, (స్త్రీ) 3 సూక్ష్మైలయోః=సన్నయేలకి. |
| దుఃస్థస్స్యాద్దుర్గతే మూర్ఖే దుఃఖేన తిష్ఠతి త్రిషు. ౮ | దుఃస్థః—(త్రి) ౧ దుర్గతే=దరిద్రుఁడు, ౨ మూర్ఖే = మూర్ఖుఁడు, 3 దుఃఖేనతిష్ఠతి=దుఃఖముగానున్నవాఁడు. |
| ప్రస్థోఽస్త్రియాం మానభేదే సానావున్నితవస్తుని, | ప్రస్థః—(పు) ౧ మానభేదే=కుంచమను పరిమాణము, ౨ సానౌ = కొండచరియ, 3 ఉన్నితవస్తుని = తూచఁబడిన వస్తువు. |
| పాథోఽర్కేఽగ్నౌ జలే క్లీబం | పాథః—(పు) ౧ అర్కే=సూర్యుఁడు, ౨ అగ్నౌ=నిప్పు, 3 జలే = ఉదకము. (న) |

పృథుస్స్యాన్మహతి త్రిషు ౯.
త్వక్పర్ణ్యాం కృష్ణ జీరే స్త్రీ
పుమానగ్నౌ నృపాంతరే,

పృథుః—(త్రి) ౧ మహతి=విశాలమయినది, ౨ త్వక్పర్ణ్యాం = హింగుపత్రిచెట్టు, 3 కృష్ణజీరే=నల్లజిలకఱ్ఱ, (స్త్రీ) ౪ అగ్నౌ = అగ్నిహోత్రుఁడు, ౫ నృపాంతరే = పృథుమహారాజు. (పు)

ప్రోథోఽస్త్రీ హయఘోణా
యాం నా కట్యామధ్వగే
త్రిషు. ౧౦

ప్రోథః—(న్న) ౧ హయఘోణాయాం=గుఱ్ఱముముక్కు, ౨ కట్యాం = కటిప్రదేశము, (పు) 3 అధ్వగే = మార్గముననడుచువాఁడు. (త్రి).

మంథస్స్యాత్పుంసి మంథానే
సాక్తవే చ దివాకరే,

మంథః—(పు) ౧ మంథానే = కవ్వము, ౨ సాక్తవే=సత్తుపిండితోఁజేయఁబడిన పానీయము, 3 దివాకరే=సూర్యుఁడు.

యూథం తిర్యక్సమూహేఽ
స్త్రీ పుష్పభేదే చ యోషితి.

యూథం—(న్న) ౧ తిర్యక్సమూహే = తిర్యగ్జంతుసమూహము, ౨ పుష్పభేదే=అడవిమొల్ల. (స్త్రీ).

రథః పుమానవయవే స్యందనే
వేతసేఽపి చ,

రథః—(పు) ౧ అవయవే = అంగము, ౨ స్యందనే=రథము, 3 వేతసే = ప్రబ్బచెట్టు.

వీథీ పంక్తౌ గృహాంగే చరూ
పకాంతరవర్త్మనోః. ౧౨

వీథీ—(స్త్రీ) ౧ పంక్తౌ=పంక్తి, ౨ గృహాంగే=గృహావయవము, 3 రూపకాన్తర = నాటకభేదము, ౪ వర్త్మనోః = మార్గము.

సంస్థశ్చరేఽవస్థితేఽస్త్రీ స్థితౌ
సాదృశ్యనాశయోః,

సంస్థః—(న్న) ౧ చరే=చారుఁడు, ౨ అవస్థితే=ఉన్నవాఁడు, 3 స్థితౌ=నిల్చుట, ౪ సాదృశ్య = ఆకారము, ౫ నాశయోః=మరణము.

సార్థో వణిక్సమూహే స్యా
దపి సంఘాతమాత్రకే. ౧౩

సార్థః—(పు) ౧ వణిక్సమూహే = వర్తకులసమూహము, ౨ సంఘాతమాత్రకే=సంఘసామాన్యము.

సాహశా=అజగరము, ౩ ఝషాన్తరే= మత్స్యవిశేషము.

శరస్తేజనకే బాణే దధ్యగ్రే నా శరం జలే. ౮౬

శరః—(పు) ౧ తేజనకే=కాకివెదురు, ౨ బాణే = బాణము, ౩ దధ్యగ్రే = తోడుబెట్టిన పెరుగుపై భాగము, (న) ౪ జలే=నీరు.

శస్త్రం లోహాస్త్రయోః క్లీబం ఛురికాయాం తు యోషితి,

శస్త్రం—(న) ౧ లోహ = లోహము, ౨ అస్త్రయోః = బాణము, (స్త్రీ) ౩ ఛురికాయాం = సూరకత్తి.

శక్రః పుమాన్ దేవరాజే కుటజార్జునభూరుహోః. ౮౭

శక్రః—(పు) ౧ దేవరాజే=ఇంద్రుఁడు, ౨ కుటజ=కొండమల్లెచెట్టు, ౩ అర్జున భూరుహోః = మద్దిచెట్టు.

శద్రిర్నాంభోధరే జిష్ణౌ

శద్రిః—(పు) ౧ అంభోధరే = మేఘము, ౨ జిష్ణౌ=ఇంద్రుఁడు.

శరుర్నా కోపవజ్రయోః,

శరుః—(పు) ౧ కోప = క్రోధము, ౨ వజ్రయోః=వజ్రము.

శారిర్నాక్షోపకరణే స్త్రియాం శకునికాంతరే. ౮౮. యుద్ధార్థగజపర్యాణే వ్యవహారాంతరేఽపి చ,

శారిః—(పు) ౧ అక్షోపకరణే = పాచికలు, (స్త్రీ) ౨ శకునికాన్తరే = గోరువంకపిట్ట, ౩ యుద్ధార్థగజపర్యాణే = యుద్ధముకొరకేనుఁగుమీఁదఁ బఱచిన గంత, ౪ వ్యవహారాన్తరే = వ్యవహారవిశేషము.

శారస్స్యాచ్ఛబలే వాచ్యలింగం పుంసి సమీరణే. ౮౯. అక్షోపకరణే

శారః—(త్రి) ౧ శబలే = చిత్రవర్ణము, (పు) ౨ సమీరణే = వాయువు, ౩ అక్షోపకరణే = జూదపుసారె.

శాస్త్రం న ద్వయోరాగమాజ్ఞయోః

శాస్త్రం—(న) ౧ ఆగమ=శాస్త్రము, ౨ ఆజ్ఞయోః = ఆజ్ఞ.

శిగ్రుర్నా శాకమాత్రే చ శోభాంజనమహీరుహే.

శిగ్రుః—(పు) ౧ శాకమాత్రే = కూర, ౨ శోభాంజనమహీరుహే = మునఁగచెట్టు.

| | |
|---|---|
| శిరో నా పిప్పలీమూలే స్యాద్ధమన్యాం చ యోషితి, | శిరః—(పు) ౧ పిప్పలీమూలే = పిప్పలిదుంప, (స్త్రీ) ౨ ధమన్యాం = నరము. |
| శీఘ్రం నలదే చక్రాంగే క్లీబం ద్రుతగతౌ త్రిషు. ౯౧ | శీఘ్రం—(న) ౧ నలదే=సీటివట్టివేరు, ౨ చక్రాంగే = బండికంటియాకు, (త్రి) 3 ద్రుతగతౌ = వేగముగలది. |
| శుభ్రం స్యాదభ్రకే క్లీబముద్దీప్తశుక్లయో స్త్రిషు, | శుభ్రం—(న) ౧ అభ్రకే = అభ్రకమను ధాతువిశేషము, (త్రి) ౨ ఉద్దీప్త = ప్రకాశించునది, 3 శుక్లయోః= తెల్లనిది. |
| శుక్రస్స్యాద్భార్గవే జ్యేష్ఠమాసే వైశ్వానరే పుమాన్ ౯౨. రేతోఽక్షిరుగ్భిదోః క్లీబం | శుక్రః—(పు) ౧ భార్గవే = శుక్రుఁడు, ౨ జ్యేష్ఠమాసే = జ్యేష్ఠమాసము, 3 వైశ్వానరే = అగ్ని, (న) ౪ రేతః = వీర్యము, ౫ అక్షిరుగ్భిదోః = కంటిపూవు. |
| శూర స్స్యాద్యాదవే భటే, | శూరః—(పు) ౧ యాదవే=శూరుఁడను యాదవుఁడు, ౨ భటే=వీరుఁడు. |
| స్వరుః పుమాన్యూపఖండే భిదురేఽప్యధ్వరే శరే. ౯3 | స్వరుః—(పు) ౧ యూపఖండే = యూపస్తంభభాగము, ౨ భిదురే=వజ్రాయుధము, 3 అధ్వరే = యజ్ఞము, ౪ శరే=బాణము. |
| సత్రం యజ్ఞే సదాదానాచ్ఛాదనారణ్యకైతవే, | సత్రం—(న) ౧ యజ్ఞే = యాగము, ౨ సదాదాన = ఎడతెగనిదానము, 3 ఆచ్ఛాదన = కప్పుట, ౪ అరణ్య = అడవి, ౫ కైతవే=కపటము. |
| సరో దధ్యగ్రగత్యోర్నా | సరః—(పు) ౧ దధ్యగ్ర = పైపెరుఁగు, ౨ గత్యోః=గమనము. |
| స్వరో నాసాసమీరణే ౯౪. ఉదాత్తాదావకారాదౌ షడ్జాదౌ చ ధ్వనౌ పుమాన్, | స్వరః—(పు) ౧ నాసాసమీరణే=ముక్కుగాలి, ౨ ఉదాత్తాదౌ = ఉదాత్తాదిస్వరము, 3 అకారాదౌ = అకారము |

మొదలుగాగలయచ్చులు, ౪ షడ్జాదౌ = షడ్జాదిసంగీతస్వరములు, ౫ ధ్వనౌ = కంఠధ్వని.

సారో బలే స్థిరాంశే చ మజ్జ్ఞి పుంసి జలే ధనే. ౯౫. న్యాయ్యే క్లీబం త్రిషు వరే

సారః—(పు) ౧ బలే=బలిమి, ౨ స్థిరాంశే =చేవ, ౩ మజ్జ్ఞి = ఎముకలలోని క్రొవ్వు, (న) ౪ జలే=నీరు, ౫ ధనే= ద్రవ్యము, ౬ న్యాయ్యే=న్యాయము, (త్రి) ౭ వరే = శ్రేష్ఠము.

సాంద్రం వనే ఘనే మృదౌ,

సాంద్రం—(న) ౧ వనే = వనము, ౨ ఘనే=మేఘము, ౩ మృదౌ = మెత్తనైనది.

స్ఫారస్స్యాత్పుంసి వికటే కనకాదేశ్చ బుద్బుదే. ౯౬

స్ఫారః—(పు) ౧ వికటే = వంకరైనది, ౨ కనకాదేఃబుద్బుదే = బంగారు మున్నగువాని ఘుటికలు.

సిప్రో నిదాఘసలిలే సిప్రా తు సరిదంతరే,

సిప్రః—(పు) ౧ నిదాఘసలిలే = చెమట, (స్త్రీ) ౨ సరిదంతరే=సిప్రానది.

స్థిరా భూశాలపర్ణ్యోర్నా శనౌ మోక్షేఽచలే త్రిషు.

స్థిరా—(స్త్రీ) ౧ భూ = భూమి, ౨ శాలపర్ణ్యోః=ముయ్యాకుపొన్న చెట్టు, (పు) ౩ శనౌ = శని, (పు) ౪ మోక్షే = మోక్షము, (త్రి) ౫ అచలే=నిలుకడ గ్గైనది

సీరోఽర్కహలయోః పుంసి

సీరః—(పు) ౧ అర్కే = సూర్యుడు, ౨ హలయోః = నాగలి.

సురా చషకమద్యయోః,పుంలింగస్త్రీదివేశే స్యా

సురా—(స్త్రీ) ౧ చషక=కల్లుత్రాగుగిన్నె, ౨ మద్యయోః = కల్లు, (పు) ౩ త్రిదివేశే = వేల్పు.

త్సూత్రం తంతువ్యవస్థయోః ౯౭. శాస్త్రాదిసూచనాగ్రంథే

సూత్రం—(న) ౧ తంతు = దారము, ౨ వ్యవస్థయోః=ఏర్పాటు, ౩ శాస్త్రాదిసూచనాగ్రంథే = శాస్త్రముమున్నగువానికి సూచకమయిన గ్రంథము.

| | |
|---|---|
| స్వైరః స్వచ్ఛందమందయోః, | స్వైరః—(పు) ౧ స్వచ్ఛంద=స్వతంత్రుఁడు, ౨ మందయోః=సోమరి. |
| హరిశ్చంద్రార్క-వాతాశ్వ శుకభేకయ మాహిషు. ౯౯. కపౌ సింహే హరే కేఽంశౌ శక్రే లోకాంతరే పుమాన్, వాచ్యవత్పింగ హరితో | హరిః—(పు) ౧ చంద్ర=చంద్రుఁడు, ౨ అర్క=సూర్యుఁడు, 3 వాత=వాయువు, ౪ అశ్వ=గుఱ్ఱము, ౫ శుక=చిలుక ౬ భేక=కప్ప, ౭ యమ=జముఁడు, ౮ అహిషు=పాము, ౯ కపౌ = కోఁతి, ౧౦ సింహే=సింగము, ౧౧ హరే = ఈశ్వరుఁడు, ౧౨ కే=నీరు, ౧౩ అంశౌ = కిరణము, ౧౪ శక్రే = ఇంద్రుఁడు, ౧౫ లోకాంతరే = లోకభేదము, (త్రి) ౧౬ పింగ=బంగారువర్ణము, ౧౭ హరితోః = పచ్చనిది, |
| హారో ముక్తావలౌ యుధి. | హారః—(పు) ౧ ముక్తావలౌ=ముత్యాలహారము, ౨ యుధి=యుద్ధము. |
| హారిః పథికసంతానద్యూతాదిభంగయోః స్త్రియాం, | హారిః—(స్త్రీ) ౧ పథికసంతాన = బాటసారులగుంపు, ౨ ద్యూతాదిభంగయోః = జూదముమున్నగు నాటలలో నోడుట. |
| హింస్రా త్వేలావలీమాంస్యోః స్త్రియాం స్యాద్ఘాతుకేఽన్యవత్. ౧౦౧ | హింస్రా—(స్త్రీ) ౧ ఏలావలీ = నల్లయుప్పచెట్టు, ౨ మాంస్యోః = జటామాంసి, (త్రి) 3 ఘాతుకే = చంపునది. |
| హీరా తైలాంబుకాలక్ష్మ్యోః పుంసి శంకరవజ్రయోః, | హీరా—(స్త్రీ) ౧ తైలాంబుకా = గబ్బిలము, ౨ లక్ష్మ్యోః = లక్ష్మి, (పు) 3 శంకర=ఈశ్వరుఁడు, ౪ వజ్రయోః = వజ్రమణి. |
| హోరా లగ్నేఽపి రాశ్యర్ధే రేఖాశాస్త్రభిదోరపి. ౧౦౨ | హోరా—(స్త్రీ) ౧ లగ్నే = లగ్నభేదము, ౨ రాశ్యర్ధే = రాశిలోసగము, 3 |

రేఖా= రేఖాభేదము, ౪ శాస్త్రభిదోః= శాస్త్రభేదము.

---

## ర త్రికం.

మూఁడక్షరములుగల రకారాంత శబ్దములు.

అమరస్త్రిదశేఽప్యస్థి సంహారే కుశద్రుమే, స్త్రీగుడూచ్యమరావత్యోః స్థూణాదూర్వా జరాయుషు. ౧౦౩

అమరః—(పు) ౧ త్రిదశే = వేలుపు, ౨ అస్థిసంహారే=నల్లేరుతీఁగ, ౩ కులిశద్రుమే=జెముడుచెట్టు, (స్త్రీ) ౪ గుడూచీ= తిప్పతీఁగె, ౫ అమరావత్యోః=ఇంద్రునిపట్టణము, ౬ స్థూణా=కంబము, ౭ దూర్వా = గఱిక. ౮ జరాయుషు = మావి.

అపరం గజపశ్చార్ధే స్యాజ్జరాయౌ తు యోషితి, ఇతరస్మిన్నపి తథాఽర్వాచీనేఽప్యన్యలింగకం. ౧౦౪

అపరం—(న) ౧ గజపశ్చార్ధే = ఏనుఁగు వెనుకభాగము, (స్త్రీ) ౨ జరాయౌ = మావి, (త్రి) ౩ ఇతరస్మిన్=ఇతరము, ౪ అర్వాచీనే=క్రిందిది.

అధరస్తు పుమానోష్ఠే హీనేఽనూర్ధ్వే చ వాచ్యవత్,

అధరః—(పు) ౧ ఓష్ఠే = క్రిందిపెదవి, (త్రి) ౨ హీనే=తక్కువది, ౩ అనూర్ధ్వే=క్రిందిది.

అధ్వరస్సావధానే స్యాద్వసుభేదే క్రతౌ పుమాన్.

అధ్వరః—(పు) ౧ సావధానే = నిశ్చలచిత్తముగలవాఁడు, ౨ వసుభేదే = అష్టవసువులలోనొకఁడు, ౩ క్రతౌ= యజ్ఞము.

అంతరమవకాశావధిపరిధానాంతర్ధిభేదతాదర్థ్యే, ఛిద్రాత్మీయ వినాబహిరవసరమధ్యాత్మసదృశేషు. ౧౦౫

అంతరం—(న) ౧ అవకాశ=ఎడము, ౨ అవధి=హద్దు, ౩ పరిధాన=కట్టుబట్ట, ౪ అంతర్ధి=మఱుఁగు, ౫ భేద=భేదము, ౬ తాదర్థ్యే = దానికొఱకు, ౭ ఛిద్ర= రంధ్రము ౮ ఆత్మీయ=తనది, ౯ వినా= విడచుట, ౧౦ బహిః=వెలుపల, ౧౧ అవసర=సమయము, ౧౨ మధ్య=నడిమి

చోటు, ౧౩ ఆత్మ = అంతరాత్మ, ౧౪ సదృశేషు=సమానము.

అపరం గజాంత్యజంఘాది దేశే చరమే త్రిషు,

అపరం—(న) ౧ గజాంత్యజంఘాది దేశే= ఏనుఁగు వెనుకటిమోఁకాలు లోనగునది, ౨ చరమే=వెనుకటిది.

అంబరం న ద్వయో ర్వ్యోమ్ని సుగంధ్యంతరవస్త్రయోః.

అంబరం—(న) ౧ వ్యోమ్ని=ఆకాశము, ౨ సుగంధ్యంతరే = సుగంధద్రవ్యము, ౩ వస్త్రయోః=బట్ట.

అంగారముల్ముకే న స్త్రీ పుంలింగస్తు మహీసుతే,

అంగారం—(న) ౧ ఉల్ముకే=కొఱవి,(పు) ౨ మహీసుతే=అంగారకుఁడు.

అంకురో రుధిరే లోమ్ని పానీయేఽభినవోద్భిది.

అంకురః—౧ (పు) రుధిరే = నెత్తురు, ౨ లోమ్ని=వెండ్రుక, ౩ పానీయే=ఉదకము, ౪ అభినవోద్భిది=మొలక.

అజిరం ప్రాంగణే వాతే విషయే దర్దురే తనౌ, స్త్రీ చండ్యాం

అజిరం—(న) ౧ ప్రాంగణే=ముంగిలి, ౨ వాతే=వాయువు, ౩ విషయే=శబ్దాది విషయము,౪ దర్దురే=కప్ప, ౫ తనౌ= శరీరము, (స్త్రీ) ౬ చండ్యాం=చండిక.

మక్షరం బ్రహ్మవర్ణయోః పుంసి శంకరే. ౧౦౯

అక్షరం—(న) ౧ బ్రహ్మ = పరబ్రహ్మ, ౨ వర్ణయోః = అక్షరములు, (పు) ౩ శంకరే=శంకరుఁడు.

అశిరో వీతిహోత్రే స్యాద్రాక్షసే భాస్కరే పుమాన్,

అశిరః—(పు) ౧ వీతిహోత్రే = అగ్ని, ౨ రాక్షసే=రాక్షసుఁడు, ౩ భాస్కరే = సూర్యుఁడు.

అండీరః పురుషే శక్తే

అండీరః—(పు) ౧ పురుషే=పురుషుఁడు, ౨ శక్తే=సమర్థుఁడు.

అరరం ఛదకపాటయోః.

అరరం—(న) ౧ ఛద=ఆకు, ౨ కపాటయోః=తలుపు.

అవీరాపతిపుత్రాయాం స్త్రీ సత్వరహితే త్రిషు,

అవీరా—(స్త్రీ) ౧ అపతిపుత్రాయాం = బిడ్డలు మగఁడును లేనిది, (త్రి) ౨ సత్వరహితే=బలము లేనిది.

| | |
|---|---|
| అగురు క్లీబం జోంగకశింశపయోర్వాచ్యవల్లఘుని. | అగురు—(న) ౧ జోంగక = అగురు వృక్షము, ౨ శింశపయోః = ఇరుగుడు చెట్టు, (త్రి) 3 లఘుని=చిన్నది. |
| అసురా రజనీరాశ్యోరసురో దేవారిభాస్కరయోః, | అసురా—(స్త్రీ) ౧ రజనీ=రేయి, ౨ రాశ్యోః = మేషాదిరాసులు, (పు) 3 దేవారి=రక్కసుఁడు, రభాస్కరయోః =సూర్యుఁడు. |
| ఆకరో నివహోత్పత్తిస్థాన శ్రేష్ఠేషు కథ్యతే. ౧౧౨ | ఆకరః—(పు) ౧ నివహ=సమూహము, ౨ ఉత్పత్తిస్థాన=గని, 3 శ్రేష్ఠేషు=గొప్పవాఁడు. |
| ఆధారశ్చాధికరణే ఽప్యాలవాలేఽంబుధారణే, | ఆధారః—(పు) ౧ అధికరణే = ఆశ్రయము, ౨ ఆలవాలే = పాదు, 3 అంబుధారణే= చెఱువు. |
| ఆసారస్స్యాత్ప్రసరణే వేగవృష్టౌ సుహృద్బలే. ౧౧3 | ఆసారః—(పు) ౧ ప్రసరణే=దండువిడుచుట, ౨ వేగవృష్టౌ = జడివాన, 3 సుహృద్బలే=మిత్రబలము. |
| ఆహారస్స్యాదాహరణే భోజనే చ పుమానయం, | ఆహారః—(పు) ౧ ఆహరణే = హరించుట, ౨ భోజనే=తినుట, లేక వంటకము. |
| ఆశరస్తు పుమాన్వైశ్వానరే చ రజనీచరే. ౧౧౪ | ఆశరః—(పు) ౧ వైశ్వానరే=అగ్ని, ౨ రజనీచరే=రాక్షసుఁడు. |
| ఆకార ఇంగితాకృత్యోః | ఆకారః—(పు) ౧ ఇంగిత = అభిప్రాయమును దెలిపెడిచేష్ట, ౨ ఆకృత్యోః = రూపము. |
| ఇతరోఽన్యత్ర పామరే, | ఇతరః—(పు) ౧ అన్యత్ర=మఱియొకఁడు ౨ పామరే=అధముఁడు. |
| ఇత్వర్యసత్యాం పథికే క్రూరకర్మణి చ త్రిషు. ౧౧౫ | ఇత్వరీ—(స్త్రీ) ౧ అసత్యాం = ఱంకుటాలు, (త్రి) ౨ పథికే = బాటసారి, 3 క్రూరకర్మణి=క్రూరమైనపనిచేయువాఁడు. |

| | |
|---|---|
| ఈశ్వరో మన్మథే శంభౌ నాఢ్యేస్వామిని చాన్యవత్, ఈశ్వరీ చేశ్వరోమాయాం | ఈశ్వరః—(పు) ౧ మన్మథే=మన్మథుఁడు, ౨ శంభౌ = ఈశ్వరుఁడు, (త్రి) 3 ఆఢ్యే = ధనికుఁడు, ౪ స్వామిని = ప్రభువు, ఈశ్వరీ (స్త్రీ) (ఆ. స్త్రీ.) ౫ ఉమాయాం=పార్వతి. |
| ముదరం జఠరే యుధి.౧౧౬ | ఉదరం—(న) ౧ జఠరే = కడుపు, ౨ యుధి=యుద్ధము. |
| ఉదారో దాతృమహతోర్దక్షిణేఽప్యభిధేయవత్, | ఉదారః—(త్రి) ౧ దాతృ = దాత, ౨ మహతోః=గొప్పవాఁడు, 3 దక్షిణే=నేర్పరి. |
| ఉర్వరాసర్వసస్యాఢ్యభూమౌ స్యాద్భూమిమాత్రకే. | ఉర్వరా—(స్త్రీ)౧ సర్వసస్యాఢ్యభూమౌ= అన్నిపైరులచే నిండిననేల, ౨ భూమిమాత్రకే=భూమి. |
| ఉత్తరాదిగ్విశేషే చ స్నుషాయామర్జునస్య చ, విరాటస్య సుతే నా స్యాదూర్ధ్వోదీచ్యోత్తమే త్రిషు. ౧౧౭. నపుంసకం ప్రతివాక్యే | ఉత్తరా—(స్త్రీ) ౧ దిగ్విశేషే = ఉత్తర దిక్కు, ౨ అర్జునస్యస్నుషాయాం = అర్జుననికోడలు, (పు) 3 విరాటస్య సుతే=ఉత్తరుఁడు, (త్రి) ౪ ఊర్ధ్వ = మీఁదిది, ౫ ఉదీచ్య = ఉత్తరపు దిక్కుది, ౬ ఉత్తమే=ఘనుఁడు, (న) ౭ ప్రతివాక్యే=జవాబు. |
| థోద్ధారశ్చోద్ధృతావృణే, | ఉద్ధారః—(పు) ౧ ఉద్ధృతౌ = పైకెత్తఁబడినది, ౨ ఋణే=అప్పు. |
| ఋక్షరం వారిధారాయామృక్షరశ్చర్త్విజి స్మృతః. | ఋక్షరం— (న) ౧ వారిధారాయాం = ఉదకధార, (పు) ౨ ఋత్విజి = ఋత్విక్కు. |
| ఏకాగ్రమన్యలింగం స్యాదేకతానేఽప్యనాకులే, | ఏకాగ్రం—(త్రి) ౧ ఏకతానే = నిశ్చలచిత్తుఁడు, ౨ అనాకులే=కలఁకఁజెందనివాఁడు. |
| ఔశీరం శయనాసనచామరదండేఽప్యుశీరజే ప్రోక్తం. | ఔశీరం—(న) ౧ శయన = పానుపు, ౨ ఆసన=పీట, 3 చామరదండే = వింజా |

మరయొక్క-కట్టె, ౪ ఉశీరజే=వట్టివేళ్ల వలనఁబుట్టినది.

క్రకరః కరీరవృక్షే దీనే క్రకచే చ పక్షిభేదే చ,

క్రకరః—(పు) ౧ కరీరవృక్షే=వెణుతురుచెట్టు, ౨ దీనే = దీనుఁడు, 3 క్రకచే = అంపము, ౪ పక్షిభేదే = కక్కెరపిట్ట.

కదరః శ్వేతఖదిరే క్రకచవ్యాధిభేదయోః. ౧౨౧

కదరః—(పు) ౧ శ్వేతఖదిరే=వెలిచండ్రచెట్టు, ౨ క్రకచ=అంపము, 3 వ్యాధిభేదయోః=రోగవిశేషము.

కర్బురం సలిలే హేమ్ని కర్బురః పాపరక్షసోః, కర్బురా కృష్ణవృంతాయాం శబలే పునరన్యవత్. ౧౨౨

కర్బురం—(న) ౧ సలిలే = ఉదకము, ౨ హేమ్ని=బంగారము, (పు) 3 పాపః పాపము, ౪ రక్షసోః = రాక్షసుఁడు, (స్త్రీ) ౫ కృష్ణవృంతా = కలిగొట్టుచెట్టు, (త్రి) ౬ శబలే=చిత్రవర్ణముగలది.

కర్పరస్స్యాత్కపాలే చ శస్త్రభేదకటాహయోః,

కర్పరః—(పు) ౧ కపాలే = తలపుఱ్ఱె, ౨ శస్త్రభేద = శస్త్రవిశేషము; 3 కటాహయోః=కాఁగు.

కంధరో వారివాహే స్యాద్గ్రీవాయాం కంధరా మతా.

కంధరః—(పు)౧ వారివాహే=మేఘము, (స్త్రీ) ౨ గ్రీవాయాం = కంఠము.

కర్బరః కథితో వ్యాఘ్రే శివాయామపి కర్బరీ,

కర్బరః—(పు) ౧ వ్యాఘ్రే = పులి, కర్బరీ (స్త్రీ) ౨ శివాయాం=నక్క.

కంజారో జఠరే సూర్యే విరించౌ వారణే మునౌ.

కంజారః—(పు) ౧ జఠరే = పొట్ట, ౨ సూర్యే = సూర్యుఁడు, 3 విరించౌ = బ్రహ్మ, ౪ వారణే = ఏనుఁగు, ౫ మునౌ=ముని.

కరీరో వంశాంకురే౽స్త్రీ వృక్షభిద్ఘటయోః పుమాన్, కరీరీ చీరికాయాం చ దంతమూలే చ దంతినాం. ౧౨౪

కరీరః—(ప్న) ౧ వంశాంకురే = వెదురుమొలక, (పు) ౨ వృక్షభిత్ = వెణుతురుచెట్టు, 3 ఘటయోః = కుండ, కరీరీ (స్త్రీ) ౪ చీరికాయాం = చిమ్మట,

౫ దన్తిదాంచన్తమూలే = గజదన్త మూలము.

కటిత్రం రశనాయాం చ చర్మాంగే కటివాససి,

కటిత్రం—(న) ౧ రశనాయాం = మొలనూలు, ౨ చర్మాంగే = నడుమునకుఁ గట్టుకొనుపట్కా, ౩ కటివాససి = కట్టువస్త్రము.

కచ్ఛురా శూకశింబ్యాం చ శటీదుస్స్పర్శయోరపి. ౧౨౬.
కచ్ఛురః పుంశ్చలే వాచ్యలింగస్స్యాత్పామనేఽపి చ,

కచ్ఛురా—(స్త్రీ) ౧ శూకశింబ్యాం=దూలగొండి చెట్టు, ౨ శటీ=గంట్లకచోరము, ౩ దుస్స్పర్శయోః=వాసుడు చెట్టు, (త్రి) ౪ పుంశ్చలే=జారుఁడు, ౫ పామనే= గజ్జిగలవాఁడు.

కవరో లవణేఽమ్లేఽస్త్రీ పృథ్వీతుంగీకచాంతరే. ౧౨౭.
కవర్యుమాయాం నా రక్షః పాపయోర్భేషజాంతరే,

కవరః—(పు) ౧ లవణే=ఉప్పు, ౨ అమ్లే= పులుపు, కవరీ, (స్త్రీ) ౩ పృథ్వ్యాం=ఇంగువ చెట్టు, ౪ తుంగీ = వాయింటచెట్టు, ౫ కచాంతరే = కేశపాశము, ౬ ఉమాయాం=పార్వతి, (పు) ౭ రక్షః=రాక్షసుఁడు, ౮ పాపయోః = పాపము, ౯ భేషజాన్తరే=ఔషధభేదము.

కర్మారో జాతిభేదే చ త్వచిసారే చ పుంస్యయమ్.

కర్మారః—(పు) ౧ జాతిభేదే = కమ్మరవాఁడు, ౨ త్వచిసారే=వెదురు.

కణేరుః కర్ణికారే చ కరిణీవేశ్యయోః స్త్రియాం,

కణేరుః—(పు) ౧ కర్ణికారే = కొండగోఁగు చెట్టు,(స్త్రీ) ౨ కరిణీ=ఆఁడేనుఁగు, ౩ వేశ్యయోః=బోగముది.

కచ్చురం కుత్సితే వాచ్యలింగం తక్రే నపుంసకమ్.

కచ్చురం—(త్రి) ౧ కుత్సితే = కుత్సితమైనది, (న) తక్రే=చల్ల.

కర్కరీ భాండభేదే నా దర్పణే కఠినే త్రిషు,

కర్కరీ—(స్త్రీ) ౧ భాండభేదే = గరికెపిడత, (పు) ౨ దర్పణే=అద్దము (త్రి) ౩ కఠినే=కఠినమైనది.

కడారః పింగలే దాసే

కడారః—(పు) ౧ పింగలే=పచ్చనివర్ణము, ౨ దాసే=దాసుఁడు.

కలత్రం శ్రోణిభార్యయోః। ౧౩౦. దుర్గస్థానే నృపాదీనాం

కళత్రం—(న) ౧ శ్రోణి = పిఱుఁదు, ౨ భార్యయోః=భార్య, 3 నృపాదీనాం దుర్గస్థానే=కోట.

కటప్రూః పుంసిరాక్షసే,విద్యాధరే మహాదేవే తథాస్యాదక్షదేవనే. ౧౩౧

కటప్రూః—(పు) ౧ రాక్షసే = రాక్షసుఁడు, ౨ విద్యాధరే=విద్యాధరుఁడు, 3 మహాదేవే = ఈశ్వరుఁడు, ౪ అక్షదేవనే = పాచికలాడుట.

కందరస్త్వంకుశే పుంసిగుహాయాం చ నపుంసకమ్,

కందరః—(పు) ౧ అంకుశే = అంకుశము, (న) ౨ గుహాయాం=గుహ

కర్బూరస్స్యాత్పుమాన్ శట్యాం సువర్ణే తు నపుంసకమ్. ౧౩౨

కర్బూరః—(పు) ౧ శట్యాం=గంట్లకచోరము (న) ౨ సువర్ణే=బంగారము.

కాశ్మీరం కుంకుమేఽపి స్యాట్టంకపుష్కరమూలయోః,

కాశ్మీరం—(న) ౧ కుంకుమే = కుంకుమపూవు, ౨ టంక = ఉలి, 3 పుష్కరమూలయోః=తామరదుంప.

కావేరీ స్యాత్సరిద్భేదే పణ్యానారీహారిద్రయోః. ౧౩౩

కావేరీ—(స్త్రీ) ౧ సరిద్భేదే = కావేరీనది, ౨ పణ్యనారీ= వేశ్య, 3 హారిద్రయోః =పసుపు.

కాంతారోఽస్త్రీ మహారణ్యే బిలే దుర్గమవర్త్మని, పుంసి స్యాదిక్షుభేదేఽ

కాంతారః—(పు) ౧ మహారణ్యే=గొప్పయడవి, ౨ బిలే = రంధ్రము, 3 దుర్గమవర్త్మని = పోరానిమార్గము, (పు) ౪ ఇక్షుభేదే = తెలుపుకలసిన చెఱకు.

థ కిశోరోఽశ్వస్య శాబకే. ౧౩౪. తైలపర్ణ్యాషధౌ చ స్యాత్తరుణావస్థసూర్యయోః,

కిశోరః—(పు) ౧ అశ్వస్య శాబకే=గుఱ్ఱపుఁబిల్ల, ౨ తైలపర్ణ్యాషధౌ=వృక్షవిశేషము, 3 తరుణావస్థ = వయస్సుకలవాఁడు, ౪ సూర్యయోః=సూర్యుఁడు.

కిర్మీరో నాగరంగే చ కర్బురే రాక్షసాంతరే. ౧౩౫

కిర్మీరః—(పు) ౧ నాగరంగే = నారంజిచెట్టు, ౨ కర్బురే = చిత్రవర్ణము, 3 రాక్షసాంతరే = కిర్మీరాసురుఁడు.

| | |
|---|---|
| కింశారుర్నా సస్యశూకే విశిఖే కంకపక్షిణి, | కింశారుః—(పు) ౧ సస్యశూకే=వరిముల్లు ౨ విశిఖే=బాణము, 3 కంకపక్షిణి = రాపులుఁగు. |
| కుహారం గహ్వరే ఛిద్రేక్లీబం నాగాంతరే పుమాన్. | కుహారం—(న) ౧ గహ్వరే = గుహ, ౨ ఛిద్రే=బెజ్జము, (పు) 3 నాగాంతరే= సర్పభేదము. |
| కుక్కురస్సారమేయేనా గ్రంథిపర్ణే నపుంసకం, | కుక్కురః—(పు) ౧ సారమేయే=కుక్క, ౨ గ్రంథిపర్ణే=మాచిపత్రి. |
| కూర్పరస్స్యాత్కఫోణౌ చ జానుదేశే చ పుంస్యయమ్. | కూర్పరః—(పు) ౧ కఫోణౌ = మోఁచేయి. ౨ జానుదేశే=మోఁకాలు. |
| కుంజరోఽనేకపే కేశే స్త్రీ ధాతక్యాం చ పాటలౌ, | కుంజరః—(పు) ౧ అనేకపే=ఏనుఁగు, ౨ కేశే=వెంట్రుక, (స్త్రీ) 3 ధాతక్యాం = ఆరెచెట్టు,౪ పాటలౌ=కలిగొట్టుచెట్టు. |
| కుమారస్స్యాచ్ఛుకే స్కందే యువరాజే ఽశ్వవారకే. బాలకే వరుణద్రౌ నా నద్వయోర్జాత్యకాంచనే, కుమారీ శైలతనయానవమాల్యోర్నదీభిది. ౧3౯. సహాపరాజితాకన్యా జంబూద్వీపేషు చ స్త్రియాం, | కుమారః—(పు) ౧ శుకే = చిలుక, ౨ స్కందే = కుమారస్వామి, 3 యువరాజే=యువరాజు, ౪ అశ్వవారకే = రెల్లుగడ్డి, ౫ బాలకే = పిల్లవాఁడు, ౬ వరుణద్రౌ = ఉలిమిరిచెట్టు, (న) ౭ జాత్యకాంచనే = మంచిబంగారు, ౮ కుమారీ (స్త్రీ) ౯ శైలతనయా = పార్వతి, ౧౦ నవమాల్యోః విరజాజితీఁగ, ౧౧ నదీభిది=నదీవిశేషము ౧౨ సహా= పిన్నగోరంటచెట్టు, ౧3 అపరాజితా= విష్ణుక్రాంతచెట్టు, ౧౪ కన్యా=పెండ్లికానిపిల్ల,౧౫ జంబూద్వీపేషు=జంబూద్వీపము. |
| కుతారుర్నా ద్రుమే కీశే | కుతారుః—(పు) ౧ ద్రుమే=వృక్షము, ౨ కీశే=కోఁతి. |
| కుట్టారం కేవలే రతే. ౧౪౦ | కుట్టారం—(న) ౧ కేవలే=ఒకటి, ౨ రతే =సురతము. |

| | |
|---|---|
| కుబేరస్స్యాత్పుంసి నందివృక్షే పుణ్యజనేశ్వరే, | కుబేరః—(పు) ౧ నందివృక్షే=నంది చెట్టు, ౨ పుణ్యజనేశ్వరే=కుబేరుఁడు. |
| కూవరస్త్రిషు చారౌ నా కుబ్జకేఽస్త్రీ యుగంధరే. | కూవరః—(త్రి)౧ చారౌ=మనోహరము, (పు) ౨ కుబ్జకే = నెమ్మిచెట్టు, (పున) 3 యుగంధరే=బండినొగ. |
| కేసరం హింగుని క్లీబం కింజల్కేన స్త్రియాం పుమాన్, సింహచ్ఛటాయాం పున్నాగే వకులే నాగకేసరే. ౧౪౨ | కేసరం—(న) ౧ హింగుని=ఇంగువ, (పున) ౨ కింజల్కే = అకరువు, (పు) 3 సింహచ్ఛటాయాం = సింగపుజూలు, ౪ పున్నాగే = సురపొన్న చెట్టు, ౫ వకులే=పొగడచెట్టు, ౬ నాగకేసరే = నాగకేసరపుఁజెట్టు. |
| కేదారోఽద్రౌ శివే క్షేత్రే భూమిభేదాలవాలయోః, | కేదారః—(పు) ౧ అద్రౌ=పర్వతము, ౨ శివే=శంకరుఁడు, 3 క్షేత్రే=వరిమడి, ౪ భూమిభేదే=పుణ్యక్షేత్రవిశేషము, ౫ ఆలవాలయోః=పాదు. |
| కేనారః కుంభినరకే శిరః కపోలసంధిషు. ౧౪3 | కేనారః—(పు) ౧ కుంభినరకే = కుంభియనునరకము, ౨ శిరః = శిరస్సు, 3 కపోల = చెక్కిలి, ౪ సంధిషు = కూడిక. |
| కోటిరః పుంసి నకులే శక్రగోపకశక్రయోః, | కోటిరః—(పు) ౧ నకులే = ముంగిస, ౨ శక్రగోపక = ఆర్ద్రపురుగు, 3 శక్రయోః=ఇంద్రుఁడు. |
| కోట్టారో నాగరే కూపే పుష్కరిణ్యాశ్చ పాటకే. | కోట్టారః—(పు) ౧ నాగరే=నగరసంబంధమయినది, ౨ కూపే=బావి, 3 పుష్కరిణ్యాఃపాటకే=కొలనిపడిగట్లు. |
| ఖపురః క్రముకే భద్రముస్తకేఽలసకేఽపి చ | ఖపురః—(పు) ౧ క్రముకే=పోఁకచెట్టు, ౨ భద్రముస్తకే=నాగముస్తెచెట్టు, 3 అలసకే=మందుఁడు. |
| ఖర్పరస్తస్కరే ధూర్తే భిక్షాభాండకపాలయోః | ఖర్పరః—(పు) ౧ తస్కరే = దొంగ, ౨ ధూర్తే=కపటుఁడు, 3 భిక్షాభాండ = |

భిక్షాపాత్రము, ౪ కపాలయోః=తల పుఱ్ఱె.

ఖర్జూరం రూప్యఖలయోర్వృశ్చికే నా ద్రుమే ద్వయోః,

ఖర్జూరం—(న) ౧ రూప్య = వెండి, ౨ ఖలయోః = దుష్టుఁడు, 3 వృశ్చికే = తేలు (పు) ౪ ద్రుమే = ఖర్జూరపుఁజెట్టు.

ఖదిరీ శాకభేదే స్త్రీ నా చంద్రే దంతధావనే. ౧౪౬

ఖదిరీ—(స్త్రీ) ౧ శాకభేదే=శాకవిశేషము, (పు) ౨ చంద్రే=చంద్రుఁడు, 3 దంతధావనే=చండ్రచెట్టు.

ఖండాభ్రమభ్రలేశే స్యాత్తథా దంతక్షతాంతరే,

ఖండాభ్రం—(న) ౧ అభ్రలేశే=మేఘపు దునుక, ౨ దన్తక్షతాన్తరే=దంతక్షత భేదము.

ఖంఖరస్తు శివాభేదే ఖట్వాంగే వారివాలకే. ౧౪౭

ఖంఖరః—(పు) ౧ శివాభేదే = ఒకానొకనక్క, ౨ ఖట్వాంగే = శివుని యాయుధము, 3 వారివాలకే=గంధద్రవ్యము.

గణేరుః కర్ణికారద్రౌ కరిణీ వేశ్యయోః స్త్రియాం,

గణేరుః—(పు) ౧ కర్ణికారద్రౌ = కొండగోఁగుచెట్టు, (స్త్రీ) ౨ కరిణీ = ఆఁడేనుఁగు, 3 వేశ్యయోః=భోగముది.

గర్గరో మీనభేదే స్త్రీ మంథన్యా

గర్గరః—(పు) ౧ మీనభేదే = మత్స్యవిశేషము, (స్త్రీ) ౨ మంథన్యాం = తరికుండ.

మథ గహ్వరం.౧౪౮. గుహా గహనదంభేషు నికుంజే తు పుమానయం,

గహ్వరం—(న) ౧ గుహా=కొండబిలము, ౨ గహన=అరణ్యము, 3 దంభేషు = కపటము, (పు) ౪ నికుంజే = పొదరిల్లు.

గాంధారః పుంసి సిందూరే రాగదేశప్రభేదయోః.

గాంధారః—(పు) ౧ సిందూరే = కుంకుమము, ౨ రాగ = గాంధారరాగము, 3 దేశప్రభేదయోః = దేశవిశేషము.

| | |
|---|---|
| గాయత్రీ త్రిపదా దేవీఛందోభిత్ఖదిరేషు చ, | గాయత్రీ—(స్త్రీ) ౧ త్రిపదా దేవీ=గాయత్రి, ౨ ఛందోభిద్ = గాయత్రీఛందము, 3 ఖదిరేషు=చండ్రచెట్టు. |
| గోపురం ద్వారి పూర్ద్వారి కైవర్తీముస్తకేఽపి చ. | గోపురం—(న) ౧ ద్వారి=ద్వారము, ౨ పూర్ద్వారి=పట్టణద్వారము, 3 కైవర్తీముస్తకే=కైవడిముస్తెచెట్టు. |
| ఘర్ఘరో నాచలద్వారిద్వారోలూకనదాంతరే, స్త్రీ తు క్షుద్రఘంట్యాం వీణాయాంభేదే స్వరాంతరే త్రిషు. | ఘర్ఘరః—(పు) ౧ అచలద్వారి = పర్వతద్వారము, ౨ ద్వార = వాకిలి, 3 ఉలూక=గుడ్లగూబ, ౪ నదాన్తరే=ఘర్ఘరమనునదము, (స్త్రీ) ౫ క్షుద్రఘంట్యాం=చిఱుఘంట, ౬ వీణాయాభేదే=వీణావిశేషము, త్రి ౭ స్వరాంతరే=స్వరవిశేషము. |
| చమరం చామరే స్త్రీ తు మంజరీమృగభేదయోః, | చమరం—(పు) ౧ చామరే=వింజామరము, (స్త్రీ) ౨ మంజరీ=పూలగుత్తి, 3 మృగభేదయోః=చమరీమృగము. |
| చందిరోఽనేకపే చంద్రే | చందిరః—(పు) ౧ అనేకపే=ఏనుఁగు, ౨ చంద్రే=చంద్రుడు. |
| చత్వరం స్థండిలేఽంగణే. | చత్వరం—(న) ౧ స్థండిలే = చోటు, ౨ అంగణే=ముంగిలి. |
| చంకురః స్యందనే వృక్షే | చంకురః—(పు) ౧ స్యందనే = తేరు, ౨ వృక్షే=చెట్టు. |
| చాతురో నేత్రగోచరే, చాటుకారినియంత్రోశ్చ త్రిషు దాక్ష్యే తు చాతురీ.౧౫౩ చక్రగండౌ చ పుంసి స్యా | చాతురః—(త్రి) ౧ నేత్రగోచరే=కండ్లకగుపడునది, ౨ చాటుకారి=నేర్పరి, 3 నియన్త్రోః = నియమించువాఁడు, చాతురీ (స్త్రీ) ౪ దాక్ష్యే=నేర్పు, (పు) ౫ చక్రగండౌ=గుండ్రనిదిండు. |
| చ్చామరం చామరాపి చ దండే చ వాలవ్యజనే, | చామరం / చామరా }—(స్త్రీ) ౧ దండే = కఱ్ఱ, ౨ వాలవ్యజనే=వింజామరము. |

| | |
|---|---|
| చికుర స్తరలాగయోః. ౧౪౮. పక్షివృక్షభిదోః కేశే గృహబభ్రౌ సరీసృపే, | చికురః—(పు) ౧ తరల = చంచలమైనది, ౨ అగయోః = కొండ, ౩ పక్షి=పక్షిభేదము, ౪ వృక్షభిదోః=వృక్షభేదము, ౫ కేశే=వెండ్రుక, ౬ గృహబభ్రౌ = ముంగిస, ౭ సరీసృపే = సర్పము. |
| ఛిదిరః పావకే రజ్జౌ కరవాలే పరశ్వధే. ౧౪౯ | ఛిదిరః—(పు) ౧ పావకే=నిప్పు, ౨ రజ్జౌ= త్రాడు, ౩ కరవాలే = కత్తి, ౪ పరశ్వధే=గండ్రగొడ్డలి. |
| ఛిదురశ్ఛేదనద్రవ్యే ధూర్తే వైరిణి చ త్రిషు, | ఛిదురః—(త్రి) ౧ ఛేదనద్రవ్యే=ఛేదించు వస్తువు, ౨ ధూర్తే = ధూర్తుఁడు, ౩ వైరిణి=శత్రువు. |
| జఠరో న స్త్రియాం కుక్షౌ వృద్ధకర్కశయోః త్రిషు. | జఠరః—(పు) ౧ కుక్షౌ=పొట్ట, ౨ వృద్ధ= ముదిసినది, ౩ కర్కశయోః = కఠినమైనది. |
| జర్జరః శైవలే శక్రధ్వజే త్రిషు జరాతురే, | జర్జరః—(పు) ౧ శైవలే = నాఁచు, ౨ శక్రధ్వజే=ఇంద్రుని టెక్కెము, (త్రి) ౩ జరాతురే = ముసలివాఁడు. |
| జంబీరః ప్రస్థపుష్పే స్యాత్పుంసి దంతశఠద్రుమే. ౧౫౦ | జంబీరః—(పు) ౧ ప్రస్థపుష్పే=మరువము, ౨ దంతశఠద్రుమే=నిమ్మచెట్టు. |
| జలేంద్రః పుంసి వరుణే జంభలే చ మహోదధౌ, | జలేంద్రః—(పు) ౧ వరుణే=వరుణుఁడు, ౨ జంభలే = నిమ్మచెట్టు, ౩ మహోదధౌ=సంద్రము. |
| ఝర్ఝరస్స్యాత్కలియుగే వాద్యభాండే నదాంతరే. | ఝర్ఝరః—(పు) ౧ కలియుగే = కలియుగము, ౨ వాద్యభాండే = వాద్యఘటము, ౩ నదాంతరే = ఒకానొక నదము. |
| ఝల్లరీ ఝలరీ చ ద్వే హుడుక్కే బాలచక్రకే, | ఝల్లరీ, ఝలరీ —(స్త్రీ) ౧ హుడుక్కే=ఢక్క, ౨ బాలచక్రకే = జడచుట్టు. |
| టట్టరీ స్యాన్మృషావాదే లంపాపటహవాద్యయోః. | టట్టరీ—(స్త్రీ) ౧ మృషావాదే = అసత్యవాదము, ౨ లంపా = లంపయను |

వాద్యము, 3 పటహావాద్యయోః = తప్పెటవాయించుట.

టంకారో విస్మయే పుంసి ప్రసిద్ధౌ శింజినీధ్వనౌ,

టంకారః—(పు) ౧ విస్మయే=ఆశ్చర్యము, ౨ ప్రసిద్ధౌ=ప్రసిద్ధి, 3 శింజినీధ్వనౌ= వింటినారియొక్క ధ్వని.

టగరష్టంకణక్షారే హేలావిభ్రమగోచరే. ౧౬౦. నాన్యవత్కేకరాక్షే స్యాత్

టగరః— (పు) ౧ టంకణక్షారే = వెలిగారము, ౨ హేలావిభ్రమగోచరే = విలాసాదులచేఁ దెలియఁదగినది, (త్రి) 3 కేకరాక్షే = మెల్లకంటివాఁడు.

డింగరో డంగరేఽపి చ, క్షేపే

డింగరః—(పు) ౧ డంగరే = సేవకుఁడు, ౨ క్షేపే=చిమ్ముట.

తమిస్రం తిమిరే కోపే స్త్రీ తు తమస్తతౌ. ౧౬౧. కృష్ణపక్షనిశాయాం చ

తమిస్రం—(న) ౧ తిమిరే = చీఁకటి, ౨ కోపే=కోపము, (స్త్రీ) 3 తమస్తతౌ = చీఁకటిగుంపు, ౪ కృష్ణపక్షనిశాయాం= కృష్ణపక్షరాత్రి.

త్వక్పత్రం తు వరాంగకే, స్త్రీ కారవ్యాం చ

త్వక్పత్రం—(న) ౧ వరాంగకే = లవంగపుఁజెక్క, (స్త్రీ) ౨ కారవ్యాం=ఇంగువాకు.

తిమిరం ధ్వాంతే నేత్రామయాంతరే. ౧౬౨

తిమిరం—(న) ౧ ధ్వాంతే = చీఁకటి, ౨ నేత్రామయాంతరే = నేత్రరోగభేదము.

తీవరో నాంబుధౌ వ్యాధే

తీవరః—(పు) ౧ అంబుధౌ = సంద్రము, ౨ వ్యాధే=బోయవాఁడు.

తుంబురీ కుక్కురస్త్రియాం, ధన్యాకేఽపి

తుంబురీ—(స్త్రీ) ౧ కుక్కురస్త్రియాం = ఆఁడుకుక్క, ౨ ధన్యాకే = కొత్తిమిరు.

తుషారస్తు శీకరే శీతలే హిమే. ౧౬3

తుషారః—(పు) ౧ శీకరే = తుంపురులు, ౨ శీతలే = చల్లనిది, 3 హిమే = మంచు.

తువరస్తు కషాయే స్యాత్కా-
శ్యాఢక్యోస్తువర్యపి,

తువరః—(పు) ౧ కషాయే=ఒగరు, తువరీ (స్త్రీ) ౨ కాక్షీ=తొవరిమన్ను, 3 ఆఢక్యోః=కంది చెట్టు.

తూవరోఽశ్మశ్రుపురుషేప్రౌఢశృంగగవేఽపి చ. ౧౬౪.
పురుషవ్యంజనత్యక్తే స్యాత్కషాయరసేఽపి చ,

తూవరః—(పు) ౧ అశ్మశ్రుపురుషే మీసములు లేనివాఁడు, ౨ అప్రౌఢశృంగగవే = కొలమునకొమ్ములు మొలవని యెద్దు, 3 పురుషవ్యంజనత్యక్తే = నపుంసకుఁడు, ౪ కషాయరసే = ఒగరు.

దహరో మూషికాయాం చ స్వల్పే భ్రాతరి బాలకే. ౧౬౫

దహరః—(పు) ౧ మూషికాయాం = ఆఁడెలుక, ౨ స్వల్పే = స్వల్పము, 3 భ్రాతరి = తోఁబుట్టువు, ౪ బాలకే = బాలుఁడు.

దంతురస్తూన్నతరదే తథోన్నతానతే త్రిషు,

దంతురః—(త్రి) ౧ ఉన్నతరదే = మిట్టపండ్లవాఁడు, ౨ ఉన్నతానతే = మిట్టపల్లమైనది.

దర్దరః పర్వతే పుంసి త్రిష్వీషద్భగ్నభాజనే. ౧౬౬

దర్దరః—(పు) ౧ పర్వతే=దర్దరమనుపర్వతము, (త్రి) ౨ ఈషద్భగ్నభాజనే = కొంచెముపగిలినపాత్రము.

దర్దురస్తోయదే భేకే వాద్యభాండాద్రిభేదయోః, దర్దురా చండికాయాం స్యాద్గ్రామజాలే నపుంసకమ్.

దర్దురః—(పు) ౧ తోయదే = మేఘము, ౨ భేకే=కప్ప, 3 వాద్యభాండ=వాద్యభాండభేదము, ౪ అద్రిభేదయోః = దర్దురపర్వతము,(స్త్రీ) ౫ చండికాయాం =చండికాదేవి, (న) ౬ గ్రామజాలే = గ్రామసమూహము.

దండారో వాహనే మత్తవారణే శరయంత్రకే, కుంభకారస్య చక్రే చ

దండారః—(పు) ౧ వాహనే = వాహనము, ౨ మత్తవారణే = మదపుటేనుఁగు, 3 శరయంత్రకే = బాణయంత్రము, ౪ కుంభకారస్యచక్రే=కుమ్మరసారె.

| | |
|---|---|
| ద్వాపరస్సంశయే యుగే. | ద్వాపరః—(పు) ౧ సంశయే=సంశయము, ౨ యుగే=ద్వాపరయుగము. |
| దాసేరో దాసికాపత్యే త్రిషు పుంసి క్రమేలకే, | దాసేరః—(త్రి) ౧ దాసికాపత్యే=దాసీయొక్కసంతానము, (పు) ౨ క్రమేలకే=ఒంటె. |
| దుర్ధరః పుంసి నరకాంతరే స్యాదృషభౌషధౌ. ౧౬౯ | దుర్ధరః—(పు) ౧ నరకాంతరే=నరకవిశేషము, ౨ ఋషభౌషధౌ = ఋషభమనునోషధి. |
| దైత్యారిః పుంసి సామాన్యదేవే చ గరుడధ్వజే, | దైత్యారిః—(పు) ౧ సామాన్యదేవే=వేలుపు, ౨ గరుడధ్వజే=విష్ణువు. |
| ధూసరీ కిన్నరీభేదే నా ఖరే త్రిషు పాండురే. ౧౭౦ | ధూసరీ—(స్త్రీ) ౧ కిన్నరీభేదే=ఒకానొకకిన్నరస్త్రీ, (పు) ౨ ఖరే=గాడిద, (త్రి) 3 పాండురే=బూడిదరంగుగలది |
| నరేంద్రస్తు మహీపాలే విషవైద్యే చ పుంస్యయం, | నరేంద్రః—(పు) ౧ మహీపాలే=రాజు, ౨ విషవైద్యే=పాములవాఁడు. |
| నర్మరా తు దరీభస్త్రాసరలానిష్కలాసు చ. ౧౭౧ | నర్మరా—(స్త్రీ) ౧ దరీ=గుహ, ౨ భస్త్రా=కొలిమితిత్తి, 3 సరలా = తెల్లతెగడచెట్టు, ౪ నిష్కలాసు = ముట్లుడుగినయాఁడుది. |
| నాగరం ముస్తకే శుంఠ్యాం విదగ్ధే నగరోద్భవే, | నాగరం—(న) ౧ ముస్తకే=ముస్తెచెట్టు, ౨ శుంఠ్యాం = సొంఠి, 3 విదగ్ధే = నేర్పరి, (త్రి) ౪ నగరోద్భవే = పట్టణమందుఁబుట్టినది. |
| నికరో నివహే సారే న్యాయదేయధనే నిధౌ. ౧౭౨ | నికరః— (పు) ౧ నివహే = సమూహము, ౨ సారే=బలము, 3 న్యాయదేయధనే = న్యాయముగానివ్వఁదగినద్రవ్యము, ౪ నిధౌ=నిధి. |
| నిర్ఝరస్తు సహస్రాంశుతురంగే తుషపావకే, | నిర్ఝరః—(పు) ౧ సహస్రాంశుతురంగే = సూర్యునిగుఱ్ఱము, ౨ తుషపావకే = ఊకనిప్పు. |

నిర్జరస్స్యాత్పుమాన్ దేవే
జరాత్యక్తే చ వాచ్యవత్.
౧౭౩. నిర్జరా తు గుడూ
చ్యాం చ తాలపర్ణ్యామపి
స్త్రియామ్,

నిర్జరః—(పు) ౧ దేవే=వేల్పు, (త్రి) ౨ జరాత్యక్తే=ముసలితనము లేనివాఁడు, (స్త్రీ) ౩ గుడూచ్యాం = తిప్పతీఁగె, ౪ తాలపర్ణ్యాం = మురయను గంధ ద్రవ్యము.

నికారస్స్యాత్పరిభవే ధాన్య
స్యోత్క్షేపణేఽపి చ. ౧౭౪

నికారః—(పు) ౧ పరిభవే=అవమానము ౨ ధాన్యస్యోత్క్షేపణే = ధాన్యమును బ్రోగుచేయుట.

నిర్దరం నిర్భరే సారేఽన్యవత్తు
కఠినేఽత్రపే,

నిర్దరం—(న) ౧ నిర్భరే=భరింపశక్యము గానిది, ౨ సారే=సారము, (త్రి) ౩ కఠినే=కఠినుఁడు, ౪ అత్రపే=సిగ్గులేని వాఁడు.

స్యాన్నీవరో వాణిజకే వా
స్తవ్యే చ పుమానయమ్.

నీవరః—(పు) ౧ వాణిజకే = వర్తకుఁడు, ౨ వాస్తవ్యే=నివసింపఁదగినది.

ప్రవరం సంతతౌ గోత్రే క్లీ
బం శ్రేష్ఠే తు వాచ్యవత్,

ప్రవరం—(న) ౧ సంతతౌ=సంతానము, ౨ గోత్రే=వంశము, (త్రి) ౩ శ్రేష్ఠే= శ్రేష్ఠుఁడు.

ప్రఖరో హయసన్నాహే
కుక్కురేఽశ్వతరేఽపి చ.
౧౭౫. పుంసి త్రిష్వత్యన్త
ఖరే

ప్రఖరః—(పు) ౧ హయసన్నాహే = గుఱ్ఱములయొక్క సన్నాహము, ౨ కుక్కురే = కుక్క, ౩ అశ్వతరే = కంచరగాడిద, (త్రి) ౪ అత్యంతఖరే= మిగులకఠినమయినది.

పవిత్రం వర్షణే కుశే, తామ్రే
పయసి చ క్లీబం మేధ్యే
స్యాదభిధేయవత్. ౧౭౬

పవిత్రం—(న) ౧ వర్షణే=వర్షము, ౨ కుశే=దర్భ, ౩ తామ్రే = రాగి, ౪ పయసి=నీరు, (త్రి) ౫ మేధ్యే=పవిత్రమయినది.

ప్రదరో రోగభేదే స్యాద్వి
దారే శరభంగయోః,

ప్రదరః—(పు) ౧ రోగభేదే=స్త్రీలకుగలుగు రక్తస్రావము, ౨ విదారే=బ్రద్దలగుట, ౩ శరే=బాణము, ౪ భంగయోః = విఱుచుట.

ప్రకరస్స్యాత్పుమాన్ సంఘే
వికీర్ణకుసుమాదిషు. ౧౭౮.
నపుంసకం జోంగకే స్త్రీ
నాట్యాంగే చత్వరావనౌ,

ప్రకరః—(పు) ౧ సంఘే=సమూహము, ౨ వికీర్ణకుసుమాదిషు = వెదజల్లిన పుష్పాదులు, (న) 3 జోంగకే=అగరు, (స్త్రీ) ౪ నాట్యాంగే = నాట్యావయవము, ౫ చత్వరావనౌ=ముంగిలి.

పంకారశ్శైవలే సేతౌ సోపా
నే జలకుబ్జకే. ౧౭౯.

పంకారః—(పు) ౧ శైవలే = నాచు, ౨ సేతౌ=కట్ట, 3 సోపానే = మెట్టు, ౪ జలకుబ్జకే=నీటిగొజ్జంగిచెట్టు.

ప్రస్తరో గ్రావణి మణౌ

ప్రస్తరః—(పు) ౧ గ్రావణి = ఱాయి, ౨ మణౌ=మాణిక్యము.

ప్రకారస్తుల్యభేదయోః,

ప్రకారః—(పు) ౧ తుల్యే = పోలిక, ౨ భేదయోః=భేదము.

పదారః పాదధూలౌ స్యా
త్పాదాలిందేఽపి పుంస్య
యమ్. ౧౮౦

పదారః—(పు) ౧ పాదధూలౌ = పాదమునందలిరజము, ౨ పాదాలిందే = ఓడ.

ప్రసరః ప్రణయే వేగేస్యాత్

ప్రసరః—(పు) ౧ ప్రణయే = ప్రేమ, ౨ వేగే=తొందర.

పటీరస్తు మూలకే, కేదారే
వేణుసారే చ వారిదే తిత
ఉన్యపి ౧౮౧. స్యాద్రంగే
వాతికే పుంసి

పటీరః—(పు) ౧ మూలకే = ముల్లంగిదుంప, ౨ కేదారే=వరిమడి, 3 వేణుసారే = వెదురుచేవ, ౪ వారిదే = మేఘము, ౫ తితఉని = జల్లెడ, ౬ రంగే=రంగు, ౭ వాతికే=వాతరోగము.

పామరః ఖలనీచయోః,

పామరః—(పు) ౧ ఖల=దుర్మార్గుఁడు, ౨ నీచయోః=నీచుఁడు.

పాండురం స్యాన్మరువకే వర్ణే
నా తద్వతి త్రిషు. ౧౮౨

పాండురం—(న) ౧ మరువకే = మరువక పుష్పము, (పు) ౨ వర్ణే=తెలుపురంగు, (త్రి) 3 తద్వతి=తెలుపురంగుకలది.

పార్వరో భక్తసిక్థే స్యాత్కీ-
నాశే రాజయక్ష్మణి, జరా
టేఽపి కదంబస్య కేసరే చ

పార్వరః—(పు) ౧ భక్తసిక్థే = అన్నపు మెతుకు, ౨ కీనాశే = జముఁడు, 3 రాజయక్ష్మణి = క్షయరోగము, ౪

గదాన్తరే. ౧౮౩

జరాటే = ముదిమిచేఁ దిరుగువాఁడు, ౫ కదంబస్య కేసరే = కడిమిపువ్వుయొక్క కింజల్కములు, ౬ గదాన్తరే =రోగభేదము.

ప్రాన్తరం విపినే దూరశూన్యవర్త్మని కోటరే,

ప్రాన్తరం—(న) ౧ విపినే = అడవి, ౨ దూరశూన్యవర్త్మని = దగ్గఱత్రోవ ౩ కోటరే=చెట్టుతొఱట.

పిఠరః స్థాల్యాం నా క్లీబం ముస్తామంథానదండయోః

పిఠరః—(పు) ౧ స్థాల్యాం = కుండ, (న) ౨ ముస్తా=తుంగముస్తె, ౩ మంథానదండయోః=కవ్వపుఁగోల.

పింజరోఽశ్వాంతరే క్లీబం స్వర్ణే పీతే తు వాచ్యవత్,

పింజరః—(పు) ౧ అశ్వాంతరే=అశ్వవిశేషము, (న) ౨ స్వర్ణే = బంగారము, (త్రి) ౩ పీతే=పచ్చనైనది.

పిండారః క్షపణే గోపే మహిషీరక్షకే ద్రుమే. ౧౮౫

పిండారః—(పు) ౧ క్షపణే = క్షపణమతస్థుఁడు, ౨ గోపే = గొల్లవాఁడు, ౩ మహిషీరక్షకే=బఱ్ఱెలనుగాయువాఁడు, ౪ ద్రుమే=వృక్షవిశేషము.

పీవరః కచ్ఛపే స్థూలే

పీవరః—(పు) ౧ కచ్ఛపే = కూర్మము, ౨ స్థూలే=బలిసినవాఁడు.

పుష్కరం ఖేఽమ్బుపద్మయోః తూర్యవక్త్రే ఖడ్గఫలే హస్తిహస్తాగ్రకాణ్డయోః. ౧౮౬. కుష్ఠౌషధేద్వీపతీర్థభేదయోశ్చ నపుంసకమ్, నా రోగనాగవిహగనృపభేదేషు వారుణే. ౧౮౭

పుష్కరం—(న) ౧ ఖే = ఆకసము, ౨ అంబు = ఉదకము, ౩ పద్మయోః = పద్మము, ౪ తూర్యవక్త్రే = మద్దెలమున్నగువానిముఖము, ౫ ఖడ్గఫలే= కత్తివాదర, ౬ హస్తిహస్తాగ్ర = తొండముచివర, ౭ కాండయోః = బాణము, ౮ కుష్ఠౌషధే = కుష్ఠమనునోషధి, ౯ ద్వీప = పుష్కరద్వీపము, ౧౦ తీర్థభేదయోః = పుష్కరతీర్థము, (పు) ౧౧ రోగ = రోగవిశేషము, ౧౨ నాగ = సర్పవిశేషము, ౧౩

విహాగ=బెగ్గురుపక్షి, ౧౪ నృపభేదేషు =పుష్కరుఁడను రాజు, ౧౫ వారుణే= వరుణపుత్త్రుఁడు.

వంతరః స్థగికారజ్జౌ లాంగూలే కుక్కురస్య చ, కరీర కోశే తాలస్య పల్లవే చ పయోధరే. ౧౮౮

వంతరః—(స్త్రీ) ౧ స్థగికారజ్జౌ=కట్టుత్రాడు, ౨ కుక్కురస్యలాంగూలే = కుక్క తోఁక, ౩ కరీరకోశే=వెదురుమొవ్వ, ౪ తాలస్యపల్లవే=తాటిచిగురుటాకు, ౫ పయోధరే = మేఘము, లేక చన్ను.

బంధురం ముకుటే పుంసి స్త్రీచిహ్నతిలకల్కయోః, బన్ధూకే బధిరే హంసే త్రిషు స్యాద్రమ్యనమ్రయోః. ౧౮౯. బంధురా పణ్యయోషాయాం స్త్రియాం పుంభూమ్ని సక్తుషు,

బంధురం—(న) ౧ ముకుటే = కిరీటము, (పు) ౨ స్త్రీచిహ్నే = భగము, ౩ తిల కల్కయోః=నూనెముడ్డి, ౪ బంధూకే= మంకెనచెట్టు, ౫ బధిరే=చెవిటివాఁడు, ౬ హంసే=కలహంస, (త్రి) ౭ రమ్యే= సుందరమైనది, ౮ నమ్రయోః = వంగినది, (స్త్రీ) ౯ పణ్యయోషాయాం= వేశ్య, (ని. బ.) ౧౦ సక్తుషు = పేల పిండి.

బంధూరశ్శోభనే నమ్రే

బంధూరః—(పు)౧ శోభనే=సుందరుఁడు, ౨ నమ్రే=వంగినవాఁడు.

వరత్రా వర్ధ్రికక్ష్యయోః.

వరత్రా—(స్త్రీ) ౧ వర్ధ్రి = టంగువారు, ౨ కక్ష్యయోః = ఏనుఁగునడుముకుఁ గట్టెడు మోకు.

భ్రమరః కాముకే భృంగే

భ్రమరః—(పు) ౧ కాముకే = కాముకుఁడు, ౨ భృంగే=తుమ్మెద.

భ్రామరం మధుని స్మృతం, పుంసి ప్రస్తరభేదే౽

భ్రామరం—(న) ౧ మధుని = తేనె, (పు) ౨ ప్రస్తరభేదే = పాషాణ భేదము.

థ భాస్కరో౽గ్నౌ ప్రభాకరే.

భాస్కరః—(పు) ౧ అగ్నౌ = నిప్పు, ౨ ప్రభాకరే=సూర్యుఁడు.

భార్యారుశ్శైలభేదే స్యా న్మృగభేదే చ తత్ర చ, క్రీడయా పరభార్యాయాం పుత్రో యేనోపపాదితః.

భార్యారుః—(పు) ౧ శైలభేదే=పర్వతవిశేషము, ౨ మృగభేదే=మృగభేదము, ౩ యేనపరభార్యాయాం క్రీడయాపుత్రో ఉపపాదితస్తత్ర=పరస్త్రీయందురతిచేసి శిశువునుబుట్టించినవాఁడు.

భృంగారీ ఝిల్లికాయాంస్యా త్కనకాలౌ పునఃపుమాన్,

భృంగారీ—(స్త్రీ) ౧ ఝిల్లికాయాం = చిమట, (పు) ౨ కనకాలౌ = బంగారు గిండి.

మత్సరా మక్షికాయాం స్యా న్మాత్సర్యక్రోధయోః పుమాన్. ౧౯౩. అసహ్యాపరసంపత్తౌ కృపణే చాభిధేయవత్,

మత్సరా—(స్త్రీ) ౧ మక్షికాయాం=ఈఁగ, (పు) ౨ మాత్సర్య = అసహనము, ౩ క్రోధయోః = కోపము, (త్రి) ౪ అసహ్యాపరసంపత్తౌ=పరుల మేలు సహింపనివాఁడు, ౫ కృపణే=లోభి.

మధురా శతపుష్పాయాం మిశ్రేయానగరీభిదోః. ౧౯౪. మధుకర్కటికా మేదామధూలీయష్టికాసు చ, క్లీబం విషే పుంసి రసే తద్వత్స్వాదు ప్రియేఽన్యవత్. ౧౯౫

మధురా—(స్త్రీ) ౧ శతపుష్పాయాం = సదాపచెట్టు, ౨ మిశ్రేయా = అడవి సదాపచెట్టు, ౩ నగరీభిదోః=మధురాపట్టణము, ౪ మధుకర్కటికా=తియ్యదోసచెట్టు, ౫ మేదా = మేదయనుచెట్టు, ౬ మధూలీ = మకరందము, ౭ యష్టికాసు = అతిమధురము, (న) ౮ విషే=విషము, (పు) ౯ రసే = మధురరసము, (త్రి) ౧౦ తద్వత్ = మధురరసముకలది, ౧౧ స్వాదు = తియ్యనిది, ౧౨ ప్రియే=ఇష్టమైనది.

మందరస్తు పుమాన్ మంథశైలే మందారపాదపే, వాచ్యవద్బహులే మందే,

మందరః—(పు) ౧ మంథశైలే = మందరపర్వతము, ౨ మందారపాదపే = మందారవృక్షము, (త్రి) ౩ బహులే = అధికమైనది, ౪ మందే=అలసము.

మందారస్స్యాత్సురద్రుమే. ౧౯౬. పారిభద్రేఽర్కపర్ణే

మందారః—(పు) ౧ సురద్రుమే = మందారవృక్షము, ౨ పారిభద్రే = బాడి

| | |
|---|---|
| చ మందారో హస్తిధూర్త యోః, | దపుఁజెట్టు, ౩ అర్కపర్ణే=జిల్లేడుచెట్టు, ౪ హస్తి=ఏనుఁగు, ౫ ధూర్తయోః= ఉమ్మెత్తచెట్టు. |
| మందిరం నగరేఽగారే క్లీబం నా మకరాలయే. ౧౯౭ | మందిరం—(న) ౧ నగరే=పట్టణము, ౨ అగారే = గృహము, (పు) ౩ మకరాలయే=సంద్రము. |
| మంథరః కోశఫలయో ర్బాధ మంథానయోః పుమాన్, కుసుంభ్యాం న ద్వయో ర్మందే పృథౌ వక్రేఽభి ధేయవత్. ౧౯౮ | మంథరః—(పు) ౧ కోశే=మొగ్గ, ౨ ఫలయోః=ఫలము, ౩ బాధ=బాధించుట, ౪ మంథానయోః =కవ్వము, (న) ౫ కుసుంభ్యాం=కుసుంబాచెట్టు, (త్రి) ౬ మందే=మెల్లగాఁబోవునది, ౭ పృథౌ= విశాలమైనది, ౮ వక్రే = వంకరైనది. |
| మకరో యాదసో భేదే నిధి రాశిప్రభేదయోః, | మకరః—(పు) ౧ యాదసోభేదే=మొసలి, ౨ నిధి = మకరనిధి, ౩ రాశిప్రభేదయోః=మకరరాశి. |
| మయూరో బర్హిచూడా యా మపామార్గే శిఖండిని. | మయూరః—(పు) ౧ బర్హిచూడాయాం =నెమలిపురి, ౨ అపామార్గే = ఉత్తరేణిచెట్టు, ౩ శిఖండిని=నెమిలి. |
| మహేంద్రః పర్వతే శక్రే | మహేంద్రః—(పు) ౧ పర్వతే=మహేంద్రపర్వతము, ౨ శక్రే=ఇంద్రుఁడు. |
| మధుద్రోఽలౌ చ కాముకే, | మధుద్రః—(పు) ౧ అలౌ = తుమ్మెద, ౨ కాముకే = కాముకుఁడు. |
| మందురా వాజిశాలాయాం శయనీయార్థవస్తుని. ౨౦౦ | మందురా—(స్త్రీ) ౧ వాజిశాలాయాం = గుఱ్ఱపుసావడి, ౨ శయనీయార్థవస్తుని= పడక. |
| మసూరా మసురా వా నా వేశ్యావ్రీహిప్రభేదయోః, మసూరీ పాపరోగే స్యా దుపధానే పునః పుమాన్. | మసూరా / మసురా —(స్త్రీ) ౧ వేశ్యా = భోగముది, (పు) ౨ వ్రీహిప్రభేదయోః=చిఱుసెనగలు, మసూరీ (స్త్రీ) ౩ పాపరోగే = ఒకవిధమగుగజ్జి, (పు) ౪ ఉపధానే=దిండు. |

| | |
|---|---|
| మర్మరో వస్త్రభేదే చ శుష్క-పర్ణధ్వనౌ తథా, పుంసి స్త్రియాం పునః ప్రోక్తా మర్మరీ పీతదారుణి. ౨౦౨ | మర్మరః—(పు) ౧ వస్త్రభేదే = వస్త్రవిశేషము, ౨ శుష్క-పర్ణధ్వనౌ = ఎండాకులచప్పుడు, మర్మరీ (స్త్రీ) 3 పీతదారుణి= దేవదారుచెట్టు. |
| మంజరీ తిలకద్రూరుముక్తయోర్వల్లరౌ ద్వయోః, | మంజరీ—(స్త్రీ) ౧ తిలకద్రు = బొట్టుగుచెట్టు, ౨ ఊరుముక్తయోః = పెద్దముత్తెము, (ద్వ) 3 వల్లరౌ=పూలగుత్తి. |
| ముకురస్స్యాన్ముకురవ ద్దర్పణే వకులద్రుమే. ౨౦3. కులాలదండే | ముకురః—(పు) (ముకురశబ్దమువలె) ౧ దర్పణే = అద్దము, ౨ వకులద్రుమే = పొగడచెట్టు, 3 కులాలదండే=కుమ్మరిసారెత్రిప్పుకఱ్ఱ. |
| మాఠరో వ్యాసేఽర్క-పారిపార్శ్వకే, | మాఠరః—(పు) ౧ వ్యాసే=వ్యాసమహర్షి, ౨ అర్క-పారిపార్శ్వకే = సూర్యుని పార్శ్వకులలోనొకఁడు. |
| మార్జార ఓతౌ ఖట్టాశే, | మార్జారః—(పు) ౧ ఓతౌ = పిల్లి, ౨ ఖట్టాశే=పునుఁగుఁబిల్లి. |
| మిహిరస్సూర్యవృద్ధయోః. | మిహిరః—(పు) ౧ సూర్యే=సూర్యుఁడు, ౨ వృద్ధయోః=ముసలివాఁడు. |
| ముద్గరం మల్లికాభేదే పుంసి లోష్టాదిభేదనే, | ముద్గరం—(న) ౧ మల్లికాభేదే=మల్లెతీఁగవిశేషము, ౨ లోష్టాదిభేదనే=సమ్మెట. |
| ముదిరః కాముకే మేఘే, | ముదిరః—(పు) ౧ కాముకే=కాముకుఁడు, ౨ మేఘే= మేఘము. |
| ముహిరః కామమూర్ఖయోః. | ముహిరః—(పు) ౧ కామ=మన్మథుఁడు, ౨ మూర్ఖయోః = మూర్ఖుఁడు. |
| ముర్ముర స్తుషవహ్నౌ స్యాన్మన్మథే రవివాజిని, | ముర్మురః—(పు) ౧ తుషవహ్నౌ = ఊకనిప్పు, ౨ మన్మథే=మన్మథుఁడు, 3 రవివాజిని=సూర్యునిగుఱ్ఱము. |
| మృగారిస్స్యాత్పుంసి కంఠీరవశార్దూలయోరపి. ౨౦౪ | మృగారిః—(పు) ౧ కంఠీరవ = సింగము, ౨ శార్దూలయోః=పులి. |

| | |
|---|---|
| రుధిరో౽ంగారకే పుంసి క్లీబం తు కుంకుమాసృజోః, | రుధిరః—(పు) ౧ అంగారకే = కుజుఁడు, (న) ౨ కుంకుమ = కుంకుమము, 3 అసృజోః=రక్తము. |
| బదరాగృష్టికార్పాస్యో రేలాపర్ణ్యాం స్త్రియాంపుమాన్ ౨౦౭. కార్పాసస్యాస్థ్ని బదరీ కోలా క్లీబం తు తత్ఫలే, | బదరా—(స్త్రీ) ౧ గృష్టి = పాఁచితీఁగె, ౨ కార్పాస్యోః = ప్రత్తిచెట్టు, 3 ఏలాపర్ణ్యాం = కారేలకిచెట్టు, (పు) ౪ కార్పాసస్యాస్థ్ని = ప్రత్తిగింజ, బదరీ (స్త్రీ) ౫ కోలా = రేఁగిచెట్టు, (న) ౬ తత్ఫలే=రేఁగిపండు. |
| వచరః కుక్కుటే పుంసి శఠే చ | వచరః—(పు) ౧ కుక్కుటే = కోడి, ౨ శఠే=కుత్సితుఁడు. |
| వశిరః పుమాన్. ౨౦౮. కిణిహీహాస్తిపిప్పల్యోః క్లీబే౽బ్ధిలవణే స్మృతః, | వశిరః—(పు) ౧ కిణిహీ=ఉత్తరేణిచెట్టు, ౨ హస్తిపిప్పల్యోః = గజపిప్పలితీఁగ, (న) 3 అబ్ధిలవణే=సముద్రలవణము. |
| బర్బరః పామరే కేశే చక్రలే నీవృదంతరే. ౨౦౯. ఫంజికాయాం పుమాన్ శాకభేదపుష్పభిదోః స్త్రియాం, | బర్బరః—(పు) ౧ పామరే = తెలివిలేనివాఁడు, ౨ కేశే = వెండ్రుకలు, 3 చక్రలే=గుండ్రనితుంగముస్తెచెట్టు, ౪ నీవృదన్తరే = బర్బరదేశము, (పు) ౫ ఫంజికాయాం=భారంగిచెట్టు, (స్త్రీ) ౬ శాకభేద = వాయింటాకు, ౭ పుష్పభిదోః=పుష్పవిశేషము. |
| వర్కర పరిహాసే స్యాచ్ఛాగే యువపశావపి. ౨౧౦ | వర్కరః—(పు) ౧ పరిహాసే=పరిహాసము, ౨ ఛాగే = మేక, 3 యువపశౌ = ప్రాయపుఁబశువు. |
| వల్లురం శాద్వలక్షేత్రే గహనోషరయోరపి, | వల్లురం—(న) ౧ శాద్వలక్షేత్రే=పచ్చికభూమి, ౨ గహన = అడవి, 3 ఊషరయోః=నిర్జరభూమి. |
| వల్లూరా త్రిషు సంశుష్కమాంసశూకరమాంసయోః | వల్లూరా—(త్రి) ౧ సంశుష్కమాంస = ఎండుమాంసము, ౨ సూకరమాంసయోః=పందిమాంసము. |

| | |
|---|---|
| వార్దరం కృష్ణలాబీజదక్షిణావర్తశంఖయోః, నీరే చ కాకచించాయాం భారత్యాం చ నపుంసకమ్. | వార్దరం—(న) ౧ కృష్ణలాబీజ=గురువింద విత్తు, ౨ దక్షిణావర్తశంఖయోః = దక్షిణావర్తశంఖము, 3 నీరే=నీళ్లు, ౪ కాకచించాయాం=గురువిందతీఁగ, ౫ భారత్యాం=వాక్కు. |
| వాగరస్తు గతాతంకే ముముక్షౌ వాతవేష్టకే, విశారదేఽపి శాణేఽపి నిర్ణయే వారకేఽపి చ. ౨౧3 | వాగరః—(పు) ౧ గతాతంకే=భయములేనివాఁడు, ౨ ముముక్షౌ=మోక్షేచ్ఛ గలవాఁడు, 3 వాతవేష్టకే=ఒకానొక పశురోగము, ౪ విశారదే=పండితుఁడు, ౫ శాణే=ఒరపిడితాయి, ౬ నిర్ణయే = నిశ్చయము, ౭ వారకే = అడ్డగించు వాఁడు. |
| వాసరస్తు పుమాన్నాగప్రభేదే దివసేఽస్త్రియాం, | వాసరః—(పు) ౧ నాగప్రభేదే=సర్పవిశేషము, (పున) ౨ దివసే=దినము. |
| వాసురా వాసితాయాంస్యాద్వాసతేయభువి స్త్రియాం. | వాసురా—(స్త్రీ) ౧ వాసితాయాం=ఆఁడేనుఁగు, ౨ వాసతేయభువి=నివాసయోగ్యస్థలము, 3 స్త్రియాం=ఆఁడుది. |
| విష్టరః కుశముష్టౌ స్యాదాసనేఽపి మహీరుహే, | విష్టరః—(పు) ౧ కుశముష్టౌ=దర్భపిడికిలి, ౨ ఆసనే=ఆసనము, 3 మహీరుహే = వృక్షము. |
| విస్తరో వాక్ప్రపంచే స్యాద్విస్తారే ప్రణయేఽపి చ. | విస్తరః—(పు) ౧ వాక్ప్రపంచే = వాక్సమూహము, ౨ విస్తారే = విరివి, 3 ప్రణయే=స్నేహము. |
| విదురో నాగరే ధీరే కౌరవాణాం చ మంత్రిణి, | విదురః—(పు) ౧ నాగరే = నేర్పరి, ౨ ధీరే = ధైర్యశాలి, 3 కౌరవాణాం మంత్రిణి=విదురుఁడు. |
| విధురం స్యాత్ప్రవిశ్లేషే న ద్వయోర్వికలే త్రిషు. ౨౧౬. రసాలాయాం స్త్రీ | విధురం—(త్రి) ౧ ప్రవిశ్లేషే=వియోగము, ౨ వికలే = విచ్ఛేదమునొందినది, (స్త్రీ) 3 రసాలాయాం=పంచదారకలిపి తాలింపుపెట్టిన పెరుగు. |

| | |
|---|---|
| విదారో జలోచ్ఛ్వాసే విదారణే, | విదారః—(పు) ౧ జలోచ్ఛ్వాసే=అలుగు ౨ విదారణే=చీల్చుట. |
| విదారీ శాలపర్ణ్యాం చ రోగభేదేక్షుగంధయోః ౨౧౭ | విదారీ—(స్త్రీ) ౧ శాలపర్ణ్యాం=ముయ్యాకుపొన్న చెట్టు, ౨ రోగభేదే=ఒకానొక రోగము, 3 ఇక్షుగంధయోః = తెల్ల నేలగుమ్మడి చెట్టు. |
| వివరం దూషణే గర్తే | వివరం—(న) ౧ దూషణే=దోషము, ౨ గర్తే=గుంట. |
| విసరః ప్రసరే వ్రజే, | విసరః—(పు) ౧ ప్రసరే=వ్యాపించుట, ౨ వ్రజే=సమూహము. |
| విస్తారో విస్తృతౌ స్తంబే, | విస్తారః—(పు) ౧ విస్తృతౌ=విస్తారము, ౨ స్తంబే=బోదెలేని చెట్టు. |
| వికారో వికృతౌ రుజి. ౨౧౮ | వికారః—(పు) ౧ వికృతౌ=వికారము, ౨ రుజి=రోగము. |
| విహారో భ్రమణే స్కంధే లీలాయాం సుగతాలయే, | విహారః—(పు) ౧ భ్రమణే = వేడుకగాఁ దిరుగుట, ౨ స్కంధే=చెట్టుమొదలు, 3 లీలాయాం = విలాసము, ౪ సుగతాలయే=బౌద్ధాలయము. |
| శబరో మ్లేచ్ఛభేదే చ పానీయే శంకరేఽపి చ. ౨౧౯ | శబరః—(పు) ౧ మ్లేచ్ఛభేదే = బోయవాఁడు, ౨ పానీయే = ఉదకము, 3 శంకరే=ఈశ్వరుఁడు. |
| శంబరం సలిలే పుంసి మృగదైత్యవిశేషయోః, | శంబరం—(న) ౧ సలిలే=నీరు, ౨ మృగ=ఎఱ్ఱనిచిన్న జింక, 3 దైత్యవిశేషయోః =శంబరాసురుఁడు. |
| శంబరీ చాఖుపర్ణ్యాం స్యా | శంబరీ—(స్త్రీ) ౧ ఆఖుపర్ణ్యాం=ఎలుకచెవి చెట్టు. |
| చ్ఛర్వరీ యామినీస్త్రియోః. | శర్వరీ—(స్త్రీ) ౧ యామినీ = రేయి, ౨ స్త్రియోః=ఆఁడుది. |
| శర్కరా ఖండవికృతావుపలా కర్పరాంశయోః, శర్కరా | శర్కరా—(స్త్రీ) ౧ ఖండవికృతౌ = పంచదార, ౨ ఉపలా=ఱాయి, 3 కర్పరాం |

న్వితదేశేఽపి రుగ్భేదే శకలేఽపి చ. ౨౨౧

శయోః = పగిలిన కుండపెంకు, ౪ శర్కరాన్వితదేశే = మొరపనేల, ౫ రుగ్భేదే=రోగవిశేషము, ౬ శకలే = తునుక.

శక్వరీ ఛందసో భేదే నదీమేఖలయోరపి,

శక్వరీ—(స్త్రీ) ౧ ఛందసోభేదే = శక్వరీఛందము, ౨ నదీ = ఏఱు, 3 మేఖలయోః=ఒడ్డాణము.

శణీరం శోణమధ్యస్థపులినే దర్దరీతటే. ౨౨౨

శణీరం—(న) ౧ శోణమధ్యస్థపులినే=శోణనదమందలియిసుకతిన్నె, ౨ దర్దరీతటే =దర్దరీనదియొడ్డు.

శ్వశురఃపూజ్యే స్త్రీ బ్రాహ్మ్యాం

శ్వశురః—(పు) ౧ పూజ్యే=మామ, (స్త్రీ) ౨ బ్రాహ్మ్యాం=సరస్వతి.

శారీరం దేహజే వృషే,

శారీరం—(త్రి) ౧ దేహజే = శరీరమునఁబుట్టినది, (న) ౨ వృషే=ఎద్దు.

శార్కరస్స్యాద్దుగ్ధఫేనశర్కరాన్వితదేశయోః. ౨౨3

శార్కరః—(పు) ౧ దుగ్ధఫేన = పాలనురుఁగు, ౨ శర్కరాన్వితదేశయోః = మొరపనేల.

శాంకరస్తు బలీవర్ధే ఛందోభేదే నపుంసకమ్,

శాంకరః—(పు) ౧ బలీవర్ధే = ఎద్దు, (న) ౨ ఛందోభేదే = ఛందోవిశేషము.

శార్వరం త్వంధతమసే ఘాతుకే భేద్యలిఙ్గకమ్, ౨౨౪

శార్వరం—(న) ౧ అంధతమసే = కటికిచీఁకటి, (త్రి) ౨ ఘాతుకే = చంపునది.

శాలారం స్యాద్ధస్తినఖే సోపానే పక్షిపంజరే,

శాలారం—(న) ౧ హస్తినఖే=ఏనుఁగుగోరు, (పట్టణద్వారమందునిమ్నోన్నతముగా నేర్పఱచినమట్టిదిన్నె యని కొందఱు), ౨ సోపానే= మెట్టు, 3 పక్షిపంజరే=పిట్టలపంజరము.

శాబరీ శూకశింబ్యాం స్యాత్పుంసి పాపాపరాధయోః.

శాబరీ—(స్త్రీ) ౧ శూకశింబ్యాం = దూలగొండిచెట్టు, (పు) ౨ పాప=పాపము

| | |
|---|---|
| ౨౨౫. లోధ్రే చ | 3 అపరాధయోః=తప్పు, ర లోధ్రే = లొద్దుగచెట్టు. |
| శాంకరిః పుంసి కార్తికేయే గణాధిపే, | శాంకరిః—(పు) ౧ కార్తికేయే=కుమారస్వామి, ౨ గణాధిపే=వినాయకుఁడు. |
| శిఖరోఽస్త్రీ ద్రుమాగ్రేఽద్రిశృంగే పులకకక్షయోః. ౨౨౬. పక్వదాడిమబీజాభ మాణిక్యశకలాగ్రయోః, | శిఖరః—(ప్న) ౧ ద్రుమాగ్రే=చెట్టుచివర, ౨ అద్రిశృంగే = పర్వతశిఖరము, 3 పులక=రోమాంచము, ర కక్షయోః=కచ్చ, ౫ పక్వదాడిమబీజాభమాణిక్య=పండినదానిమ్మపండువంటిమాణిక్యము, (పద్మరాగము) ౬ శకలాగ్రయోః = తునుకయంచు. |
| శిశిరో నా హిమే న స్త్రీ ఋతుభేదే జడే త్రిషు. ౨౨౭ | శిశిరః—(పు) ౧ హిమే=చల్లన, ౨ ఋతుభేదే=శిశిరఋతువు, (త్రి) 3 జడే = చల్లనిది. |
| శిలీంధ్రం కందలీపుష్పే కరకే నా ఝషాంతరే, ద్రుభేదే స్త్రీ తు విహగీభేదే గండూపదీమృదోః. ౨౨౮ | శిలీంధ్రం—(న) ౧ కందలీపుష్పే=అరఁటిపువ్వు, (పు) ౨ కరకే=కరకచెట్టు, 3 ఝషాన్తరే = మత్స్యభేదము, (స్త్రీ) ర ద్రుభేదే=నేలతాటచెట్టు, ౫ విహంగిభేదే = ఆఁడుపక్షిభేదము, ౬ గండూపదీ = ఆఁడువెట్టు, ౭ మృదోః = మృత్తిక. |
| శీకరం శరలే వాతస్పృతాంబుకణయోః పుమాన్, | శీకరం—(న) ౧ సరలే=దేవదారుచెట్టు, (పు) ౨ వాత=వాయువు, 3 స్పృతాంబుకణయోః=తుంపర. |
| శుషిరం వంశాదివాద్యే వివరేఽపి నపుంసకమ్. ౨౨౯. మూషికే నా స్త్రియాం సత్యౌషధౌ రంధ్రాన్వితే త్రిషు, | శుషిరం—(న) ౧ వంశాదివాద్యే=మురళిమొదలయినవాద్యము, ౨ వివరే = రంధ్రము, (పు) 3 మూషికే=ఎలుక, (స్త్రీ) ర సత్యౌషధౌ = గువ్వగుత్తికచెట్టు, (త్రి) ౫ రంధ్రాన్వితే=రంధ్రముగలది. |

శృంగారస్సురతే నాట్య రసే చ గజమండనే. ౨౩౦. నపుంసకం లవంగేఽపి నాగసంభవచూర్ణయోః,

శృంగారః—(పు) ౧ సురతే = సురతము, ౨ నాట్యరసే = శృంగారరసము, ౩ గజమండనే = ఏనుఁగునలంకారము, (న) ౪ లవంగే = లవంగపుష్పము, ౫ నాగసంభవ=సిందూరము, ౬ చూర్ణయోః=గందవొడి.

శంబరో దైత్యహరిణమత్స్యశైలజినాంతరే. ౨౩౧. నపుంసకం తు సలిలబౌద్ధవ్రతవిశేషయోః,

శంబరః—(పు) ౧ దైత్య = శంబరాసురుఁడు, ౨ హరిణ = ఎఱ్ఱనిజింక, ౩ మత్స్య=చేఁపలలోనొకటి, ౪ శైల = పర్వతభేదము, ౫ జినాంతరే=బుద్ధవిశేషము, (న) ౬ సలిల = ఉదకము, ౭ బౌద్ధవ్రతవిశేషయోః=బౌద్ధులయొక్క వ్రతవిశేషము.

సంకారోఽగ్నిచటాత్కారే సంమార్జన్యవపుంజితే. ౨౩౨ నవదూషితకన్యాయాం సంకారీ పునరుచ్యతే,

సంకారః—(పు) ౧ అగ్నిచటాత్కారే= అగ్నియొక్కచటచటాధ్వని, ౨ సమ్మార్జన్యవపుంజితే = చీపురుచే ప్రోగుచేయఁబడినకసవు, సంకారీ (స్త్రీ) ౩ నవదూషితకన్యాయాం = నూతనముగాఁ జెడినకన్యక.

సంస్కారః ప్రతియత్నేఽనుభవే మానసకర్మణి. ౨౩౩

సంస్కారః—(పు) ౧ ప్రతియత్నే = చక్కఁజేయుట, ౨ అనుభవే = అనుభూతార్థస్మృతి, ౩ మానసకర్మణి = సంకల్పము.

సంస్తరః ప్రస్తరే యజ్ఞే

సంస్తరః—(పు) ౧ ప్రస్తరే - పుష్పసెజ్జ, ౨ యజ్ఞే=యజ్ఞము.

సంగరో యుధి చాపది, క్రియాకారే విషే చాంగీకారే క్లీబం శమీఫలే.

సంగరః—(పు) ౧ యుధి = యుద్ధము, ౨ ఆపది = ఆపత్తు, ౩ క్రియాకారే = ప్రతిజ్ఞ, ౪ విషే = విషము, ౫ అంగీకారే=అనుమతి, (న) ౬ శమీఫలే= జమ్మిపండు.

| | |
|---|---|
| సంభారస్సంభృతౌ సంఘే | సంభారః—(పు) ౧ సంభృతౌ=భరించుట, ౨ సంఘే=సమూహము. |
| సాముద్రం దేహలక్షణే, సముద్రజేఽన్యలింగోఽ | సాముద్రం—(పు) ౧ దేహలక్షణే = సాముద్రికశాస్త్రము, (త్రి) ౨ సముద్రజే=సముద్రమునఁబుట్టినది. |
| థ సావిత్రశ్శంకరే వసౌ. ౨౩౫. సావిత్రీ సత్యవత్ప త్న్యాం బ్రహ్మపత్న్యుమ యోరపి, | సావిత్రః—(పు) ౧ శంకరే=ఈశ్వరుఁడు, ౨ వసౌ = వసువు, సావిత్రీ (స్త్రీ) ౩ సత్యవత్పత్న్యాం = సావిత్రీ, ౪ బ్రహ్మపత్నీ=సరస్వతి, ౫ ఉమయోః=పార్వతి. |
| సిందూరస్తరుభేదే స్యాత్సిం దూరం రక్తచూర్ణకే. ౨౩౬ సిందూరీ రోచనీరక్తచేలికా ధాతకీషు చ, | సిందూరః—(పు) ౧ తరుభేదే = సిందువారముచెట్టు, (న) ౨ రక్తచూర్ణకే= సిందూరము, సిందూరీ (స్త్రీ) ౩ రోచనీ= తెల్లతెగడచెట్టు, ౪ రక్తచేలికా = ఎఱ్ఱనివస్త్రము, ౫ ధాతకీషు = ఆరెచెట్టు. |
| సునారస్తు శునీస్తన్యే సర్పాం డకలవింకయోః. ౨౩౭ | సునారః—(పు) ౧ శునీస్తన్యే = కుక్కపాలు, ౨ సర్పాండ = పాముగ్రుడ్డు, ౩ కలవింకయోః = ఊరఁబిచ్చుక. |
| సుందరీ తరుభిన్నారీభిదోః స్త్రీ రుచిరేఽన్యవత్, | సుందరీ—(స్త్రీ) ౧ తరుభిత్ = వృక్షవిశేషము, ౨ నారీభిదోః = చక్కనియాఁడుది, (త్రి) ౩ రుచిరే=సుందరమయినది. |
| సైరంధ్రీ పరవేశ్మస్థశిల్పకృ త్స్వవశస్త్రియామ్. ౨౩౮. వర్ణసంకరసంభూతస్త్రీ మహా ల్లికయోరపి, | సైరంధ్రీ—(స్త్రీ) ౧ పరవేశ్మస్థశిల్పకృత్స్వవశస్త్రియామ్=పరులగృహములనలంకారాదులఁజేయుచు స్వతంత్రముగానుండునాఁడుది, ౨ వర్ణసంకరసంభూతస్త్రీ=సంకరజాతిస్త్రీ, ౩ మహల్లికయోః =అంతఃపురఘఁగావలికత్తె. |
| సౌవీరం కాంజికే స్రోతో ఽంజనే చ బదరీఫలే. ౨౩౯. | సౌవీరం—(న) ౧ కాంజికే=పులికడుగు, ౨ స్రోతోంజనే = సౌవీరాంజనము, ౩ |

నా తు సీవృతి

బదరీఫలే=రేఁగుబండు,(పు) ౨ సీవృతి =సౌవీరదేశము.

హారిద్రం హరిద్రారంజితే త్రిషు, నా నీపవృక్షే

హారిద్రం—(త్రి) ౧ హరిద్రారంజితే = పసుపువర్ణముగలది, (పు) ౨ నీపవృక్షే= కడిమచెట్టు.

హిండీరః ఫేనవార్తాకుపూరుషే. ౨౮౦

హిండీరః—(పు) ౧ ఫేన = నురుఁగు, ౨ వార్తాకు=ములకచెట్టు, 3 పూరుషే = పురుషుఁడు.

---

## ర చతుష్కం.

నాలుగక్షరములుగల రకారాంత శబ్దములు.

అరుష్కరో వ్రణకృతి త్రిషు భల్లాతకే పుమాన్, భవే

అరుష్కరః—(త్రి)౧ వ్రణకృతౌ=పుండుచేయునది, (పు) ౨ భల్లాతకే=నల్లజీడిచెట్టు.

అభిమరో యుద్ధే వధే స్వబలసాధ్వసే. ౨౮౧

అభిమరః—(పు) ౧ యుద్ధే = యుద్ధము, ౨ వధే=చంపుట, 3 స్వబలసాధ్వసే= తనసైన్యమువలనిభయము.

అనుత్తరం త్రిషు శ్రేష్ఠే ప్రతిజల్పవివర్జితే,

అనుత్తరం—(త్రి) ౧ శ్రేష్ఠే = ఉత్తముఁడు, ౨ ప్రతిజల్పవివర్జితే=మారుమాటలేనిది.

అలంకారస్తు హారాదావుపమాదావలంకృతౌ. ౨౮౨

అలంకారః—(పు) ౧ హారాదౌ=హారాద్యాభరణము, ౨ ఉపమాదావలంకృతౌ=ఉపమాద్యలంకారములు.

అవహారః పుమాన్ చౌరే ద్యూతయుద్ధాదివిశ్రమే, నిమంత్రణోపనేతవ్యద్రవ్యే గ్రాహాఖ్యయాదసి. ౨౮౩

అవహారః—(పు) ౧ చౌరే = దొంగ, ౨ ద్యూతయుద్ధాదివిశ్రమే = జూదము యుద్ధము మున్నగువానియందలియూఅట, 3 నిమన్త్రణోపనేతవ్యద్రవ్యే = నిమంత్రణముచెప్పుటకుఁ దీసికొనిపోఁదగినద్రవము, ౪ గ్రాహాఖ్యయాదసి = మొసలి.

| | |
|---|---|
| అవతారోఽవతరణే పుష్క-<br>రిణ్యాదితీర్థయోః, | అవతారః—(పు) ౧ అవతరణే = దిగుట, ౨ పుష్కరిణ్యాది=కోనేరు మొదలగునవి, 3 తీర్థయోః=రేవు. |
| అవస్కరోఽపి వర్చస్కే గు<br>హ్యేఽ | అవస్కరః—(పు) ౧ వర్చస్కే=మలము, ౨ గుహ్యే = గోప్యస్థానము. |
| థావసరః పుమాన్. ౨౮౪.<br>ప్రస్తావే మంత్రభేదే చ<br>వర్షణే చాపి కీర్తితః, ఉప<br>లాదౌ | అవసరః—(పు) ౧ ప్రస్తావే = వేళ, ౨ మంత్రభేదే = మంత్రవిశేషము, 3 వర్షణే=కురియుట, ౪ ఉపలాదౌ = పాషాణము మొదలగునది. |
| వకూపారః కూర్మరాజే మ<br>హోదధౌ. ౨౮౫ | అకూపారః—(పు) ౧ కూర్మరాజే=కూర్మరాజు, ౨ మహోదధౌ=సముద్రము. |
| అసిపత్రః ఖడ్గకోశే పుమా<br>నిక్షౌ చ నారకే, భవే | అసిపత్రః—(పు) ౧ ఖడ్గకోశే=కత్తియొఱ, ౨ ఇక్షౌ=చెఱకు, 3 నారకే = నరకవిశేషము |
| దశ్వతరో నాగాంతరే వేగ<br>సరేఽపి చ. ౨౮౬ | అశ్వతరః—(పు) ౧ నాగాన్తరే=సర్పవిశేషము, ౨ వేగసరే=కంచరగాడిద. |
| అభిహారోఽభియోగే చ చౌ<br>ర్యే సన్నహనేఽపి చ, | అభిహారః—(పు) ౧ అభియోగే=పగకెదిరించుట, ౨ చౌర్యే=దొంగిలించుట, 3 సన్నహనే=ఆయిత్తపడుట. |
| అగ్నిహోత్రోఽగ్నిహవిషో | అగ్నిహోత్రః—(పు) ౧ అగ్నౌ=అగ్ని, ౨ హవిషోః=హవిస్సు. |
| దర్ధచంద్రో నఖక్షతే. ౨౮౭.<br>గలహస్తే బాణభేదే కృష్ణ<br>త్రివృతి తు స్త్రియామ్, | అర్ధచంద్రః—(పు) ౧ నఖక్షతే = నఖక్షతము, ౨ గలహస్తే=మెడఁబట్టి గెంటుటకై బెట్టుహస్తము, 3 బాణభేదే = బాణవిశేషము, (స్త్రీ) ౪ కృష్ణత్రివృతి= నల్లతెగడచెట్టు |
| ఆడంబరస్తూర్యపక్ష్మసంరంభే<br>గజగర్జితే. ౨౮౮ | ఆడంబరః—(పు) ౧ తూర్యే = వాద్యధ్వని, ౨ పక్ష్మ=కనుఱెప్ప, 3 సంరంభే= సన్నాహము, ౪ గజగర్జితే = ఏనుఁగు ఘీంకారము. |

| | |
|---|---|
| ఆత్మవీరః ప్రాణవతి శ్యాలకే చ విదూషకే, | ఆత్మవీరః—(పు) ౧ ప్రాణవతి=బలముకలవాఁడు, ౨ శ్యాలకే = బావమఱఁది, 3 విదూషకే=హాస్యగాఁడు. |
| ఇందీవరం కువలయే శతావర్యాం తు యోషితి. ౨౮౯ | ఇందీవరం—(న) ౧ కువలయే=నల్లకలువ, (స్త్రీ) ౨ శతావర్యాం=పిల్లపీఁచర. |
| ఉదుంబరస్తు దేహల్యాం వృక్షభేదే చ పండకే, కుష్ఠభేదేఽపి చ పుమాం స్తామ్రే తు స్యాన్నపుంసకమ్. | ఉదుంబరః—(పు) ౧ దేహల్యాం=గడప, ౨ వృక్షభేదే=మేడిచెట్టు, 3 పండకే=నపుంసకుఁడు, ౪ కుష్ఠభేదే = కుష్ఠవ్యాధి, (న) ౫ తామ్రే=రాగి. |
| ఉపహ్వరం సమీపే స్యాదేకాంతే చ నపుంసకం, | ఉపహ్వరం—(న) ౧ సమీపే=చెంత, ౨ ఏకాంతే=రహస్యము. |
| ఉద్దంతుర స్త్రిషూత్తుంగే కరాలోత్కటదంతయోః. | ఉదంతురః—(త్రి) ౧ ఉత్తుంగే = పొడవైనది, ౨ కరాల = భయంకరమైనది, 3 ఉత్కటదంతయోః=మిట్టపండ్లది. |
| ఉపకారశ్చోపకృతౌ వికీర్ణకుసుమాదిషు, | ఉపకారః—(పు) ౧ ఉపకృతౌ=ఉపకారము, ౨ వికీర్ణకుసుమాదిషు=చల్లఁబడినపుష్పములు మొదలయినవి. |
| ఔదుంబరః శ్రాద్ధదేవే రోగభేదే నపుంసకమ్. ౨౫౨ | ఔదుంబరః—(పు) ౧ శ్రాద్ధదేవే=యముఁడు, (న) ౨ రోగభేదే = రోగవిశేషము. |
| అథ కర్మకరో భృత్యే వేతనాజీవిని త్రిషు, కీనాశే పుంసి మూర్వాయాం బింబికాయామపి స్త్రియామ్. ౨౫3 | కర్మకరః—(త్రి) ౧ భృత్యే=పనివాఁడు, ౨ వేతనాజీవిని = కూలివాఁడు, (పు) 3 కీనాశే=జముఁడు, (స్త్రీ) ౪ మూర్వాయాం=చాఁగచెట్టు, ౫ బింబికాయాం=దొండతీఁగె. |
| కలికారస్తు ధూమ్యాటే కరంజే పీతమస్తకే, | కలికారః—(పు) ౧ ధూమ్యాటే = కూఁకటిమూఁగపిట్ట, ౨ కరంజే = నెమిలియడుగుచెట్టు, 3 పీతమస్తకే = పచ్చపిట్ట. |

| | |
|---|---|
| కర్ణికారః పుమానారగ్వధ ద్రౌ చ ద్రుమోత్పలే. | కర్ణికారః—(పు) ౧ ఆరగ్వధద్రౌ=రేల చెట్టు, ౨ ద్రుమోత్పలే=కొండగోఁగు చెట్టు. |
| కర్ణపూరశ్శిరీషే స్యాన్నీలోత్పలవతంసయోః, | కర్ణపూరః—(పు) ౧ శిరీషే = దిరిసెనపుఁజెట్టు, ౨ నీలోత్పల = నల్ల కలువ, 3 వతంసయోః = కర్ణాభరణము. |
| కరవీరః కృపాణే స్యాద్దైత్య భేదాశ్వమారయోః. ౨౫౫ కరవీర్యదితి శ్రేష్ఠ గవీపుత్ర వతీషు చ, | కరవీరః—(పు) ౧ కృపాణే=ఖడ్గము; ౨ దైత్యభేద=ఒకానొక రాక్షసుఁడు, 3 అశ్వమారయోః = గన్నేరుచెట్టు, కరవీరీ (స్త్రీ) ౪ అదితి=అదితి దేవి, ౫ శ్రేష్ఠగవీ=మంచియావు, ౬ పుత్రవతీషు = సంతానవంతురాలు. |
| కటంభరా ప్రసారణ్యాం రోహిణ్యాం గజయోషితి. ౨౫౬. కలంబికాయాం గోలాయాం వర్షాభూమూర్వయోరపి, | కటంభరా—(స్త్రీ) ౧ ప్రసారణ్యాం=గొంతెమగోరుచెట్టు, ౨ రోహిణ్యాం = కటుకరోహిణి, 3 గజయోషితి = ఆఁడేనుఁగు, ౪ కలంబికాయాం=తీఁగబచ్చలి, ౫ గోలాయాం=మణిశిల, ౬ వర్షాభూ=గలిజేరుచెట్టు, ౭ మూర్వయోః=చాగచెట్టు. |
| కాదంబరస్తు దధ్యగ్రే మద్య భేదే నపుంసకమ్. ౨౫౭. స్త్రీ వారుణీపరభృతాభారతీ శారికాసు చ, | కాదంబరః—(పు) ౧ దధ్యగ్రే = పెరుగు మీఁదితెట్ట, (న) ౨ మద్యభేదే=కడిమిపూఁదేనె, (స్త్రీ) 3 వారుణీ=కల్లు, ౪ పరభృతా=ఆఁడుకోకిల, ౫ భారతీ = సరస్వతి, ౬ శారికాసు = గోరువంక పిట్ట. |
| కాలంజరో యోగిచక్రమేలకే భైరవే గిరౌ. ౨౫౮ | కాలంజరః—(పు) ౧ యోగిచక్రమేలకే=యోగులసమూహముయొక్క చేరిక, ౨ భైరవే=ఈశ్వరుఁడు, 3 గిరౌ = పర్వతవిశేషము. |

| | |
|---|---|
| కుంభకారీ కులుత్థ్యాం చ పుంలింగో ఘటకారకే, | కుంభకారీ—(స్త్రీ) ౧ కులుత్థ్యాం = కులుత్థాంజనము, (పు) ౨ ఘటకారకే = కుమ్మరివాఁడు. |
| కృష్ణసారా శింశపాయాం పుంసి స్నుహ్యాం మృగాంతరే. ౨౫౯ | కృష్ణసారా—(స్త్రీ) ౧ శింశపాయాం = ఇరుగుడుచెట్టు, ౨ స్నుహ్యాం=జెముడుచెట్టు, (పు) 3 మృగాంతరే = నల్లయిఱ్ఱి. |
| గిరిసారః పుమాన్ లోహే వంగే మలయపర్వతే, | గిరిసారః—(పు) ౧ లోహే=యినుము, ౨ వంగే=తగరము, 3 మలయపర్వతే=మలయపర్వతము. |
| ఘనసారస్తు కర్పూరే దక్షిణావర్తపారదే. ౨౬౦ | ఘనసారః—(పు) ౧ కర్పూరే = కర్పూరము, ౨ దక్షిణావర్తపారదే = పాదరసవిశేషము. |
| చరాచరం వాచ్యలింగమింగే జగతి న ద్వయోః, | చరాచరం—(త్రి) ౧ ఇంగే=తిరుగునది, (న) ౨ జగతి=లోకము. |
| చర్మకారః పాదుకృతి స్త్రియాం చర్మకషౌషధౌ. | చర్మకారః—(పు) ౧ పాదుకృతి=గోఁడారివాఁడు, (స్త్రీ) ౨ చర్మకషౌషధౌ=సంబరేణిచెట్టు. |
| అథ చక్రధరోఽజేఽహౌ నా త్రిషు గ్రామజాలిని, | చక్రధరః—(పు) ౧ అజే = విష్ణువు, ౨ అహౌ=పాము,(త్రి) 3 గ్రామజాలిని=గ్రామసమూహాధిపతి. |
| చిత్రటీరో విధౌ ఫాలమంకితం యేన తత్ర చ. ౨౬౨. ఘంటాకర్ణోపహారాయ హతచ్ఛాగాస్రబిందుభిః, | చిత్రటీరః—(పు) ౧ విధౌ=చంద్రుఁడు, ౨ యేనఘంటాకర్ణోపహారాయహతచ్ఛాగాస్రబిందుభిఃఫాలమంకితంతత్ర చ = ప్రమథగణములోని ఘంటాకర్ణునికి బలియీయఁబడిన మేకనెత్తురు ముఖమునగలవాఁడు. |
| తాలపత్రం తు తాటంకే రండాయాం తాలపత్ర్యపి. | తాలపత్రం—(న) ౧ తాటంకే = చెవికమ్మ, ౨ రండాయాం = ఎలుకజీడిచెట్టు. |

| | |
|---|---|
| తుంగభద్రా నదీభేదే స్త్రియాం పుంసి మదోత్కటే, | తుంగభద్రా—(స్త్రీ) ౧ నదీభేదే = తుంగభద్రానది, (పు) ౨ మదోత్కటే = మదపుటేనుఁగు. |
| తుండికేరీ తు కార్పాస్యాం బింబికాయామపి స్త్రియాం. | తుండికేరీ—(స్త్రీ) ౧ కార్పాస్యాం=ప్రత్తి చెట్టు, ౨ బింబికాయాం = దొండ తీఁగె. |
| తులాధరస్తులారాశౌ పుంసి వాణిజకే త్రిషు, | తులాధరః—(పు) ౧ తులారాశౌ=తులారాశి, (త్రి) ౨ వాణిజకే= వర్తకము చేయువాఁడు. |
| అథ తోయధరో ముస్తా సునిషణ్ణౌషధీఘనే. ౨౯౫ | తోయధరః—(పు) ౧ ముస్తా = తుంగముస్తె, ౨ సునిషణ్ణౌషధీ=నీరుచెంచలిచెట్టు, 3 ఘనే= మేఘము. |
| దండయాత్రా దిగ్విజయే సంయానవరయాత్రయోః, | దండయాత్రా—(స్త్రీ) ౧ దిగ్విజయే=దిక్కులనుజయించుట, ౨ సంయాన=యుద్ధయాత్ర, 3 వరయాత్రయోః=వివాహోద్యుత్సవయాత్ర. |
| అథో దశపురం దేశే పురేఽపి స్యాన్నపుంసకమ్. | దశపురం—(న) ౧ దేశే= దేశవిశేషము, ౨ పురే=పట్టణము. |
| దండధరః పుమాన్ పృథ్వీనాథే ప్రేతాధిపేఽపి చ, | దండధరః—(పు) ౧ పృథ్వీనాథే=రాజు, ౨ ప్రేతాధిపే=యముఁడు. |
| దిగంబరస్స్యాత్క్షపణే నగ్నే తమసి శంకరే. ౨౯౬ | దిగంబరః—(పు) ౧ క్షపణే=క్షపణమతస్థుఁడు, ౨ నగ్నే = దిసమొలవాఁడు, 3 తమసి= చీఁకటి, ౪ శంకరే=ఈశ్వరుఁడు. |
| దురోదరం ద్యూతభేదే ద్యూతకృత్పణయోః పుమాన్, | దురోదరం—(న) ౧ ద్యూతభేదే=ద్యూతవిశేషము, (పు) ౨ ద్యూతకృత్ = జూదరి, 3 పణే=పందెము. |
| దేహయాత్రా యమపురీగమనే భోజనేఽపి చ. ౨౯౭ | దేహయాత్రా—(స్త్రీ) ౧ యమపురీగమనే = మరణము, ౨ భోజనే = ఆహారము. |

| | |
|---|---|
| ద్వైమాతురో జరాసంధ వారణాననయోః పుమాన్, | ద్వైమాతురః—(పు) ౧ జరాసంధ = జరాసంధుఁడనురాజు, ౨ వారణాననయోః=వినాయకుఁడు. |
| ధరాధరో హరౌ శైలే | ధరాధరః—(పు) ౧ హరౌ = విష్ణువు, ౨ శైలే=పర్వతము. |
| ధారాధరోఽసిమేఘయోః. | ధారాధరః—(పు) ౧ అసి = కత్తి, ౨ మేఘయోః= మేఘము. |
| ధారాంకురస్తు నాశీరే శీకరేఽపి ఘనోపలే, | ధారాంకురః—(పు) ౧ నాశీరే = సేనాముఖము, ౨ శీకరే = తుంపరలు, 3 ఘనోపలే = వడగండ్లు. |
| ధార్తరాష్ట్రోఽసితాస్యాంఘ్రి హంసే కౌరవసర్పయోః. | ధార్తరాష్ట్రః—(పు) ౧ అసితాస్యాంఘ్రి హంసే=నల్లనిముక్కు కాళ్లుగలహంస, ౨ కౌరవ = ధృతరాష్ట్రపుత్రులు, 3 సర్పయోః = ఒకానొకపాము. |
| ధుంధుమారశ్శక్రగోపే గృహధూమే పదాలికే, | ధుంధుమారః—(పు) ౧ శక్రగోపే = ఆరుద్రపురుగు, ౨ గృహధూమే = ఇంటిపొగ, 3 పదాలికే = చాలకాళ్లు గలజంతువు. |
| ధురంధరో ధవద్రౌ నా వాచ్యలింగస్తు ధూర్వహే. | ధురంధరః—(పు) ౧ ధవద్రౌ = చంద్రచెట్టు, (త్రి) ౨ ధూర్వహే = బరువు మోయునది. |
| ధృతరాష్ట్రస్సురాజ్ఞి స్యాన్నాగక్షత్రియభేదయోః, ధృతరాష్ట్రీ హంసపత్న్యాం | ధృతరాష్ట్రః—(పు) ౧ సురాజ్ఞి = మంచిరాజు, ౨ నాగ = సర్పవిశేషము, 3 క్షత్రియభేదయోః = ధృతరాష్ట్రుఁడు, ధృతరాష్ట్రీ (స్త్రీ) ౪ హంసపత్న్యాం = ఆఁడుహంస. |
| నభశ్చరో విహంగమే. ౨౭౨. విద్యాధరే ఘనే వాతే | నభశ్చరః—(పు) ౧ విహంగమే = పక్షి, ౨ విద్యాధరే = విద్యాధరుఁడనుదేవతాజాతి, 3 ఘనే = మేఘము, ౪ వాతే = వాయువు. |

నిశాచరస్తు రక్షసి, ఫేరుపేచక
సర్పేషు పాంశులాయాం
నిశాచరీ. ౨౭౩

నిశాచరః—(పు) ౧ రక్షసి=రాక్షసుఁడు, ౨ ఫేరు=నక్క, 3 పేచక=గుడ్లగూబ, ౪ సర్పేషు=పాము, నిశాచరీ (స్త్రీ) ౫ పాంసులాయాం = అంకుటాలు.

నిషద్వరస్తు జంబాలే నిశా
యాం తు నిషద్వరీ,

నిషద్వరః—(పు) ౧ జంబాలే = బురద, నిషద్వరీ (స్త్రీ) ౨ నిశాయాం=రాత్రి.

నీలాంబరః ప్రలంబఘ్నే కో
ణపే చ శనైశ్చరే. ౨౭౪

నీలాంబరః—(పు) ౧ ప్రలంబఘ్నే=బలరాముఁడు, ౨ కోణపే= రాక్షసుఁడు, 3 శనైశ్చరే=శని.

భవేత్పరికరస్సంఘే పర్యంక
పరివారయోః, ప్రగాఢ
గాత్రికాబంధే సమారంభ
వివేకయోః. ౨౭౫

పరికరః—(పు) ౧ సంఘే = గుంపు, ౨ పర్యంక=మంచము, 3 పరివారయోః= పరిజనము, ౪ ప్రగాఢగాత్రికాబంధే= ధట్టీకట్టు, ౫ సమారంభ=ప్రారంభము, ౬ వివేకయోః=తెలివి.

అథ పక్షచరశ్చంద్రే పృథ
క్చారిగజేఽపి చ,

పక్షచరః—(పు) ౧ చంద్రే=చంద్రుఁడు, ౨ పృథక్చారిగజే = ప్రత్యేకముగాఁ దిరుగుగజము.

భవేత్ప్రతిసరో మంత్రభేదే
మాల్యే చ కంకణే. ౨౭౬
వ్రణశుద్ధౌ చమూపృష్ఠే
పుంసి న స్త్రీ తు మండనే,
ఆరక్షే కరసూత్రే చ నియో
జ్యే త్వన్యలింగకః. ౨౭౭

ప్రతిసరః—(పు) ౧ మన్త్రభేదే=ప్రతిసరమంత్రము, ౨ మాల్యే=పుష్పమాలిక, 3 కంకణే=కడియము, ౪ వ్రణశుద్ధౌ= వ్రణపరిశోధన, ౫ చమూపృష్ఠే= సేన వెనుకభాగము, (స్త్రీ) ౬ మండనే = అలంకారము, ౭ ఆరక్షే = ఏనుఁగు కుంభముల క్రిందిచోటు, ౮ కరసూత్రే =చేతికిఁగట్టినతోరము,(త్రి) ౯ నియోజ్యే=నియోగింపఁదగినది.

భవేత్పరిసరో మృత్యౌ విధా
వపి చ పుంస్యయం

పరిసరః—(పు) ౧ మృత్యౌ = మృత్యువు, ౨ విధౌ=బ్రహ్మ, లేక శాసించుట.

పరంపరో మృగభేదే ప్రపౌ
త్రే తనయస్య చ. ౨౭౮.

పరంపరః—(పు) ౧ మృగభేదే=మృగవిశేషము, ౨ తనయస్య ప్రపౌత్రే = ముని

| | |
|---|---|
| పరంపరా పరిపాట్యాం హింసాసంతానయోరపి, | మనుమఁడు, (స్త్రీ) ౩ పరిపాట్యాం = క్రమము, ౪ హింసా=వధ, ౫ సంతానయోః = పుత్రపౌత్రాదిసంతానము. |
| పయోధరః కోషకారే నాళికేరే స్తనేఽపి చ. ౨౭౯. కశేరుమేఘయోః పుంసి | పయోధరః—(పు) ౧ కోషకారే= చెఱకు విశేషము, ౨ నాళికేరే = కొబ్బరికాయ, ౩ స్తనే=చన్ను, ౪ కశేరు = వెన్నెముక, ౫ మేఘయోః=మేఘము. |
| ప్రభాకరోఽగ్నిసూర్యయోః | ప్రభాకరః—(పు) ౧ అగ్ని = నిప్పు, ౨ సూర్యయోః=సూర్యుఁడు. |
| ప్రతీహారో ద్వారి ద్వాఃస్థే ద్వాఃస్థితాయాం తు యోషితి. ౨౮౦ | ప్రతీహారః—(పు) ౧ ద్వారి=ద్వారము, ౨ ద్వాఃస్థే = ద్వారపాలకుఁడు, (స్త్రీ) ౩ ద్వాఃస్థితాయాం = ద్వారపాలిక. |
| పరివారః పరిజనే ఖడ్గకోషే పరిచ్ఛదే, | పరివారః—(పు) ౧ పరిజనే = భృత్యులు, ౨ ఖడ్గకోశే=కత్తియొఱ, ౩ పరిచ్ఛదే= కప్పువస్త్రము. |
| పారావారస్సముద్రే నాతటద్వయే నపుంసకమ్. | పారావారః—(పు) ౧ సముద్రే = సముద్రము, (న) ౨ తటద్వయె = రెండు దరులు. |
| పాత్రటీరస్తు పుంలింగో యుక్తవ్యాపారమంత్రిణి, లోహకాంస్యరజత్పాత్రే సింహాణే పావకేఽపి చ. ౨౮౨ | పాత్రటీరః—(పు) ౧ యుక్తవ్యాపారమన్త్రిణి=ఉచితవ్యాపారముగలమంత్రి, ౨ లోహ= యినుపగిన్నె, ౩ కాంస్య= కంచుగిన్నె, ౪ రజత్పాత్రే = వెండిగిన్నె, ౫ సింహాణే = గాజుగిన్నియ, ౬ పావకే=అగ్ని. |
| పారిభద్రస్తు మందారే నింబద్రౌ దేవదారుణి, | పారిభద్రః—(పు) ౧ మందారే = కల్పవృక్షము, ౨ నింబద్రౌ = వేపచెట్టు, ౩ దేవదారుణి = దేవదారుచెట్టు. |
| పీతాంబరస్తు శైలూషే పుంసి కైటభసూదనే. ౨౮౩ | పీతాంబరః—(పు) ౧ శైలూషే=నటుఁడు ౨ కైటభసూదనే=విష్ణువు. |

పీతసారో మలయజే గోమేదకమణావపి,

పీతసారః—(పు) ౧ మలయజే = చందనము, ౨ గోమేదకమణౌ = గోమేదకమణి.

పూర్ణపాత్రం వస్తుపూర్ణపాత్రే వర్ధాపకేఽపి చ.

పూర్ణపాత్రం—(న) ౧ వస్తుపూర్ణపాత్రే= వస్తువుల చేనింపఁబడినపాత్ర, ౨ వర్ధాపకే = కొలఁతపాత్రము.

బలభద్రా త్రాయమాణాకుమార్యోః పుంసి సీరిణి,

బలభద్రా—(స్త్రీ) ౧ త్రాయమాణా = కలుకానుఁగుచెట్టు, ౨ కుమార్యోః= కలబంద, (పు) ౩ సీరిణి = బలరాముఁడు.

బ్రహ్మపుత్రః క్షేత్రభేదే నదభేదే చ పుంస్యయమ్.

బ్రహ్మపుత్రః—(పు) ౧ క్షేత్రభేదే = పుణ్యస్థలములలోనొకటి, ౨ నదభేదే= బ్రహ్మపుత్రమనునదము.

వక్రనక్రస్తు పిశునే తథైవ శుకపక్షిణి,

వక్రనక్రః—(పు) ౧ పిశునే = కొండెకాఁడు, ౨ శుకపక్షిణి=చిలుక.

బార్బటీరోఽరంగఆమ్రాస్థ్న్యంకురే గణికాసుతే. ౨౮౬

బార్బటీరః—(పు) ౧ రంగే=రంగస్థలము, ౨ ఆమ్రాస్థ్ని=మామిడిగింజ, ౩ అంకురే = మొలక, ౪ గణికాసుతే = భోగముదానికొడుకు.

వారకీరస్తు పుంసి స్యాద్వారగ్రాహిణి బాడబే, యూకాయాం వేణివేధన్యాం నీరాజితహయేఽపి చ. ౨౮౭

వారకీరః—(పు) ౧ వారగ్రాహిణి=వారగ్రాహకుఁడు, ౨ బాడబే=బడబాగ్ని, ౩ యూకాయాం = పేను, ౪ వేణివేధన్యాం = దువ్వెన, ౫ నీరాజితహయే = ఆరతియివ్వఁబడినగుఱ్ఱము.

విందుతంత్రః పుమాన్నారిఫలకే చ తురంగకే,

విందుతంత్రః—(పు) ౧ శారిఫలకే=సొగటాలబల్ల, ౨ తురంగకే=గుఱ్ఱము.

వీరభద్రోఽశ్వమేధాశ్వే వీరశ్రేష్ఠే చ వీరణే. ౨౮౮

వీరభద్రః—(పు) ౧ అశ్వమేధాశ్వే = అశ్వమేధయాగమందలిగుఱ్ఱము, ౨ వీరశ్రేష్ఠే=వీరాగ్రేసరుఁడు, ౩ వీరణే= అవురుకసవు.

స్యాద్వీరతరం వీరణే వీరశ్రేష్ఠే శరే చ నా,

వీరతరం—(న) ౧ వీరణే = అవురుగడ్డి, (పు) ౨ వీరశ్రేష్ఠే=శ్రేష్ఠమైనవీరుఁడు, 3 శరే=బాణము.

మహావీరస్తు గరుడే శూరే సింహే మఖానలే. ౨౮౯. వజ్రే శ్వేతతురంగే చ సంచానవిహగేఽపి చ,

మహావీరః—(పు) ౧ గరుడే = గరుత్మంతుఁడు, ౨ శూరే=వీరుఁడు, 3 సింహే =సింహము, ౪ మఖానలే=యజ్ఞాగ్ని, ౫ వజ్రే = వజ్రాయుధము, ౬ శ్వేతతురంగే=తెల్లనిగుఱ్ఱము, ౭ సంచానవిహగే=డేఁగ.

మహామాత్రస్సమృద్ధే చామాత్యే హస్తిపకాధిపే.

మహామాత్రః —(పు) ౧ సమృద్ధే = సంపన్నుఁడు, ౨ అమాత్యే = మంత్రి, 3 హస్తిపకాధిపే = మావటిదొర.

మణిచ్ఛిద్రా తు మేదాయామృషభాఖ్యౌషధేఽపి చ,

మణిచ్ఛిద్రా —(స్త్రీ) ౧ మేదాయాం = మేదయను గంధద్రవ్యము, ౨ ఋషభాఖ్యౌషధే = ఋషభమను నోషధి.

మహేశ్వరో మహాదేవే కథితోఽధీశ్వరేఽపి చ. ౨౯౧

మహేశ్వరః—(పు) ౧ మహాదేవే=ఈశ్వరుఁడు, ౨ అధీశ్వరే=ప్రభువు.

మృగనేత్రా రాత్రిభేదే విశేషే యోషితస్తథా,

మృగనేత్రా—(స్త్రీ) ౧ రాత్రిభేదే=మృగశిరానక్షత్రముతోఁగూడినరాత్రి, ౨ యోషితోవిశేషే = లేడికన్నులవంటి కన్నులుగలస్త్రీ.

రథకారస్తు మాహిష్యాత్కరణీజే చ తక్షణి, ౨౯౨

రథకారః—(పు) ౧ మాహిష్యాత్కరణీజే = మాహిష్యునివలనఁ కరణస్త్రీకిఁ బుట్టినవాఁడు, (మాహిష్యుఁడనఁగా క్షత్రియునికిని వైశ్యస్త్రీకిని బుట్టినవాఁడు, కరణస్త్రీయనఁగా వైశ్యునికిని శూద్రస్త్రీకిని బుట్టినది), ౨ తక్షణి= వడ్లవాఁడు.

| | |
|---|---|
| రాగసూత్రం తులాసూత్రే పట్టసూత్రే నపుంసకమ్, | రాగసూత్రం—(న) ౧ తులాసూత్రే = త్రాసుత్రాడు, ౨ పట్టసూత్రే = పట్టుదారము. |
| లంబోదరస్స్యాదుద్ధానే గణానామధిపేఽపి చ. ౨౯౩ | లంబోదరః—(పు) ౧ ఉద్ధానే=ప్రొయ్యి, ౨ గణానామధిపే=వినాయకుఁడు. |
| లక్ష్మీపుత్రస్తు పుంలింగః కామదేవే తురంగమే, | లక్ష్మీపుత్రః—(పు) ౧ కామదేవే = మన్మథుఁడు, ౨ తురంగమే=గుఱ్ఱము. |
| వ్యవహారో ద్రుభేదే స్యాన్న్యాయేఽపి చ పణే స్థితౌ. | వ్యవహారః—(పు) ౧ ద్రుభేదే=వృక్షవిశేషము, ౨ న్యాయే = న్యాయము, ౩ పణే=జూదము, ౪ స్థితౌ=ఉనికి. |
| అథ వ్యతికరః పుంసి వ్యసనవ్యతిషంగయోః, | వ్యతికరః—(పు) ౧ వ్యసన=దుఃఖము, ౨ వ్యతిషంగయోః=సంబంధము. |
| వాతపుత్రో మహాధూర్తే భీమసేనే హనూమతి. ౨౯౪ | వాతపుత్రః—(పు) ౧ మహాధూర్తే = మిక్కిలికపటుఁడు, ౨ భీమసేనే = భీముఁడు, ౩ హనూమతి=హనుమంతుఁడు. |
| విశ్వంభరోఽచ్యుతే శక్రే పుంసి విశ్వంభరా భువి, | విశ్వంభరః—(పు) ౧ అచ్యుతే = విష్ణువు, ౨ శక్రే=ఇంద్రుఁడు, (స్త్రీ) ౩ భువి = భూమి. |
| విశ్వకద్రుస్త్రిషు ఖలే ధ్వానే ఖేటశునోః పుమాన్. | విశ్వకద్రుః—(త్రి) ౧ ఖలే=దుర్మార్గుఁడు, ౨ ధ్వాన=ధ్వని, ౩ ఆఖేటశునోః = వేటకుక్క. |
| విభావరీ నిశారాత్ర్యోః కుట్టన్యాం వక్రయోషితి, వివాదవస్త్రగుంఠ్యాం చ | విభావరీ—(స్త్రీ) ౧ నిశా = పసుపు, ౨ రాత్ర్యోః = రాత్రి, ౩ కుట్టన్యాం = = తార్పుడుకత్తె, ౪ వక్రయోషితి = కుటిలవనిత, ౫ వివాదవస్త్రగుంఠ్యాం=వివాదసమయమున వేసికొన్న ముసుకు. |
| విభాకరోఽగ్నిసూర్యయోః. | విభాకరః—(పు) ౧ అగ్ని=అగ్ని, ౨ సూర్యయోః=సూర్యుఁడు. |

| | |
|---|---|
| వీతిహోత్రోఽనలేఽర్కే చ | వీతిహోత్రః—(పు) ౧ అనలే=అగ్ని, ౨ అర్కే=సూర్యుఁడు. |
| శతపత్రశ్శిఖండిని, దార్వాఘాటే సారసే చ కమలే తు నపుంసకమ్. ౨౯౯ | శతపత్రః—(పు) ౧ శిఖండిని=నెమిలి, ౨ దార్వాఘాటే=వడ్రంగిపిట్ట, 3 సారసే=బెగ్గురుపక్షి, (న) ౪ కమలే=పద్మము. |
| శతావరీ తు శట్యాంస్యాదిందీవర్యామపి స్త్రియామ్, | శతావరీ—(స్త్రీ) ౧ శట్యాం = గండ్లకచోరము, ౨ ఇందీవర్యాం = పిల్లిపీఁచర. |
| శిశుమారోఽంబుసంభూతజంతౌ తారాత్మకాచ్యుతే. | శిశుమారః—(పు) ౧ అంబుసంభూతజంతౌ = నీటియందుఁబుట్టినజంతువిశేషము, ౨ తారాత్మకాచ్యుతే = శింశుమారచక్రము. |
| భవేత్సహచరో ఝింట్యాం ద్వయోరనుచరే త్రిషు, | సహచరః—(పు) ౧ ఝింట్యాం = ములుగోరింట, (త్రి) ౨ అనుచరే = వెంటఁదిరుగువాఁడు. |
| సముద్రారుః పుమాన్గ్రాహే సేతుబంధే తిమింగిలే. ౩౦౦ | సముద్రారుః—(పు) ౧ గ్రాహే=మొసలి, ౨ సేతుబంధే=కట్ట, 3 తిమింగిలే = తిమింగిలమనుచేప |
| సంప్రహారో గతౌ యుద్ధే | సంప్రహారః—(పు) ౧ గతౌ=గమనము, ౨ యుద్ధే=యుద్ధము. |
| స్థిరదంష్ట్రో భుజంగమే, వరాహాకృతివిష్ణౌ చ | స్థిరదంష్ట్రః—(పు) ౧ భుజంగమే=పాము, ౨ వరాహాకృతివిష్ణౌ=ఆదివరాహము. |
| సుకుమారో మృదౌ త్రిషు. ౩౦౧. పుంసి పుండ్రాభిధానేక్షౌ | సుకుమారః—(త్రి) ౧ మృదౌ=మృదువైనది, ౨ పుండ్రాభిధానేక్షౌ=తెల్లచెఱుకు. |
| సూత్రధారశ్శచీపతౌ, నాంద్యంతరసంచారిపాత్రశిల్పిప్రభేదయోః ౩౦౨ | సూత్రధారః—(పు) ౧ శచీపతౌ = ఇంద్రుఁడు, ౨ నాంద్యంతరసంచారీపాత్ర=సూత్రధారుఁడు, 3 శిల్పిప్రభేదయోః=వడ్రంగి. |

## ర పంచకం. — అయిదక్షరములుగల రకారాంత శబ్దములు.

తమాలపత్త్రం తాపింఛే తిలకే పత్త్రకేఽపి చ,

తమాలపత్త్రం—(న) ౧ తాపింఛే=చీఁకటిమ్రాను, ౨ తిలకే=బొట్టు, ౩ పత్త్రకే=మకరికాదిపత్త్రము.

తాలీశపత్త్రం భూమ్యామలకీతాలీశయోః స్మృతమ్.

తాలీశపత్త్రం—(న) ౧ భూమ్యామలకే=నేలయుసిరికచెట్టు, ౨ తాలీశయోః=తాలిసపత్త్రి.

స్యాత్పాంశుచామరః పుంసి దూర్వాంచితతటీభువి, వర్ధాపకే ప్రశంసాయాం పురోటౌ ధూలిగుచ్ఛకే ౩౦౪

పాంశుచామరః—(పు) ౧ దూర్వాంచితతటీభువి = గఱికగలయొడ్డు, ౨ వర్ధాపకే = నాడీచ్ఛేదకుఁడు, ౩ ప్రశంసాయాం=స్తోత్రము, ౪ పురోటౌ=ఆకులచప్పుడు, ౫ ధూళిగుచ్ఛకే = బుక్కాలోని భేదము.

స్యాత్పాదచత్వరశ్ఛాగే సైకతే పిప్పలేఽపి చ, కరకేపరదోషైకప్రవక్తృపురుషేఽపి చ. ౩౦౫

పాదచత్వరః—(పు) ౧ ఛాగే=మేఁక, ౨ సైకతే=ఇసుకతిన్నె, ౩ పిప్పలే=రావిచెట్టు, ౪ కరకే=వడగల్లు, ౫ పరదోషైకప్రవక్తృపురుషే = పరులయందు నిందమోపువాఁడు.

పీతకావేరమిత్యేతత్కుంకుమే పిత్తలేఽపి చ,

పీతకావేరం—(న) ౧ కుంకుమే=కుంకుమ ౨ పిత్తలే=ఇత్తడి.

స్యాద్రాజబదరం రక్తామలకే లవణేఽపి చ. ౩౦౬

రాజబదరం—(న) ౧ రక్తామలకే=రాచయుసిరిక, ౨ లవణే=ఉప్పు.

వస్వోకసారేంద్రపురే కుబేరనగరీపురోః,

వస్వోకసారా—(పు) ౧ ఇంద్రపురే=అమరావతీపట్టణము, ౨ కుబేరనళినీ = కుబేరునినది, ౩ పురోః = కుబేరునిపట్టణము.

విప్రతీసార ఉద్దిష్టః కౌకృత్యేఽనుశయే రుషి. ౩౦౭

విప్రతీసారః—(పు) ౧ కౌకృత్యే=అయుక్తకార్యము, ౨ అనుశయే = పశ్చాత్తాపము, ౩ రుషికోపము.

| | |
|---|---|
| భవేత్సమభిహారస్తు పౌనః పున్యభృశార్థయోః, | సమభిహారః—(పు) ౧ పౌనపున్యే=పలుమాఱు, ౨ భృశార్థయోః=మిక్కిలి. |
| సర్వతోభద్రఇత్యుక్తఃకావ్య చిత్రే గృహాంతరే. ౩౦౮. నింబే నా సర్వతోభద్రా గంభారీనటయోషితోః. | సర్వతోభద్రః—(పు) ౧ కావ్యచిత్రే = సర్వతోభద్రమనెడి చిత్రకావ్యము, ౨ గృహాంతరే=నాలుగుద్వారములుగలయిల్లు, ౩ నింబే = వేపచెట్టు, (స్త్రీ) ౪ గంభారీ=గుమ్మడిచెట్టు, ౫ నటయోషితోః=నాట్యస్త్రీ. |
| ఇతి రాంతవర్గః. | ఇది రాంతవర్గము. |
| లైకమ్. | ఏకాక్షర లశబ్దములు. |
| లశ్శక్రే లా తు దానే స్యాత్ గ్రహణేఽపి నిగద్యతే, | లః—(పు) ౧ శక్రే=ఇంద్రుఁడు, (స్త్రీ) ౨ దానే=దానము, ౩ గ్రహణే = పట్టుకొనుట. |
| లీ శ్లేషణే చ చపలే | లీ—(స్త్రీ) ౧ శ్లేషణే=కలియుట, ౨ చపలే=చంచలమైనది |
| గ్లౌర్ధరణ్యాం నిశాపతౌ. ౧ | గ్లౌః—(పు) ౧ ధరణ్యాం = భూమి, ౨ నిశాపతౌ=చంద్రుఁడు. |
| ల ద్వికం. | రెండక్షరములుగల లకారాంత శబ్దములు. |
| అమ్లో రసస్య భేదే స్యాదమ్లీ చాంగేరికౌషధౌ, | అమ్లః—(పు) ౧ రసస్యభేదే=పులుపు. అమ్లీ—(స్త్రీ) ౧ చాంగేరికౌషధౌ=పులిచింతచెట్టు. |
| అలిస్సురాపుష్పలిహోః పుం | అలిః—(పు) ౧ సురా = కల్లు, ౨ పుష్పలిహోః=తుమ్మెద. |
| స్యాలిర్విశదాశయే. ౨. త్రిషు స్త్రియాం వయస్యాయాం సేతౌ పంక్తౌ చ కీర్తితా, | ఆలిః—(త్రి) ౧ విశదాశయే = నిశ్చలచిత్తుఁడు, (స్త్రీ) ౨ వయస్యాయాం=చెలికత్తె, ౩ సేతౌ = కట్టు, ౪ పంక్తౌ = వరుస. |

ఆలుర్గలంతికాయాం స్త్రీ క్లీబం మూలే చ ఖేలకే. ౩

ఆలుః—(స్త్రీ) ౧ గలంతికాయాం = గిరిక పిడత, (న) ౨ మూలే = గెనుసుగడ్డ, ౩ ఖేలకే=పడవ.

ఇలా కలత్రే సౌమ్యస్య ధరిత్ర్యాం గవి వాచి చ,

ఇలా—(స్త్రీ) ౧ సౌమ్యస్యకళత్రే= బుధుని భార్య, ౨ ధరిత్ర్యాం = భూమి, ౩ గవి=గోవు, ౪ వాచి=వాక్కు.

ఓల్లస్తు శూరణే పుంసి స్యాదార్ద్రే వాచ్యలింగకః ౪

ఓల్లః—(పు) ౧ శూరణే = కంద, (త్రి) ౨ ఆర్ద్రే=తడిసినది.

కలా స్యాన్మూలరైవృద్ధౌ శిల్పాదావంశమాత్రకే, షోడశాంశే చ చంద్రస్య కలనాకాలమానయోః ౫ కలం శుక్రే త్రిష్వజీర్ణే నావ్యక్తమధురధ్వనౌ,

కలా—(స్త్రీ) ౧ మూలరైవృద్ధౌ=మూలధనమువడ్డి, ౨ శిల్పాదౌ = శిల్పాది కళలు, ౩ అంశమాత్రకే = భాగము, ౪ చంద్రస్యషోడశాంశే = చంద్రునిలోఁ బదియాఱవభాగము, ౫ కలనా = పొందుట, ౬ కాలమానయోః = ముప్పది కాష్ఠల కాలము, (న) ౭ శుక్రే = రేతస్సు, (త్రి) ౮ అజీర్ణే = జీర్ణముకానిది, (పు) ౯ అవ్యక్తమధురధ్వనౌ = అస్పష్టమధురధ్వని.

కలిః స్త్రీ కలికాయాం నా శూరాజికలహే యుగే. ౬

కలిః—(స్త్రీ) ౧ కలికాయాం=కళ్లెము, ౨ శూర=శూరుఁడు, ౩ ఆజి=యుద్ధము, ౪ కలహే = కలహము, ౫ యుగే = కలియుగము.

కాలో మృత్యౌ మహాకాలే సమయే యమకృష్ణయోః, కాలా తు కృష్ణత్రివృతా మంజిష్ఠానీలినీషు చ. ౭

కాలః—(పు) ౧ మృత్యౌ = మృత్యువు, ౨ మహాకాలే= ఈశ్వరుఁడు, ౩ సమయే= కాలము, ౪ యమ = జముఁడు, ౫ కృష్ణయోః=నలుపు, (స్త్రీ) ౬ కృష్ణత్రివృతా = నల్లతెగడచెట్టు, ౭ మంజిష్ఠా=మంజిష్ఠచెట్టు, ౮ నీలినీషు = నీలిచెట్టు.

కాలీ గౌర్యాం క్షీరకీటే కాలికామాతృభేదయోః,

కాలీ—(స్త్రీ) ౧ గౌర్యాం = పార్వతి, ౨ క్షీరకీటే = పాలయందుఁబుట్టినపురుగు, ౩ కాలికా=మేఘపంక్తి, ౪ మాతృభేదయోః = సప్తమాతృకలలోనొకతి.

కీలో లేశే ద్వయోః స్తంభజ్వాలాకఫోణిశంకుషు. ౮

కీలః—(పు) ౧ లేశే = కొంచము, ౨ స్తంభ=కంబము, ౩ జ్వాల = అగ్నిశిఖ, ౪ కఫోణి=మోఁచెయ్యి, ౫ శంకుషు=మేకు.

కులం జనపదే గోత్రే సజాతీయగణేష్వపి, భవనే చ తనౌ క్లీబం కంటకార్యౌషధౌ కులీ. ౯

కులం—(న) ౧ జనపదే=ఊరు, ౨ గోత్రే =వంశము, ౩ సజాతీయగణేషు=తెగ, ౪ భవనే = గృహము, ౫ తనౌ=శరీరము, కులీ (స్త్రీ) ౬ కంటకార్యౌషధౌ=వాకుడుచెట్టు.

అథ కూలం తటే స్తూపే సైన్యపృష్ఠతడాగయోః,

కూలం—(స్త్రీ) ౧ తటే=దరి, ౨ స్తూపే = దిబ్బ, ౩ సైన్యపృష్ఠ = సైన్యము వెనుకటిభాగము, ౪ తటాకయోః = చెఱువు.

కోలం కోలిఫలే క్లీబం పిప్పలీచవ్యయోః స్త్రియామ్. ౧౦. నాంకపాలౌ శనౌ చిత్రే వరాహోత్సంగభేలకే,

కోలం—(న) ౧ కోలిఫలే= రేగుఁబండు, (స్త్రీ) ౨ పిప్పలీ=పిప్పలితీఁగె, ౩ చవ్యయోః = చవ్యమనుగ్రంధ్యము, (పు) ౪ అంకపాలౌ=కౌఁగిలి, ౫ శనౌ=శనిగ్రహము, ౬ చిత్రే = చిత్తరువు, ౭ వరాహ = పంది, ౮ ఉత్సంగ=తొడ (ఒడి), ౯ భేలకే=తెప్ప.

ఖలం భూస్థానకల్కేషు నీచక్రూరాధమే త్రిషు. ౧౧

ఖలం—(న) ౧ భూ=భూమి, ౨ స్థాన = నివాసము, ౩ కల్కేషు = పాపము, (త్రి) ౪ నీచ=నీచుఁడు, ౫ క్రూర = క్రూరుఁడు, ౬ అధమే=అల్పుఁడు.

ఖల్లో వస్త్రప్రభేదే స్యాద్గర్తే చర్మణి చాతకే, ఖల్లీ

ఖల్లః—(పు) ౧ వస్త్రప్రభేదే = వస్త్రవిశేషము, ౨ గర్తే=గుంట, ౩ చర్మణి =

| | |
|---|---|
| తు హ_స్తపాదావమర్దనాఖ్య రుజి స్త్రియామ్. ౧౨ | తోలు, ౪ చాతకే=చాతకపక్షి, ఖల్లీ (స్త్రీ) ౫ హ_స్తపాదావమర్దనాఖ్యారుచి=రోగవిశేషము. |
| ఖలమప్రహతే క్లీబం సార సంక్షిప్తవేధసి, | ఖలం—(న) ౧ అప్రహతే = దున్నని భూమి, ౨ సార = సారము, 3 సంక్షి_ప్త=సంక్షేపము, ౪ వేధసి=బ్రహ్మ. |
| గల స్సర్జరసే కంఠే | గలః—(పు) ౧ సర్జరసే = సజ్జరసము, ౨ కంఠే=కంఠము. |
| గుల స్స్యాద్వైక్షవే పుమాన్. ౧3. గులీ తు గుటికారోగ భిదోః స్నుహ్యాం గులా స్మృతా | గులః—(పు) ౧ ఐక్షవే = చెఱకుపానకము, గులీ (స్త్రీ) ౨ గుటికా = గోళి, 3 రోగభిదోః=రోగభేదము, (స్త్రీ) ౪ ౪ స్నుహ్యాం=జెముడుచెట్టు. |
| గోలా గోదావరీసఖ్యోఃకునటీ దుర్గయోః స్త్రియామ్. ౧౪ పత్రాంజనే మండలే చాలింజరే బాలఖేలనే, | గోలా—(స్త్రీ) ౧ గోదావరీ=గోదావరీనది, ౨ సఖ్యోః=చెలికత్తె, 3 కునటీ=మణిసిల, ౪ దుర్గయోః = పార్వతీదేవి. ౫ పత్రాంజనే=సిరా, ౬ మండలే=గోలకము, ౭ అలింజరే=కాఁగు, ౮ బాలఖేలనే=పిల్లలయాట. |
| చలా లక్ష్మ్యాం పుమాన్ కంపే కంపయు_క్తేఽభిధేయవత్. | చలా—(స్త్రీ) ౧ లక్ష్మ్యాం=లక్ష్మి, (పు) ౨ కంపే= వణకు, (త్రి) 3 కంపయు_క్తే=చలించునది. |
| చిల్లః పుమాన్ క్లిన్ననేత్రే క్లిన్నాక్షేఽప్యభిధేయవత్, ఆతతాయిని సంప్రో_క్త శ్చిల్లీ స్యాత్ క్షుద్రవా_స్తుకే.౧౬ | చిల్లః—(పు) ౧ క్లిన్ననేత్రే = తడికన్ను, (త్రి) ౨ క్లిన్నాక్షే = తడికన్నుకలవాఁడు, 3 ఆతతాయిని = చంపుటకు సిద్ధమైనవాఁడు, చిల్లీ, (స్త్రీ) ౪ క్షుద్రవా_స్తుకే=చిన్నచక్రవ_ర్తికూర. |
| చుల్లీ చితాయాముద్ధానే | చుల్లీ—(స్త్రీ) ౧ చితాయాం = సోద, ౨ ఉద్ధానే=పొయ్యి. |
| చేలోఽధమే త్రిషు, నపుంసకం తు వసనే | చేలః—(త్రి) ౧ అధమే = నీచము, (న) ౨ వసనే=వస్త్రము. |

| | |
|---|---|
| ఛలం స్ఖలితశాఠ్యయోః. ౧౭ | ఛలం—(న) ౧ స్ఖలిత=వెనుదీయుట, ౨ శాఠ్యయోః=కపటము. |
| ఛల్లీ వీరుధి సంతానే వల్కలే కుసుమాంతరే, | ఛల్లీ—(స్త్రీ) ౧ వీరుధి=తీఁగె, ౨ సంతానే = కల్పవృక్షము, 3 వల్కలే=నారచీర, ౪ కుసుమాంతరే = పుష్పవిశేషము. |
| జలం గోకలనే నీరే హ్రీబేరేఽప్యన్యవజ్జడే. ౧౮ | జలం—(న) ౧ గోకలనే = ఆకారముగా నేర్పడిన గోగర్భస్థపిండము, ౨ నీరే= ఉదకము, 3 హ్రీబేరే = కురువేరు, ౪ జడే=మందుఁడు. |
| జాలం గవాక్ష ఆనాయే క్షారకే దంభవృందయోః, జాలో నీపద్రుమే జాలీ పటోలికౌషధౌ స్త్రియామ్.౧౯ | జాలం—(న) ౧ గవాక్షే = కిటికీ, ౨ ఆనాయే=వల, 3 క్షారకే = మొగ్గ, ౪ దంభ=కపటము, ౫ బృందయోః = గుంపు, (పు) ౬ నీపద్రుమే = కడిమిచెట్టు, జాలీ. (స్త్రీ) ౭ పటోలికౌషధౌ= పొట్లచెట్టు. |
| ఝలా స్యాదాతపస్యోర్త్స్నా దుహితర్యపి చ స్త్రియామ్ | ఝలా—(స్త్రీ) ౧ ఆతపస్యోర్త్స్నా = ఎండవేడిమి, ౨ దుహితరి=కుమార్తె. |
| ఝిల్లీ చీర్యాతపరుచోర్వర్త్యాముద్వర్తనాంశుకే. ౨౦ | ఝిల్లీ—(స్త్రీ) ౧ చీరీ=ఈలపురుగు, ౨ ఆతపరుచోః=ఎండకాంతి, 3 వర్త్యాం = వత్తి, ౪ ఉద్వర్తనాంశుకే = తుడిచెడి గుడ్డ. |
| తలం స్వరూపేఽనూర్ధ్వేఽస్త్రీ క్లీబం జ్యాఘాతవారణే, కాననే కార్యబీజే చ పుంసి తాలమహీరుహే. ౨౧ చపేటే చ త్సరౌ తంత్రీఘాతే సవ్యేన పాణినా, | తలం—(వ్న) ౧ స్వరూపే=స్వరూపము, ౨ అనూర్ధ్వే=క్రిందిభాగము, (న) 3 జ్యాఘాతవారణే = నారిదెబ్బ తగులకుండఁ జేతికిఁ దొడికికొను చర్మము, ౪ కాననే=అరణ్యము, ౫ కార్యబీజే= హేతువు, (పు) ౬ తాలమహీరుహే= తాటిచెట్టు, ౭ చపేటే = చెంపదెబ్బ, ౮ త్సరౌ=కత్తిపిడి, ౯ సవ్యేనపాణినా |

తంత్రీఘాతే = ఎడమచేతితో దంతి మీటుట.

తల్లీ తరుణ్యాం తల్లస్తు జలాధారాంతరే పుమాన్. ౨౨

తల్లీ—(స్త్రీ) ౧ తరుణ్యాం = స్త్రీ, (పు) ౨ జలాధారాంతరే=మడుగు.

తాలః కరతలేఽంగుష్ఠమధ్యమాభ్యాం చ సమ్మితే, గీతకాలక్రియామానే కరాస్ఫాలే ద్రుమాంతరే. ౨౩. వాద్యభాండే చ కాంస్యస్య త్సరౌ తాలీ జటౌషధౌ, క్లీబం తు హారితాలే స్యా

తాలః—(పు) ౧ కరతలే=అరచేయి, ౨ అంగుష్ఠమధ్యమాభ్యాం సమ్మితే = చాచఁబడిన మధ్యమాంగుష్ఠములచే గొలవఁబడినకొలఁత, 3 గీతకాలక్రియామానే = ఆటాదితాళములు, ౪ కరాస్ఫాలే = చేతులు తట్టుట, ౫ ద్రుమాంతరే = తాటిచెట్టు, ౬ కాంస్యస్యవాద్యభాండే = కంచుతాళములు, ౭ త్సరౌ=కత్తిపిడి; తాలీ (స్త్రీ) ౮ జటౌషధౌ = జటామాంసిచెట్టు, (న) ౯ హారితాలే = హరిదళము.

త్తులా సాదృశ్యమానయోః. ౨౪. గృహాణాం దారుబంధాయ పీఠికాయామపీష్యతే, రాశౌ పలశతే భాండే

తులా—(స్త్రీ) ౧ సాదృశ్యే=సామ్యము, ౨ మానయోః=త్రాసు, 3 గృహాణాం దారుబంధాయపీఠికాయాం = ఇంటికి వేసెడు తులావాసము, (దూలము) ౪ రాశౌ=తులారాశి, ౫ పలశతే = నూరుపలములుపరిమాణము, ౬ భాండే=కుండ.

తూలం స్యాద్బ్రహ్మదారుణి. ౨౫. ఆకాశేఽథ పిచౌ న స్త్రీ

తూలం—(న) ౧ బ్రహ్మదారుణి = గంగరావిచెట్టు, ౨ ఆకాశే = ఆకసము, (పు) 3 పిచౌ=దూది.

దలముత్సేధఖండయోః, శస్త్రీఛదేఽప్యద్రవ్యే పత్రేఽ

దలం—(న) ౧ ఉత్సేధ = పొడవు, ౨ ఖండయోః=ముక్క, 3 శస్త్రీఛదే = చురకత్తియొఱ, ౪ అపద్రవ్యే = చెడుపదార్థము, ౫ పత్రే=ఆకు.

పృథ దులిః స్త్రియామ్..౨౬. కమఠ్యాం నా మునౌ

దులిః—(స్త్రీ) ౧ కమఠ్యాం = ఆఁడుతాఁబేలు, (పు) ౨ మునౌ=మునివిశేషము.

దోలా నీల్యాం యానాంతరేఽపి చ,

దోలా—(స్త్రీ) ౧ నీల్యాం = నీలిచెట్టు, ౨ యానాంతరే=ఉయ్యాల.

నలః పోటగలే రాజ్ఞి పితృదేవే కపీశ్వరే. ౨౭. కమలేఽపి కునట్యాం చ క్రమేణ క్లీబయోషితోః,

నలః—(పు) ౧ పోటగలే = కిక్కసగడ్డి, ౨ రాజ్ఞి=నలమహారాజు, 3 పితృదేవే=యముఁడు, ౪ కపీశ్వరే = నలుఁడను వానరుఁడు, (న) ౫ కమలే=పద్మము, (స్త్రీ) ౬ కునట్యాం=మణిసిల.

నాలా న నా పద్మదండే నాలీ శాకకడంబకే. ౨౮

నాలా—(స్న) ౧పద్మదండే=తామరకాడ, నాలీ (స్త్రీ) ౨ శాకకదంబకే = తీఁగెబచ్చలి.

నీలం తు నీలరక్తే నా నిధ్యద్రివానరాంతరే, నీలీ రుగ్భేదనీలినోః

నీలం—(న) ౧ నీలరక్తే = నలపుగలిసిన యెఱుపు, ౨ నిధి = నీలమనునిధి, 3 అద్రి=నీలపర్వతము, ౪ వానరాంతరే = నీలుఁడనువానరుఁడు, నీలీ (స్త్రీ) ౫ రుగ్భేద=రోగవిశేషము, ౬ నీలినోః=నీలిచెట్టు.

పలమున్మానమాంసయోః ౨౯

పలం—(న) ౧ ఉన్మాన=నాలుగుకర్షముల పరిమాణము, ౨ మాంసయోః = మాంసము.

పల్ల్యల్పగ్రామకుట్యోః స్త్రీ పల్లః స్థూలకుసూలకే,

పల్లీ—(స్త్రీ) ౧ అల్పగ్రామ=చిన్నయూరు, ౨ కుట్యోః=గుడిసె, (పు) 3 స్థూలకుసూలకే=పెద్దగాదె.

పాలిః కర్ణలతాగ్రేఽశ్రౌ పంక్త్వావంకప్రభేదయోః. 3౦. ఛాత్రాదిదేయే స్త్రీ

పాలిః—(స్త్రీ) ౧ కర్ణలతాగ్రే = చెవితమ్మె, ౨ అశ్రౌ = అంచు, 3 పంక్తౌ = వరుస, ౪ అంకప్రభేదయోః=ఒడి, ౫ ఛాత్రాదిదేయే = శిష్యాదులకీయఁదగినది.

| | |
|---|---|
| పాలీ యూకాస్త్రశ్మశ్రుయోషితోః, | పాలీ—(స్త్రీ) ౧ యూకా = పేను, ౨ స్త్రశ్మశ్రుయోషితోః = మీసములుగల యాఁడుది |
| పిల్లః పుమాన్ క్లిన్ననేత్రే క్లిన్నాక్షే పునరన్యవత్. | పిల్లః—(పు) ౧ క్లిన్ననేత్రే = తడికన్ను, (త్రి) ౨ క్లిన్నాక్షే = తడికండ్లుకలవాఁడు. |
| పీలుః పుమాన్ ప్రసూనే స్యాత్పరమాణౌ మతంగజే, అస్థిఖండే చ తాలస్య కాండపాదపభేదయోః. 3౨ | పీలుః—(పు) ౧ ప్రసూనే = పువ్వు, ౨ పరమాణౌ = పరమాణువు, 3 మతంగజే = ఏనుఁగు, ౪ తాలస్యాస్థిఖండే = తాటిచెక్క, ౫ కాండ=బాణము, ౬ పాదపభేదయోః = గోలుగుచెట్టు. |
| పులస్స్యాత్పులకే పుంసి విపులేఽప్యన్యలింగకః, | పులః—(పు) ౧ పులకే = గగుర్పాటు, (త్రి) ౨ విపులే=వెడల్పైనది. |
| ఫలం జాతీఫలే సస్యే హేతూత్థే వ్యుష్టిలాభయోః. 33. త్రిఫలాయాం చ కక్కోలే ప్రియంగౌ తు ఫలీ స్మృతా, | ఫలం—(న) ౧ జాతీఫలే = జాజికాయ ౨ సస్యే = పైరు, 3 హేతూత్థే = హేతువువలనఁబుట్టిన ప్రయోజనము, ౪ వ్యుష్టి=సమృద్ధి, ౫ లాభయోః = లాభము, ౬ త్రిఫలాయాం = కరకతాడియుసిరికలు, ౭ కక్కోలే=తక్కోలఫలము. ఫలీ (స్త్రీ) ౮ ప్రియంగౌ = ప్రేంకణపుఁజెట్టు. |
| ఫాలః పుంసి మహాదేవే కాళిందీభేదనేఽపి చ. 3౪. క్లీబం సీరోపకరణే త్రిషు కార్పాసవాససి, | ఫాలః—(పు) ౧ మహాదేవే = శంకరుఁడు, ౨ కాళిందీభేదనే = బలరాముఁడు, (న) 3 సీరోపకరణే=నాఁగటికఱ్ఱు, (త్రి) ౪ కార్పాసవాససి=నూలుగుడ్డ. |
| బలిర్దైత్యప్రభేదే చ కరచామరదండయోః. 3౫. ఉపహారే పుమాన్ స్త్రీ తు | బలిః—(పు) ౧ దైత్యప్రభేదే=బలిచక్రవర్తి, ౨ కర = పన్ను, 3 చామరదండయోః = వింజామరయొక్కకఱ్ఱ, ౪ |

జరయా శ్లథచర్మణి, గృహ
దారుప్రభేదే చ జఠరావ
యవేఽపి చ. ౩౬

ఉపహారే = పూజాద్రవ్యము, (స్త్రీ) ౫ జరయాశ్లథచర్మణి = ముసలితనముచే ముడుతలుపడినచర్మము, ౬ గృహదారుప్రభేదే=ఇంటిలోని యొకానొక కొయ్య, ౭ జఠరావయవే = పొట్ట మీఁదిముడుతలు.

బలం గంధరసే రూపే స్థామని
స్థౌల్యసైన్యయోః, పుమాన్
హలాయుధే దైత్యప్రభేదే
వాయసేఽపి చ. ౩౭. బల
యుక్తేఽన్యలింగస్స్యాద్వా
ట్యాలకే తు యోషితి,

బలం—(న) ౧ గంధరసే=బాలింతబోలు, ౨ రూపే = రూపము, ౩ స్థామని = సత్తువ, ౪ స్థౌల్యే = లావు, ౫ సైన్యయోః=సేన, (పు) ౬ హలాయుధే = బలరాముఁడు, ౭ దైత్యప్రభేదే = బలాసురుఁడు, ౮ వాయసే=కాకి, (త్రి) ౯ బలయుక్తే = బలముకలవాఁడు, (స్త్రీ) ౧౦ వాట్యాలకే=ముత్తవపులగ చెట్టు.

వల్లీ స్యాదజమోదాయాం
వ్రతత్యామపి యోషితి.

వల్లీ—(స్త్రీ)౧ అజమోదాయాం=ఓమము, ౨ వ్రతత్యాం=తీఁగె.

బాలో నా కుంతలేఽశ్వస్య
కరిణశ్చాపి వాలధౌ, నారి
కేళే హరిద్రాయాం మల్లి
కాభిద్యపి స్త్రియామ్. ౩౯
వాచ్యలింగోఽర్భకే మూర్ఖే
హ్రీబేరే పున్నపుంసకమ్,
అలంకారాంతరే మేధ్యే
బాలీ బాలా త్రుటౌ స్త్రి
యాం. ౪౦

బాలః—(పు) ౧ కుంతలే = వెండ్రుకలు, ౨ అశ్వస్యవాలధౌ = గుఱ్ఱపుఁదోఁక, ౩ కరిణఃవాలధౌ=ఏనుఁగుతోఁక, (స్త్రీ) ౪ నారికేళే = కొబ్బరిచెట్టు, ౫ హరిద్రాయాం=పసుపు, ౬ మల్లికాభిధి = మల్లెతీఁగెలో విశేషము, (త్రి) ౭ అర్భకే = పిల్లవాఁడు, ౮ మూర్ఖే = మూర్ఖుఁడు, (ప్న) ౯ హ్రీబేరే=కురువేరు, బాలీ (స్త్రీ) ౧౦ అలంకారాంతరే = సూడిగమనునలంకారము, ౧౧ మేధ్యే=పవిత్రము, (స్త్రీ) ౧౨ త్రుటౌ=త్రుటికాలము, ౧౩ స్త్రియాం = ఆఁడుపిల్ల.

| | |
|---|---|
| వేలా కాలే చ సీమాయా మబ్ధేః కూలవికారయోః, అక్లిష్టమరణే రాగే ఈశ్వ రస్య చ భోజనే. ౪౧ | వేలా—(స్త్రీ) ౧ కాలే = కాలము, ౨ సీమాయాం = పొలిమేర, ౩ అబ్ధేః కూల = చెలియలికట్ట, ౪ అబ్ధేర్వికారయోః=ఉప్పెన, ౫ అక్లిష్టమరణే = కష్టములేనిచావు, ౬ రాగే= అనురాగము, ౭ ఈశ్వరస్యభోజనే = రాజభోజనము. |
| భల్లస్స్యాత్పుంసి భల్లూకే శస్త్రభేదే చ న ద్వయోః, భల్లాతక్యాం స్త్రియాం భల్లీ | భల్లః—(పు) ౧ భల్లూకే=ఎలుగుబంటు, (న) ౨ శస్త్రభేదే=బల్లెము, భల్లీ (స్త్రీ) ౩ భల్లాతక్యాం=నల్లజీడిచెట్టు. |
| భాలం తేజోలలాటయోః. | భాలం—(న) ౧ తేజః= తేజస్సు, ౨ లలాటయోః=నుదురు. |
| భేలః ప్లవే మునౌ పుంసి భీరావజ్ఞే చ వాచ్యవత్, | భేలః—(పు) ౧ ప్లవే=తెప్ప, ౨ మునౌ= మునీశ్వరుఁడు, (త్రి) ౩ భీరౌ=భయస్వభావముకలవాఁడు, ౪ అజ్ఞే = మూర్ఖుఁడు. |
| భోలో మీనాంతరే పుంసి త్రిషు కామాదివిహ్వలే. | భోలః—(పు) ౧ మీనాంతరే=ఒకానొక చేప, (త్రి) ౨ కామాదివిహ్వలే = కామాదివికారములచేబాధనొందినది. |
| మలోఽస్త్రీ పాపవిట్కిట్టే కృపణే త్వభిధేయవత్, | మలః—(పున) ౧ పాప = పాపము, ౨ విట్=అమేధ్యము, ౩ కిట్టే=మలము, (త్రి) ౪ కృపణే=కుత్సితుఁడు. |
| మల్లః పాత్రే కపోలే చ మత్స్యభేదే బలీయసి ౪౪ | మల్లః—(పు) ౧ పాత్రే = మట్టికంచము, ౨ కపోలే = గండస్థలము, ౩ మత్స్యభేదే= చేపలలోభేదము, ౪ బలీయసి= బలవంతుఁడు. |
| మాలం క్షేత్రే స్త్రియాం పృక్కా స్రజోర్జాత్యంతరే పుమాన్, | మాలం—(పున) ౧ క్షేత్రే = దిబ్బ, (స్త్రీ) ౨ పృక్కా=పిక్కచెట్టు, ౩ స్రజోః= పూలదండ, (పు) ౪ జాత్యంతరే= మాలజాతి. |

| | |
|---|---|
| మాలుః పత్రలతానార్యోః స్త్రియాం | మాలుః—(స్త్రీ) ౧ పత్రలతా = మకరికాపత్రాదులు, ౨ నార్యోః = ఆఁడుది. |
| మూలం శిఫాద్యయోః. ౪౫. మూలవిత్తేఽంతికే వా నా భే | మూలం—(న) ౧ శిఫా=వేరు, ౨ ఆద్యయోః = మొదలు, 3 మూలవిత్తే = మూలధనము, ౪ అంతికే = సమీపము, (ప్స) ౫ భే=మూలానక్షత్రము. |
| మేలా మేలకే మసౌ, | మేలా—(స్త్రీ) ౧ మేలకే = కూడిక, ౨ మసౌ=సిరా. |
| మౌలిః కిరీటే ధమ్మిల్లే చూడాయామనపుంసకమ్. ౪౬. నాశోకద్రౌ స్త్రియాం భూమౌ | మౌలిః—(పు) ౧ కిరీటే = కిరీటము, ౨ ధమ్మిల్లే=కొప్పు, (ప్స) 3 చూడాయాం =శిఖ, (పు) ౪ అశోకద్రౌ = అశోకవృక్షము, (స్త్రీ) ౫ భూమౌ=భూమి. |
| లీలా కేలివిలాసయోః, శృంగారభావచేష్టాయాం లోలస్స్యాద్వాచ్యలింగకః.౪౭. సతృష్ణే చంచలే, | లీలా—(స్త్రీ) ౧ కేలి=క్రీడ, ౨ విలాసయోః = విలాసము, 3 శృంగారభావచేష్టాయాం = స్త్రీలయొక్క-శృంగారచేష్ట, (త్రి) ౪ సతృష్ణే=ఆశగలవాఁడు, ౫ చంచలే = చపలమైనవాఁడు. |
| లోలా జిహ్వాకమలయోః స్త్రియామ్, | లోలా—(స్త్రీ) ౧ జిహ్వా=నాలుక, ౨ కమలయోః=లక్ష్మి. |
| వ్యాలో దుష్టగజే సర్పే శ్వాపదే నాన్యవత్ఖలే. ౪౮ | వ్యాలః—(పు) ౧ దుష్టగజే = దుష్టమైనయేనుఁగు, ౨ సర్పే=పాము, 3 శ్వాపదే=పులి, (త్రి) ౪ ఖలే=దుర్మార్గుఁడు. |
| బిలం ఛిద్రే గుహాయాం చ పుమానుచ్చైశ్శ్రవోహయే, | బిలం—(న) ౧ ఛిద్రే=బెజ్జము, ౨ గుహాయాం=గుహ ,(పు) 3 ఉచ్చైశ్శ్రవోహయే = ఉచ్చైశ్శ్రవమనెడుగుఱ్ఱము. |
| శలం తు శలలే పుంసి భృంగిక్షేత్రభిదోర్విధౌ ౪౯ | శలం—(న) ౧ శలలే = ఏదుపందిముల్లు, (పు) ౨ భృంగీ=భృంగీశ్వరుఁడు, 3 క్షేత్రభిదోః = భూమిలోభేదము, ౪ విధౌ=బ్రహ్మదేవుఁడు. |

శాలుః కషాయద్రవ్యే స్యా చ్చోరకాఖ్యౌషధౌ పుమాన్,

శాలుః—(పు) ౧ కషాయద్రవ్యే = వగరువస్తువు, ౨ చోరకాఖ్యౌషధౌ = చోరకమనుగంధద్రవ్యము.

శాలిస్తు కలమాదౌ చ గంధమార్జారకే పుమాన్. ౫౦

శాలి—(పు) ౧ కలమాదౌ = వరిపైరు మొదలయినది, ౨ గంధమార్జారకే = పునుఁగుఁబిల్లి.

శాలా ద్రుస్కంధశాఖాయాం గృహగేహైక దేశయోః, నా ఝషే

శాలా—(స్త్రీ) ౧ ద్రుస్కంధశాఖాయాం = చెట్టుమొదటికొమ్మ, ౨ గృహ = యిల్లు, ౩ గేహైకదేశయోః = ఇంటిలోనొకభాగము, (పు) ౪ ఝషే = మీను.

శిలముంఛే స్యాద్గండూపద్యాం శిలీమతా. ౫౧. స్తంభశీర్షే శిలాశిల్యౌ శిలా తు ప్రస్తరే మతా, తథామనశ్శిలాయాం చ ద్వారాధఃస్థితదారుణి. ౫౨

శిలం—(న) ౧ ఉంఛే = రోళ్లయొద్దను చేలయొద్దనుఒకొక్కగింజ నేరడము, శిలీ (స్త్రీ) ౨ గండూపద్యాం=ఆఁడెల్ల, (ఆ. స్త్రీ, ఈ. స్త్రీ) ౩ స్తంభశీర్షే= స్తంభముయొక్కపైభాగము, (ఆ. స్త్రీ.) ౪ ప్రస్తరే=ఱాయి, ౫ మనశ్శిలాయాం =మణిసిల, ౬ ద్వారాధఃస్థితదారుణి = కడపక్రింది త్రొక్కుడుకమ్మి.

శీలం స్వభావే సద్వృత్తే

శీలం—(న) ౧ స్వభావే=స్వభావము, ౨ సద్వృత్తే=మంచినడత.

శుక్లో యోగాంతరే సితే, నపుంసకం తు రజతే.

శుక్లః—(పు) ౧ యోగాంతరే = శుక్లనామయోగము, ౨ సితే= తెలుపు,(న) ౩ రజతే=వెండి.

శూలోఽస్త్రీ రోగ ఆయుధే. ౫౩ మృత్యుకేతనయోగేషు శూలా స్యాత్పణ్యయోషితి,

శూలః—(ప్న) ౧ రోగే = రోగము, ౨ ఆయుధే = శూలము, ౩ మృత్యు = చావు, ౪ కేతన = టెక్కెము, ౫ యోగే = శూలయోగము, (స్త్రీ) ౬ పణ్యయోషితి = భోగముది,

శైలో భూభృతి శైలం తు శైలేయే తార్క్ష్యశైలకే.

శైలః—(పు) ౧ భూభృతి=కొండ, (న) ౨ శైలేయే=ఊాతిపువ్వు, 3 తార్క్ష్యశైలకే=రసాంజనము.

సాలః పాదపమాత్రే స్యాత్ప్రాకారే సర్జపాదపే,

సాలః—(పు) ౧ పాదపమాత్రే = చెట్టు, ౨ ప్రాకారే=ప్రాకారము, 3 సర్జపాదపే=మద్దిచెట్టు.

స్థాలం భాజనభేదేఽపి స్థాలీ స్యాత్పాటలోఖయోః.

స్థాలం—(న) ౧ భాజనభేదే = కంచము, స్థాలీ (స్త్రీ) ౨ పాటలా=కలిగొట్టుచెట్టు, ౨ ఉఖయోః=వంటకుండ.

స్థూలం కూటేఽథ నిష్ప్రజ్ఞే పీవరేఽప్యన్యలింగకః,

స్థూలం—(న) ౧ కూటే=దేరా, (త్రి) ౨ నిష్ప్రజ్ఞే=తెలివిలేనివాఁడు, 3 పీవరే=బలిసినవాఁడు.

హాలో హాలే పుమాన్ హాలా మదిరాయాం చ యోషితి.

హాలః—(పు) ౧ హాలే=నాఁగలి, (స్త్రీ) ౨ మదిరా=కల్లు.

హేలా త్రియామవజ్ఞాయాం విలాసే వరయోషితాం,

హేలా—(స్త్రీ) ౧ అవజ్ఞాయాం=తిరస్కారము, ౨ వరయోషితాంవిలాసే=స్త్రీలయొక్క శృంగారచేష్ట.

---

## ల త్రికం.

మూఁడక్షరములుగల లకారాంత శబ్దములు.

అనలో వసుభేదేఽగ్నౌ

అనలః—(పు) ౧ వసుభేదే = అష్టవసువులలోనొకఁడు, ౨ అగ్నౌ=నిప్పు.

వనిలో వసువాతయోః. ౫౭

అనిల—(పు) ౧ వసు = అష్టవసులలోనొకఁడు, ౨ వాతయోః=గాలి.

అర్గలా త్రిషు కల్లోలేఽంతర్గండకపాటయోర్న నా,

అర్గలా—(త్రి) ౧ కల్లోలే = తరంగము, (స్న) ౨ అంతర్గండ = గడిమ్రాను, 3 కపాటయోః=తలుపుచెక్క.

అరాలః కుటిలే సర్జరసే సమదదంతిని. ౫౮

అరాలః—(పు) ౧ కుటిలే=వంకర, ౨ సర్జరసే = సర్జరసమనుగంధద్రవ్యము, 3 సమదదంతిని=మదపుటేనుఁగు.

| | |
|---|---|
| అంగులీ కరశాఖాయాం కర్ణి కాయాం గజస్య చ, | అంగులీ—(స్త్రీ) ౧ కరశాఖాయాం=చేతి వ్రేలు, ౨ గజస్యకర్ణికాయాం=ఏనుఁగుతొండముకొన. |
| అచలా వసుధాయాం స్యాద చలశ్శైలకీలయోః. ౮౯ | అచలా—(స్త్రీ) ౧ వసుధాయాం=పుడమి (పు) ౨ శైల=పర్వతము, ౩ కీలయోః =మేకు. |
| అమలం త్వభ్రకే క్లీబం ల క్ష్మ్యాం స్త్రీ నిర్మలే త్రిషు, | అమలం—(న) ౧ అభ్రకే = కాకిబంగారము, (స్త్రీ) ౨ లక్ష్మ్యాం = లక్ష్మీదేవి, (త్రి) ౩ నిర్మలే=స్వచ్ఛము. |
| అంజలిస్తు పుమాన్ హస్త సంపుటే కుడవేఽపి చ. ౯౦ | అంజలిః—(పు) ౧ హస్తసంపుటే=దోసిలి, ౨ కుడవే=మానిక. |
| అవేలస్త్వపలాపే స్యాదవే లా పూగచర్వితే, | అవేలః—(పు) ౧ అపలాపే=కపటముగాఁ బలుకుట, ౨ పూగచర్వితే = ఒక్కను నమలుట. |
| ఆభీలం న ద్వయోః కృచ్ఛ్రే వాచ్యలింగం భయానకే. | ఆభీలం—(న) ౧ కృచ్ఛ్రే=కష్టము, (త్రి) ౨ భయానకే=భయము. |
| ఇల్వలా తారకాభేదే నా భేదే దైత్యమత్స్యయోః, | ఇల్వలా—(స్త్రీ) ౧ తారకాభేదే=నక్షత్ర భేదము, (పు) ౨ దైత్య = ఒకానొక రాక్షసుఁడు, ౩ మత్స్యయోర్భేదే = ఒకానొక చేఁప. |
| ఉత్పలీ తుషచర్పట్యాం క్లీ బం కుష్ఠప్రసూనయోః. ౯౨ | ఉత్పలీ—(స్త్రీ) ౧తుషచర్పట్యాం=ఉముక బొబ్బట్లు, (న) ౨ కుష్ఠ = చెంగల్వ కోష్టు, ౩ ప్రసూనయోః=కలువ. |
| ఉపలః ప్రస్తరే రత్నే శర్క రాయాం తు యోషితి, | ఉపలః—(పు) ౧ ప్రస్తరే = ఱాయి, ౨ రత్నే=మాణిక్యము, (స్త్రీ) ౩ శర్కరాయాం=మొరపఱాయి. |
| ఉజ్జ్వలో దీప్తశృంగారవిశ దేషు వికాశిని. ౯౩ | ఉజ్జ్వలః—(పు) ౧ దీప్త = మండునది, ౨ శృంగార=అలంకారము, ౩ విశదేషు= స్వచ్ఛమైనది, ౪ వికాసిని = ప్రకాశించునది, |

ఉత఼్ల్లం కరణే స్త్రీణాముత్తానే౽పి వికస్వరే,

ఉత఼్ల్లం—(న) ౧ స్త్రీణాంకరణే=స్త్రీల రతిబంధవిశేషము, ౨ ఉత్తానే=వెలికిలినది, ౩ వికస్వరే=వికసించినది.

ఉత్తాల ఉత్కటే శ్రేష్ఠే వికరాలే ప్లవంగమే. ౬౪

ఉత్తాలః—(పు) ౧ ఉత్కటే = అధికమయినది, ౨ శ్రేష్ఠే=శ్రేష్ఠమయినది, ౩ వికరాళే=భయంకరము, ౪ ప్లవంగమే=తోఁకలేనికోఁతి.

కమలం సలిలే తామ్రే జలజే క్లోమ్ని భేషజే, మృగభేదే తు కమలః కమలా శ్రీవరస్త్రియోః. ౬౫

కమలం—(న) ౧ సలిలే=నీరు, ౨ తామ్రే=రాగి, ౩ జలజే=పద్మము, ౪ క్లోమ్ని = కడుపులో దక్షిణభాగమందుం డెడ్డుని మాంసము, ౫ భేషజే = ఔషధము, (పు) ౬ మృగభేదే = యిఱ్ఱి, ౭ శ్రీ= లక్ష్మి, ౮ వరస్త్రియోః = ఉత్తమురాలు.

కపిలా రేణుకాయాం చ శింశపాగోవిశేషయోః, పుండరీకకరిణ్యాం స్త్రీ వర్ణభేదే త్రిలింగకమ్. ౬౬. నానలే వాసుదేవే చ మునిభేదే చ కుక్కురే,

కపిలా—(స్త్రీ) ౧ రేణుకాయాం=రేణుకయనుగంధద్రవ్యము, ౨ శింశపా = ఇరుగుడుచెట్టు, ౩ గోవిశేషయోః = కపిలవర్ణముగలగోవు, ౪ పుండరీక కరిణ్యాం = పుండరీకమను దిగ్గజము భార్య, (త్రి) ౫ వర్ణభేదే=కపిలవర్ణము గలది, (పు) ౬ అనలే=అగ్ని, ౭ వాసుదేవే=కృష్ణుఁడు, ౮ మునిభేదే=కపిలముని, ౯ కుక్కురే=కుక్క.

కంబలో నాగరాజే స్యాత్సాస్నాప్రావారయోరపి. ౬౭. క్రిమావప్యుత్తరాసంగే౽సలిలేతు నపుంసకమ్,

కంబలః—(పు) ౧ నాగరాజే = సర్పవిశేషము, ౨ సాస్నా = గంగడోలు, ౩ ప్రావారయోః = ఏనుఁగు మున్నగువానికిఁగప్పెడు రత్నకంబళి, ౪ క్రిమౌ=కంబళిపురుగు, ౫ ఉత్తరాసంగే=ఉత్తరీయము, (న) ౬ సలిలే = నీరు.

కరాలో దంతురే తుంగే భీషణే చాభిధేయవత్. ౬౮. ససర్జరసతైలే నా క్లీబం కృష్ణకుఠేరకే,

కరాలః—(త్రి) ౧ దంతురే = మిట్టపండ్లవాఁడు, ౨ తుంగే = ఉన్నతమైనవాఁడు, 3 భీషణే = భయంకరమైనవాఁడు, (పు) ౪ ససర్జరసతైలే = సర్జరసమునూనె, (న) ౫ కృష్ణకుఠేరకే = నల్లగగ్గెరచెట్టు.

కందలం త్రిషు కపాలేఽప్యుపరాగే నవాంకురే. ౬౯. కలధ్వనౌ కందలీతు మృగగుల్మప్రభేదయోః,

కందలం—(త్రి) ౧ కపాలే = తలపుఱ్ఱె, ౨ ఉపరాగే=గ్రహణము, 3 నవాంకురే=క్రొత్తమొలక, ౪ కలధ్వనౌ = అవ్యక్తమధురధ్వని, కందలీ (స్త్రీ) ౫ మృగ=ఇరువదియంగుళముల నిడివిగలయిఱ్ఱి, ౬ గుల్మప్రభేదయోః = ఒకానొకపొద.

కదలాకదలో పృశ్న్యాం కదలీకదలౌ పునః. ౭౦. రంభావృక్షేఽథ కదలీ పతాకామృగభేదయోః, కదలా డింబికాయాం చ శాల్మలీభూరుహేఽపి చ. ౭౧

కదలా, కదలః } (స్త్రీ) ౧ పృశ్న్యాం=కోలపొన్నచెట్టు, కదలీ (స్త్రీ-పు) ౨ రంభావృక్షే= అరఁటిచెట్టు, కదలీ (స్త్రీ) 3 పతాకా= జెండా, ౪ మృగభేదయోః = ఇరువదియంగుళములనిడివిగలయిఱ్ఱి, (ఆ-స్త్రీ) ౫ డింబికాయాం=దుండిగపుఁజెట్టు, ౬ శాల్మలీభూరుహే=బూరుగచెట్టు.

కపాలోఽస్త్రీ శిరోఽస్థ్ని స్యాద్ఘటాదేశ్శకలే వ్రజే,

కపాలః—(ప్న) ౧ శిరోఽస్థ్ని=తలపుఱ్ఱె, ౨ ఘటాదేశ్శకలే = కుండమొదలయినవానిపెంకు, 3 వ్రజే=గుంపు.

కంతాలా తు ద్వయోర్గోణీప్రభేదే నా క్రమేలకే ౭౨

కంతాలా—(ప్స) ౧ గోణీప్రభేదే = గోతాము, (పు) ౨ క్రమేలకే = ఒంటె.

కల్లోలః పుంసి హర్షే స్యాదుల్లోలవైరిణోరపి,

కల్లోలః—(పు) ౧ హర్షే = సంతోసము, ౨ ఉల్లోల=తరంగము, 3 వైరిణోః= శత్రువు.

కామలా రోగభేదే వా నా నా మరువసంతయోః. ౨౩. కాముకే వాచ్యలింగోఽ

కామలా—(పున) ౧ రోగభేదే=కామలా రోగము, (పు) ౨ మరు = జలరహితమైనభూమి, 3 వసంతయోః=వసంతఋతువు, (త్రి) ౪ కాముకే = కాముకుఁడు.

థ కాలోలం నరకాంతరే, నా కులాలే ద్రోణకాకే విషభేదే తు న స్త్రియామ్. ౨౪

కాలోలం—(న) ౧ నరకాంతరే = నరకవిశేషము, (పు) ౨ కులాలే = కుమ్మరివాఁడు, 3 ద్రోణకాకే=మాలకాకి, (పున) ౪ విషభేదే = కాలకూటము.

కాహలా వాద్యభాండస్య భేదే చాప్సరసాం భిది, కాహలీ తు తరుణ్యాంస్యాత్కాహల శ్చరణాయుధే. ౨౫. శబ్దమాత్రేఽపి పుంల్లింగ స్త్రిషు శుష్కే భృశే ఖలే,

కాహలా—(స్త్రీ) ౧ వాద్యభాండస్య భేదే= వాద్యవిశేషము, ౨ అప్సరసాంభిది = అప్సరోవిశేషము, కాహలీ (స్త్రీ) 3 తరుణ్యాం = జవ్వని, (పు) ౪ చరణాయుధే = కోడి, ౫ శబ్దమాత్రే = ధ్వని, (త్రి) ౬ శుష్కే = ఎండినది, ౭ భృశే=అధికమైనది, ౮ ఖలే-దుష్టమైనది.

కిట్టాలః పుంసి తామ్రస్య కలశే లోహగూథకే. ౨౬

కిట్టాలః—(పు) ౧ తామ్రస్యకలశే=రాగిపాత్ర, ౨ లోహగూథకే = ఇనుపచిట్టెము.

కీలాలం రుధిరే తోయే

కీలాలం—(న) ౧ రుధిరే = నెత్తురు, ౨ తోయే=నీరు.

కుశలశ్శిక్షితే త్రిషు, క్షేమే చ సుకృతే చాపిపర్యాప్తౌ చ నపుంసకం ౨౭

కుశలః—(త్రి) ౧ శిక్షితే = శిక్షింపఁబడినది, (న) ౨ క్షేమే = శుభము, 3 సుకృతే = పుణ్యము, ౪ పర్యాప్తౌ = తృప్తి.

కువలం చోత్పలే ముక్తాఫలేఽపి బదరీఫలే,

కువలం—(న) ౧ ఉత్పలే = కలువ, ౨ ముక్తాఫలే=ముత్తెము, 3 బదరీఫలే=రేఁగుబండు.

| | |
|---|---|
| కుట్మలో ముకులే పుంసి న ద్వయోర్నరకాంతరే. ౭౮ | కుట్మలః—(పు) ౧ ముకులే=మొగ్గ, (న) ౨ నరకాంతరే=నరకభేదము. |
| కుటిలా తగరపాద్యాం స్త్రీ భుగ్నే చ వాచ్యలింగకః, | కుటిలా—(స్త్రీ) ౧ తగరపాద్యాం = తగరపాదియనునది, (త్రి) ౨ భుగ్నే=వంకరైనది. |
| కుంతలశ్చషకే వాలే యవే పుంభూమ్ని నీవృతి. ౭౯ | కుంతలః—(పు) ౧ చషకే=త్రాగుగిన్నె, ౨ వాలే=వెండ్రుక, 3 యవే=యవధాన్యము, (ని.బ.) ౪ నీవృతి=కుంతలదేశము. |
| కులాలః కుక్కుభే కుంభకారే స్త్రీ త్వంజనాంతరే, | కులాలః—(పు) ౧ కుక్కుభే=గంపపులుగు, ౨ కుంభకారే = కుమ్మరివాఁడు, (స్త్రీ) 3 అంజనాన్తరే = కుళుత్థాంజనము. |
| కుంభిలశ్శాలమీనే చ చోర శ్లోకార్థచోరయోః. ౮౦ | కుంభిలః—(పు) ౧ శాలమీనే = కారుమొసలి, ౨ చోరే=దొంగ, 3 శ్లోకార్థచోరయోః = శ్లోకార్థమునపహరించినవాఁడు. |
| కుద్దాలస్స్యాత్పుమాన్ భూమిదారణే యుగపత్రకే, | కుద్దాలః—(పు) ౧ భూమిదారణే = గుద్దలి, ౨ యుగపత్రకే = కాంచనముచెట్టు. |
| కుచేలా విద్ధకర్ణ్యాం స్త్రీ వాచ్యవత్తు కువాససి. ౮౧ | కుచేలా—(స్త్రీ) ౧ విద్ధకర్ణ్యాం=చిఱుబొద్దిచెట్టు, (త్రి) ౨ కువాససి = చెడ్డగుడ్డగలది. |
| కుకూలం శంకుసంకీర్ణశ్వభ్రే నా తు తుషానలే, | కుకూలం—(న) ౧ శంకుసంకీర్ణశ్వభ్రే = వసినాటినగుంట, (పు) ౨ తుషానలే=ఊకనిప్పు |
| కుండలం కర్ణభూషాయాం పాశేఽపి వలయేఽపి చ. ౮౨. కాంచనద్రుగుడూచ్యోః స్త్రీ | కుండలం—(న) ౧ కర్ణభూషాయాం = పోగులు, ౨ పాశే=త్రాడు, 3 వలయే =గుండ్రన, (స్త్రీ) ౪ కాంచనద్రు=దేవకాంచనచెట్టు, ౫ గుడూచ్యోః=తిప్పతీఁగె. |

కేవలః కుహనే పుమాన్, నపుంసకం తు నిర్ణీతే వాచ్యవచ్చైకకృత్స్నయోః. ౮౩. కేవలో జ్ఞానభేదే౽

కేవలః—(పు) ౧ కుహనే=కపటుఁడు, (న) ౨ నిర్ణీతే = నిశ్చయింపఁబడినది, (త్రి) ౩ ఏక=ఒకటి, ౪ కృత్స్నయోః=సమస్తము, (పు) ౫ జ్ఞానభేదే = పరమాత్మ.

థ కోమలం మృదులే జలే,

కోమలం—(న) ౧ మృదులే = మృదువైనది, ౨ జలే=నీరు.

కోహలో వాద్యభేదే స్యాన్నాట్యశాస్త్రప్రవక్తరి. ౮౪

కోహలః—(పు) ౧ వాద్యభేదే=కాహళమనువాద్యము, ౨ నాట్యశాస్త్రప్రవక్తరి = నాట్యశాస్త్రమును జెప్పినయొక ముని.

గ్రంథిలస్తు కరీరద్రౌ వికంకతతరౌ పుమాన్, సగ్రంథౌ త్రిషు

గ్రంథిలః—(పు) ౧ కరీరద్రౌ=వెఱుతురుచెట్టు, ౨ వికంకతతరౌ=ములువెలఁగచెట్టు, (త్రి) ౩ సగ్రంథౌ=గనుపులుగలది.

గంధోలీ భద్రాశట్యోశ్చ యోషితి. ౮౫

గంధోలీ—(స్త్రీ) ౧ భద్రా=నాగముస్తెచెట్టు, ౨ శట్యోః=గండ్లకచోరము.

గరలం తృణపూలే చ విషే మానే నపుంసకమ్,

గరలం—(న) ౧ తృణపూలే=గడ్డిమోపు, ౨ విషే = విషము, ౩ మానే = పరిమితి

గోపాలో నృపగోపేశే

గోపాలః—(పు) ౧ నృప = రాజు, ౨ గోపేశే=కృష్ణుఁడు.

గోకీలో ముసలే హలే. ౮౬

గోకీలో—(పు) ౧ ముసలే= రోఁకలి, ౨ హలే=నాఁగలి.

గౌరిలస్తు పుమాన్ లోహచూర్ణే స్యాద్గౌరసర్షపే,

గౌరిలః—(పు) ౧ లోహచూర్ణే=ఉక్కుపొడి, ౨ గౌరసర్షపే=తెల్లావాలు.

చపలః పారదే మీనే చోరకే ప్రస్తరాంతరే ౮౭. చపలా కమలావిద్యుత్పుంశ్చలీపిప్పలీషు చ, నపుంసకం తు

చపలః—(పు) ౧ పారదే = పాదరసము, ౨ మీనే=చేఁప, ౩ చోరకే = చోరకపుష్పిచెట్టు, ౪ ప్రస్తరాంతరే = చలువపఱాయి, (స్త్రీ) ౫ కమలా=లక్ష్మి,

శీఘ్రే స్యాద్వాచ్యవత్తరలే చలే. ౮౮

౬ విద్యుత్=మెఱుపు, ౭ పుంశ్చలీ=జారిణి, ౮ పిప్పలీషు=పిప్పలితీఁగె, (న) ౯ శీఘ్రే = వేగము, (త్రి) ౧౦ తరలే=నిలుకడలేనిది, ౧౧ చలే = చలించునది.

చత్వాలో హోమకుండే స్యాత్పుంసి దర్భేఽపి దృశ్యతే,

చత్వాలః—(పు) ౧ హోమకుండే=హోమగుండము, ౨ దర్భే=దర్భ.

చంద్రిలః పుంసి వాస్తూకశాకే భర్గే చ నాపితే. ౮౯

చంద్రిలః—(పు) ౧ వాస్తూకశాకే=చక్రవర్తికూర, ౨ భర్గే = శివుఁడు, 3 నాపితే=మంగలి.

చంచలా తు తటిల్లక్ష్మ్యోశ్చంచలః కాముకేఽనిలే,

చంచలా—(స్త్రీ) ౧ తటిత్ = మెఱుపు, ౨ లక్ష్మ్యోః = లక్ష్మి, (పు) 3 కాముకే = కాముకుఁడు, ౪ అనిలే = వాయువు.

చూడాలా తూచ్చటాయాం స్త్రీ చూడావతి చ వాచ్యవత్. ౯౦

చూడాలా—(స్త్రీ) ౧ ఉచ్చటాయాం = గుండ్రతుంగముస్తె, (త్రి) ౨ చూడావతి=జుట్టుగలవాఁడు.

ఛగలం నీలవస్త్రే నా ఛాగే స్త్రీ వృద్ధదారకే,

ఛగలం—(న) ౧ నీలవస్త్రే = నల్లనిబట్ట, (పు) ౨ ఛాగే=మేఁక, (స్త్రీ) 3 వృద్ధదారకే=బొద్దికూర.

జంబాల శ్శైవలే పంకే

జంబాలః—(పు) ౧ శైవలే=నాఁచు, ౨ పంకే=బురద.

జగలో మదనద్రుమే. ౯౧. మేదకేపిష్టమద్యే చ పుంసి ధూర్తేఽభిధేయవత్,

జగలః—(పు) ౧ మదనద్రుమే = మంగచెట్టు, ౨ మేదకే=సారాయిచేయుటకు సిద్ధపఱుచినపిండి, 3 పిష్టమద్యే=పిండిచేతఁజేయఁబడినసారాయి, (త్రి) ౪ ధూర్తే=కపటుఁడు.

జటిలా పిప్పలీమాంస్యోర్జటాయుక్తే తు వాచ్యవత్ ౯౨

జటిలా—(స్త్రీ) ౧ పిప్పలీ = పిప్పలితీఁగె, ౨ మాంస్యోః=జటామాంసి, (త్రి) 3 జటాయుక్తే=జడలుగలది.

జంగలం నిర్జనస్థానే త్రిలిం గ్యాం పిశితే౽స్త్రియామ్,

జంగలం—(త్రి) ౧ నిర్జనస్థానే = జనము లేనిచోటు, (న) ౨ పిశితే = మాంసము.

జంభలః పుంసి జంబీరే బుద్ధ దేవతాంతరే౽పి చ. ౯౩

జంభలః—(పు) ౧ జంబీరే=నిమ్మచెట్టు, ౨ బుద్ధదేవతాంతరే = జంభలయనుబుద్ధ దేవత.

జంబూలస్తు పుమాన్ జం బూ విటపే క్రకచచ్ఛదే,

జంబూలః—(పు) ౧ జంబూవిటపే = నేరేడుచెట్టు, ౨ క్రకచచ్ఛదే=మొగిలి చెట్టు.

జాంగులీ విషవిద్యాయాం జాంగులం జాలినీఫలే. ౯౪

జాంగులీ—(స్త్రీ) ౧ విషవిద్యాయాం=విష మునుబోఁగొట్టువిద్య, ౨ జాలినీఫలే= పొట్లకాయ.

జాంగలీ శూకశింబ్యాం స్త్రీ జాంగలో నా కపింజలే.

జాంగులీ—(స్త్రీ) ౧ శూకశింబ్యాం=దూల గొండిచెట్టు, (పు) ౨ కపింజలే=కముజు పిట్ట.

తరలం చంచలే షిద్గే భాసు రే౽పి త్రిలింగకమ్. ౯౫. హారమధ్యమణౌ పుంసి య వాగూసురయోః స్త్రియాం,

తరలం—(త్రి) ౧ చంచలే=చలించునది, ౨ షిద్గే = జారుఁడు, ౩ భాసురే = ప్రకాశించునది, (పు) ౪ హారమధ్య మణౌ = నాయకమణి, (స్త్రీ) ౫ యవా గూ=గంజి, ౬ సురయోః=కల్లు.

తండులస్స్యాద్విడంగే చ ధా న్యాదినికరే పుమాన్. ౯౬

తండులః—(పు) ౧ విడంగే=వాయువిడం గముచెట్టు, ౨ ధాన్యాదినికరే=ధా న్యాదులసారము. (బియ్యము)

తమాలస్తిలకే ఖడ్గే తాపింఛే వరుణద్రుమే,

తమాలః—(పు) ౧ తిలకే = బొట్టు, ౨ ఖడ్గే=కత్తి, ౩ తాపింఛే = చీఁకటి మ్రాను, ౪ వరుణద్రుమే = ఉలిమిరి చెట్టు

తాంబూలీ నాగవల్ల్యాం స్త్రీ క్రముకే తు నపుంసకమ్.

తాంబూలీ—(స్త్రీ) ౧ నాగవల్ల్యాం=తమల పాకుతీఁగె, (న) ౨ క్రముకే = పోఁక.

| | |
|---|---|
| తాతలో రుజి పాకే చ లోహ కూటే మనోజవే, | తాతలః—(పు) ౧ రుజి = రోగము, ౨ పాకే=పక్వమైనది, ౩ లోహకూటే = సమ్మెట, ౪ మనోజవే=తండ్రిసంబంధమైనది. |
| తుములః కలివృక్షే నా క్లీబం తు రణసంకులే. ౯౭ | తుములః—(పు) ౧ కలివృక్షే=తాండ్రచెట్టు, (న) ౨ రణసంకులే = దొమ్మియుద్ధము. |
| తైతిలో గండకే పుంసి క్లీబస్తు కరణాన్తరే, | తైతిలః—(పు) ౧ గండకే=ఖడ్గమృగము, (న) ౨ కరణాంతరే = తైతిలయను పంచాంగకరణము. |
| దుకూలం శ్లక్ష్ణవస్త్రే స్యాత్ క్షౌమే చ | దుకూలం—(న) ౧ శ్లక్ష్ణవస్త్రే = సన్నని వస్త్రము, ౨ క్షౌమే=తెల్లనివస్త్రము. |
| ధవళా గవి. ౯౮. వృషశ్రేష్ఠే పుమాన్వాచ్యలింగశ్శుక్లే చ సుందరే, | ధవళా—(స్త్రీ) ౧ గవి = గోవు, (పు) ౨ వృషశ్రేష్ఠే = ఆఁబోతు, (త్రి) ౩ శుక్లే=తెల్లనిది, ౪ సుందరే = చక్కనిది. |
| నకులీ కుక్కుటీమాంస్యోః పశుపాండవయోః పుమాన్. | నకులీ—(స్త్రీ) ౧ కుక్కుటీ = ఆఁడుకోడి, ౨ మాంస్యోః = జటామాంసిచెట్టు, (పు) ౩ పశు = ముంగిస, ౪ పాండవయోః=నకులుఁడు. |
| నాకులీ కుక్కుటీకందే రాస్నాయాం చవికేఽప్యాం, | నాకులీ—(స్త్రీ) ౧ కుక్కుటీకందే = ఒకానొకదుంప, ౨ రాస్నాయాం = సన్నరాష్ట్రము, ౩ చవికే = చవ్యమను వృక్షము. |
| నాభీలం వంక్షణే నార్యాః కృచ్ఛ్రగర్భాండయోరపి. | నాభీలం—(న) ౧ నార్యాఃవంక్షణే=స్త్రీయొక్కగజ్జె, ౨ కృచ్ఛ్రే = బాధ, ౩ గర్భాండయోః=పెద్దబొడ్డు. |
| నిచులస్తు నిచోలే స్యాద్దిజ్జలాఖ్యమహీరుహే, | నిచులః—(పు) ౧ నిచోలే = గవిసెన, ౨ ఇజ్జలాఖ్యమహీరుహే = ఎఱ్ఱగన్నేరుచెట్టు. |

| | |
|---|---|
| నిర్మలం స్యాత్తు నిర్మాల్యే చాభ్రకే చ నపుంసకమ్. ౧౦౨. మలహీనేఽన్యలింగం చ | నిర్మలం—(న) ౧ నిర్మాల్యే=ధరించితీసిన పుష్పాదులు, ౨ అభ్రకే=కాకిబంగారు (త్రి) ౩ మలహీనే=నిర్మలమైనది. |
| నిస్తలం వర్తులే చలే, | నిస్తలం—(న) ౧ వర్తులే=గుండ్రనిది, ౨ చలే=చంచలమైనది |
| నిష్కలస్తు కలాశూన్యే నష్టవీర్యే చ వాచ్యవత్. ౧౦౩ | నిష్కలః—(త్రి) ౧ కలాశూన్యే = కళలేనిది, ౨ నష్టవీర్యే=వీర్యములేనిది. |
| నైపాలీ తు నవమాలీకునటీ సువహాసు చ, | నైపాలీ—(స్త్రీ) ౧ నవమాలీ = విరజాజితీఁగ, ౨ కునటీ = మణిసిల, ౩ సువహాసు=నల్లవావిలిచెట్టు. |
| పలలం తిలచూర్ణే చ, పంకే మాంసే నపుంసకమ్. ౧౦౪. నా రాక్షసేఽ | పలలం—(న) ౧ తిలచూర్ణే=నువ్వుపిండి, ౨ పంకే=బురద, ౩ మాంసే=మాంసము, (పు) ౪ రాక్షసే = రాక్షసుఁడు. |
| థ పటలం పిటకే చ పరిచ్ఛదే, ఛది ద్రుగ్రోగతిలకే క్లీబం బృందే పునర్నృనా. ౧౦౫ | పటలం—(న) ౧ పిటకే = బొబ్బ, ౨ పరిచ్ఛదే=ఆవరణము, ౩ ఛది=ఇంటికప్పు, ౪ ద్రుగ్రోగ = నేత్రరోగము, ౫ తిలకే=బొట్టు, (నృ) ౬ బృందే = సమూహము. |
| ప్రతలం పాతాలభేదే తతాంగులికరే పుమాన్, | ప్రతలం—(న) ౧ పాతాలభేదే=క్రింది లోకములలోభేదము, (పు) ౨ తతాంగులికరే = చాచఁబడిన వ్రేళ్లుగల హస్తము. |
| పటోలం వస్త్రభేదే నౌషధౌ జ్యోత్స్న్యాం తు యోషితి. | పటోలం—(న) ౧ వస్త్రభేదే = వస్త్రవిశేషము, (పు) ౨ ఓషధౌ = చేఁదిపొట్ల చెట్టు, (స్త్రీ) ౩ జ్యోత్స్న్యాం=పొట్ల చెట్టు. |
| ప్రవాలోఽస్త్రీ కిసలయే వీణాదండే చ విద్రుమే, | ప్రవాలః—(నృ) ౧ కిసలయే = చిగురుటాకు, ౨ వీణాదండే = వీణయొక్క కఱ్ఱ, ౩ విద్రుమే=పగడము. |

| | |
|---|---|
| పంచాలీ పుత్త్రికాగీత్యోః స్త్రియాం పుంభూమ్ని నీవృతి. | పంచాలీ—(స్త్రీ) ౧ పుత్త్రికా = బొమ్మ, ౨ గీత్యోః = గానవిశేషము, (ని-బ.) 3 నీవృతి=పంచాల దేశము. |
| పాంశులః పుంశ్చలే శంభోః ఖట్వాంగే స్త్ర్యసతీభువోః, | పాంశులః—(పు) ౧ పుంశ్చలే=విటుఁడు, ౨ శంభోః ఖట్వాంగే = ఈశ్వరుని యాయుధము, (స్త్రీ) 3 అసతీ=అంకులాడి, ౪ భువోః=భూమిక |
| పాకలం కుష్ఠభైషజ్యే పుంసి స్యాత్కుంజరజ్వరే. ౧౦౮ | పాకలం—(న) ౧ కుష్ఠభైషజ్యే=చెంగల్వకోష్టు, ౨ కుంజరజ్వరే = ఏనుఁగు యొక్కజ్వరము. |
| పాచలం పాచనే నాగ్నౌ రాధనద్రవ్యవాతయోః, | పాచలం—(న) ౧ పాచనే=ఆఁకలికలుగజేయునది, ౨ అగ్నౌ=నిప్పు, 3 రాధనద్రవ్య = వండఁబడిపక్వము చేయఁబడినది, ౪ వాతయోః=గాలి. |
| పాటలా పాటలౌ స్త్రీ స్యాదస్య పుష్పే పునర్న నా. ౧౦౯ ఆశుధాన్యే పుమాఞ్ శ్వేతరక్తవర్ణేఽపి వాచ్యవత్, | పాటలా—(స్త్రీ) ౧ పాటలౌ = కలిగోట్టు చెట్టు, (న్న) ౨ అస్యపుష్పే=కలిగోట్టు పువ్వు, (పు) 3 ఆశుధాన్యే = ఎఱ్ఱజిలమవడ్లు, (త్రి) ౪ శ్వేతరక్తవర్ణే = పాటలవర్ణముగలది. |
| పాతాళం నాగలోకే స్యాద్వివరే బడవానలే. ౧౧౦ | పాతాళం—(న) ౧ నాగలోకే=పాతాళలోకము, ౨ వివరే = రంధ్రము, 3 బడబానలే=బడబాగ్ని. |
| పాతిలీ వాగురాయాం స్యాన్నారీపాత్రప్రభేదయోః, | పాతిలీ—(స్త్రీ) ౧ వాగురాయాం = వల, ౨ నారీ=పణఁతి, 3 పాత్రప్రభేదయోః =ఒకవిధమగుగిన్నె. |
| పిప్పలం సలిలే వస్త్రచ్ఛేదభేదే చ నా తరౌ. ౧౧౧. నిరంశుకే పక్షిభేదే కణాయాం పిప్పలీ మతా. | పిప్పలం—(న) ౧ సలిలే = ఉదకము, ౨ వస్త్రచ్ఛేదభేదే = కౌపీనము, (పు) 3 తరౌ = రావిచెట్టు, ౪ నిరంశుకే = దిగంబరుఁడు, ౫ పక్షిభేదే = బాతు, పిప్పలీ (స్త్రీ) ౬ కణాయాం=పిప్పలితీఁగె. |

పిచులో ఝాబుకేఽపి స్యాది జ్జలే జలవాయసే. ౧౧౨

పిచులః—(పు) ౧ ఝాబుకే=పక్కెచెట్టు, ౨ ఇజ్జలే = ఎఱ్ఱగన్నేరుచెట్టు, 3 జలవాయసే=నీరుకాకి.

పింగలో నాగభిద్రుద్రచండాంశు పారిపార్శ్వకే, నిధిభేదే కపావగ్నౌ పుంసిస్యాత్కపిలేఽన్యవత్. ౧౧3. స్త్రియాం వేశ్యావిశేషే చ కరిణ్యాం కుముదస్య చ,

పింగలః—(పు) ౧ నాగభిద్ = సర్పవిశేషము, ౨ రుద్ర = శంకరుఁడు, 3 చండాంశుపారిపార్శ్వకే = సూర్యుని ప్రక్కనుండు దేవతావిశేషము, ౪ నిధిభేదే=నిధివిశేషము, ౫ కపౌ=కోఁతి, ౬ అగ్నౌ = అగ్ని, (త్రి) ౭ కపిలే = కపిలవర్ణముకలది, (స్త్రీ) ౮ వేశ్యావిశేషే = పింగళయను బోగముది, ౯ కుముదస్యకరిణ్యాం=కుముదమను దిగ్గజముభార్య.

పిత్తలా తోయపిప్పల్యాం స్త్ర్యన్యవత్పిత్తసంయుతే.౧౧౪. క్లీబం తు తైజసద్రవ్యే

పిత్తలా—(స్త్రీ) ౧ తోయపిప్పల్యాం = నీరుపిప్పలి, (త్రి) ౨ పిత్తసంయుతే= పిచ్చిది, (న) 3 తైజసద్రవ్యే=పిత్తళి.

పిచ్ఛిలో విజిలేఽన్యవత్, స్త్రీ పోతికాశింశపయోశ్శాల్మలీ సింధుభేదయోః. ౧౧౫

పిచ్ఛిలః—(త్రి) ౧ విజిలే = మీఁగడగట్టినది, (స్త్రీ) ౨ పోతికా= పెద్దసదాపచెట్టు, 3 శింశపయోః = ఇరుగుడుచెట్టు, ౪ శాల్మలీ = బూరుగుచెట్టు, ౫ సింధుభేదయోః=పిచ్ఛిలానది.

పుద్గలస్సుందరాకారే త్రిషు పుంస్యాత్మ దేహయోః,

పుద్గలః—(త్రి) ౧ సుందరాకారే=సౌందర్యముగలది, (పు) ౨ ఆత్మ=జీవము, 3 దేహయోః=శరీరము.

పేశలో రుచిరే దక్షే

పేశలః—(పు) ౧ రుచిరే=మనోహరము, ౨ దక్షే=సమర్థుఁడు.

ఫేనిలోఽరిష్టపాదపే. ౧౧౬. నా సఫేనే త్రిషు క్లీబం కోలీమదనయోః ఫలే,

ఫేనిలః—(పు) ౧ అరిష్టపాదపే=కుంకుడుచెట్టు, (త్రి) ౨ సఫేనే=నురుఁగుగలది, (న) 3 కోలీ = రేఁగుఁబండు, ౪ మదనయోఃఫలే=మంగపండు.

బహులా నీలికాయాంస్యా దేలాయాం గవి యోషితి. ౧౧౭. కృత్తికాసుస్త్రియాం భూమ్ని విహాయసి నపుంసకమ్, పుంస్యగ్నౌ కృష్ణపక్షే చ వాచ్యవత్ప్రాజ్య కృష్ణయోః. ౧౧౮

బహులా—(స్త్రీ) ౧ నీలికాయాం = నీలిచెట్టు, ౨ ఏలాయాం = ఏలకితీఁగె, ౩ గవి=ఆవు, (ని. బ.) ౪ కృత్తికాసు = కృత్తికానక్షత్రము, (న) ౫ విహాయసి = ఆకసము, (పు) ౬ అగ్నౌ = నిప్పు, ౭ కృష్ణపక్షే = కృష్ణపక్షము, (త్రి) ౮ ప్రాజ్య=అధికమైనది, ౯ కృష్ణయోః=నల్లనిది.

బరలా బారలా చాపి గంధోలీహంసకాన్తయోః,

బరలా / బారలా —(స్త్రీ) ౧ గంధోలీ = కందిరీఁగ, ౨ హంసకాన్తయోః = ఆఁడుహంస.

బార్దలం దుర్దినే మేలానందాయాం బార్దలః స్మృతః.

బార్దలం—(న) ౧ దుర్దినే = మేఘముచే సూర్యుఁడు కనుఁబడనిరోజు, (పు) ౨ మేలానందాయాం=సిరాబుడ్డి.

మంగలా సితదూర్వాయాముమాయాం పుంసి భూమిజే, నపుంసకన్తు కల్యాణే సర్వార్థరక్షణేఽపి చ. ౧౨౦

మంగలా—(స్త్రీ) ౧ సితదూర్వాయాం = తెల్లగఱిక, ౨ ఉమాయాం=పార్వతీదేవి, (పు) ౩ భూమిజే = అంగారకుఁడు, (న) ౪ కల్యాణే = శుభము, ౫ సర్వార్థరక్షణే = సర్వకార్యరక్షణము, (క్షేమము.)

మండలం పరిధౌ కోఠే దేశే ద్వాదశరాజసు, క్లీబేఽథ నివహే బింబే త్రిషు పుంసి తు కుక్కురే. ౧౨౧

మండలం—(న) ౧ పరిధౌ = పరివేషము, ౨ కోఠే = మండలాకారమైనకుష్ఠవ్యాధి, ౩ దేశే= దేశము, ౪ ద్వాదశరాజసు = పన్నిద్దరురాజులు, (త్రి) ౫ నివహే=గుంపు, ౬ బింబే = సూర్యచంద్రాదులబింబము,(పు) ౭ కుక్కురే =కుక్క.

మంజులం త్రిషు మంజౌ నా జలరంకౌ నపుంసకమ్,

మంజులం—(త్రి) ౧ మంజౌ=మనోహరమైనది, (పు) ౨ జలరంకౌ = కూకుడు

జలాంచలే నికుంజే చ | గుండంగిపిట్ట, (న) 3 జలాంచలే = నీటిపాంచి, ర నికుంజే=పొదరిల్లు.

మహిలా ఫలినీస్త్రియోః. | మహిలా—(స్త్రీ) ౧ ఫలినీ = ప్రేంకణపుం జెట్టు, ౨ స్త్రియోః=స్త్రీ.

మాతులో వ్రీహిభిన్మాతృ భ్రాత్రోశ్చ మదనద్రుమే, ధూస్తూరే | మాతులః— (పు) ౧ వ్రీహిభిద్=పైరు లలోభేదము, ౨ మాతృభ్రాత్రోః = మేనమామ, 3 మదనద్రుమే=మంగ చెట్టు, ర ధూస్తూరే=ఉమ్మెత్తచెట్టు.

మాచలో వందిచౌరే చ గ్రాహరోగయోః. ౧౨3 | మాచలః—(పు) ౧ వంది = స్తుతిపాఠ కుఁడు, ౨ చౌరే = దొంగ, 3 గ్రాహ = మొసలి, ర రోగయోః = రోగము.

ముసలం స్యాదయోగ్రే తు పున్నపుంసకయోః స్త్రియామ్, తాలమూల్యామాఖు పర్ణీగృహగోధికయోరపి. | ముసలం—(పు) ౧ అయోగ్రే=రోఁకలి, (స్త్రీ) ౨ తాలమూల్యాం = నేలతాడి చెట్టు, 3 ఆఖుపర్ణీ = ఏలుకజీడిచెట్టు, ర గృహగోధికయోః=బల్లి.

మృణాలం నలదే క్లీబం పున్నపుంసకయోర్బిసే, | మృణాలం—(న) ౧ నలదే = వట్టివేరు, (పు) ౨ బిసే=తామరతూఁడు.

మేఖలా ఖడ్గబంధే స్యాత్కాఞ్చీశైలనితంబయోః.౧౨౪ | మేఖలా—(స్త్రీ) ౧ ఖడ్గబంధే=ఆయుధము జారకుండుటకై పిడికిగట్టిన త్రాడు, ౨ కాంచీ = మొలనూలు, 3 శైలనితంబయోః = పర్వతమధ్యభాగము.

యమలం యుగలే క్లీబం యమలీ చోటికాద్వయే, | యమలం—(న) ౧ యుగలే = జంట, యమలీ (స్త్రీ) ౨ చోటికాద్వయే = శాటీద్వయము.

రసాలా రసనాదూర్వావిదారీ మార్జితాసు చ. ౧౨౬. రసాలం సిహ్లకే బోలే రసాలశ్చేక్షుచూతయోః, | రసాలా—(స) ౧ రసనా = నాలుక, ౨ దూర్వా=గఱిక, 3 విదారీ=తెల్లనేల గుమ్ముఁడుచెట్టు, ర మార్జితాసు = సంబారువులువేసిపక్వముచేసినపెరుగు, (న) ౫ సిహ్లకే=చిల్లమడ్డి, ౬ బోలే =

బాలింతబోలు, (పు) ౭ ఇక్షు = చెఱకు, ౮ చూతయోః=తీయమామిడి చెట్టు.

రామిలో రమణే కామే

రామిలః—(పు) ౧ రమణే = మనోహరుఁడు, ౨ కామే=మన్మథుఁడు.

లాంగూలం పుచ్ఛశేఫసోః.

లాంగూలం—(న) ౧ పుచ్ఛ=తోఁక, ౨ శేఫసోః=శిశ్నము.

లాంగలీ తోయపిప్పల్యాం క్లీబన్తు కుసుమాన్తరే, గోదారణే తృణరాజగృహదారువిశేషయోః. ౧౨౮

లాంగలీ—(స్త్రీ) ౧ తోయపిప్పల్యాం = నీరుపిప్పలిచెట్టు, (న) ౨ కుసుమాంతరే=పుష్పవిశేషము, 3 గోదారణే=నాఁగలి, ౪ తృణరాజ = తాటిచెట్టు, ౫ గృహదారువిశేషయోః = గృహసంబంధమైన యొకానొకకొయ్య.

లోహలః శృంఖలాచార్యేఽవ్యక్తవాచిని చ త్రిషు,

లోహలః—(పు) ౧ శృంఖలాచార్యే = సంకెళ్లచేతఁ బంధింపఁ బడినవాఁడు, (త్రి) ౨ అవ్యక్తవాచిని=స్పష్టముగా పలుకనివాఁడు.

వంజులః పుంసి తినిశే వేతసాశోకయోరపి. ౧౨౯

వంజులః—(పు) ౧ తినిశే=నెమ్మిచెట్టు, ౨ వేతస=ప్రబ్బలిచెట్టు, 3 అశోకయోః=అశోకచెట్టు.

వంతాలో యుద్ధభేదే చ నౌకాయాం చ ఖనిత్రకే,

వంతాలః—(పు) ౧ యుద్ధభేదే = ఘోరయుద్ధము, ౨ నౌకాయాం=ఓడ, 3 ఖనిత్రకే=గుద్దలి.

వాతూలః పుంసి వాత్యాయాం వాచ్యవన్మారుతాసహే. ౧౩౦

వాతూలః—(పు) ౧ వాత్యాయాం = వాతసమూహము, (త్రి) ౨ మారుతాసహే = వాయువును సయిఁచనివాఁడు.

వామిలో దాంభికే వామే త్రిషు స్యాత్

వామిలః—(త్రి) ౧ దాంభికే = డాంబికముగలది, ౨ వామే = సుందరమైనది.

విమలా త్రియామ్, శాత లాయాం భువో భేదే నిర్మలే త్వభిధేయవత్. ౧౩౧

విమలా—(స్త్రీ) ౧ శాతలాయాం = సంబ రేణిచెట్టు, ౨ భువోభేదే = భూవిశేషము, (త్రి) 3 నిర్మలే = స్వచ్ఛమైనది.

విపులః పృథులేఽగాధే మేరు పశ్చిమభూధరే,

విపులః—(పు) ౧ పృథులే=విశాలమైనది, ౨ అగాధే = లోతైనది, 3 మేరు పశ్చిమభూధరే=విపులపర్వతము.

విదులస్తు పుమానంబువేతసే వేతసేఽపి చ. ౧౩౨

విదులః—(పు) ౧ అంబువేతసే = నీరు ప్రబ్బలిచెట్టు, ౨ వేతసే = ప్రబ్బ చెట్టు.

విడాలో నేత్రపిండే స్యా త్పృషదంశకకే పుమాన్,

విడాలః—(పు) ౧ నేత్రపిండే = నేత్ర రోగము, ౨ పృషదంశకకే = పిల్లి.

విశాలా త్వింద్రవారుణ్యా ముజ్జయిన్యాం తు యోషి తి. ౧౩౩. మృగపక్షిభిదోః పుంసి పృథులే త్వభిధేయ వత్,

విశాలా—(స్త్రీ) ౧ ఇంద్రవారుణ్యాం = పెద్దపాపరచెట్టు, ౨ ఉజ్జయిన్యాం = ఉజ్జయినీపట్టణము, (పు) 3 మృగ = విశేషము, ౪ పక్షిభిదోః = పక్షివిశేషము, (త్రి) ౫ పృథులే = విరివి యైనది.

వృషలో గృంజనే శూద్రే చంద్రగుప్తే చ రాజని.

వృషలః—(పు) ౧ గృంజనే=వెల్లుల్లిగడ్డ, ౨ శూద్రే=శూద్రుఁడు, 3 చంద్ర గుప్తేరాజని = చంద్రగుప్తుఁడను రాజు.

శకలం త్వచి ఖండే స్యాద్రా గవస్తుని వల్కలే,

శకలం—(న) ౧ త్వచి = చర్మము, ౨ ఖండే = ముక్క. 3 రాగవస్తుని = రాగద్రవ్యము ౪ వల్కలే = నార చీర.

శంబలోఽస్త్రీ సంబలవత్కూ లపాథేయమత్సరే. ౧౩౪

శంబలః—(పు) (సంబలశబ్దమువలె) ౧ కూల=ఒడ్డు, ౨ పాథేయ=బత్తెము, 3 మత్సరే=ద్వేషము.

శయాలుస్స్యాదజగరే నిద్రా శీలే చ కుక్కురే,

శయాలుః—(పు) ౧ అజగరే = పెనుబాము, ౨ నిద్రాశీలే = నిదురించు స్వభావముకలవాఁడు, 3 కుక్కురే= కుక్క.

శ్రద్ధాలుర్దోహదిన్యాం స్త్రీ శ్రద్ధాయుక్తే తు వాచ్యవత్.

శ్రద్ధాలుః— (స్త్రీ) ౧ దోహదిన్యాం = వేవిళ్లుగలయాఁడుది, (త్రి) ౨ శ్రద్ధాయుక్తే= శ్రద్ధకలవాఁడు.

శ్యామలః పిప్పలే కృష్ణే

శ్యామలః—(పు) ౧ పిప్పలే= రావిచెట్టు, ౨ కృష్ణే=నలుపు.

శార్దూలో రాక్షసాంతరే, వ్యాఘ్రే చ పశుభేదే చ సత్తమే తూత్తరస్థితః. ౧3౭

శార్దూలః—(పు) ౧ రాక్షసాంతరే = రాక్షసవిశేషము, ౨ వ్యాఘ్రే=పులి, 3 పశుభేదే = శరభమృగము, ౪ (ఉత్తరస్థితః = ఉత్తరపదమైనపుడు) సత్తమే=శ్రేష్ఠము.

శాల్మలిస్తరుభేదే స్యాద్ద్వీపభేదేఽపి చ ద్వయోః,

శాల్మలిః—(స్త్రీ) ౧ తరుభేదే = బూరుగుచెట్టు, ౨ ద్వీపభేదే=శాల్మలిద్వీపము.

శ్రీఫలః పుంసి మాలూరే ధాత్రీనీలికయోః స్త్రియాం.

శ్రీఫలః—(పు) ౧ మాలూరే=మారేడుచెట్టు, (స్త్రీ) ౨ ధాత్రీ = ఉసిరికచెట్టు, 3 నీలికయోః=నీలిచెట్టు.

శైవలం స్యాచ్చ శైవాలే శైలేయే చ నపుంసకమ్,

శైవలం—(న) ౧ శైవాలే = నాఁచు, ౨ శైలేయే=జాతిపువ్వు.

శీతలం పుష్పకాసీసే శైలజే మలయోద్భవే. ౧3౯. పుమానసనపర్ణ్యాం స్యాచ్ఛిశిరే వాచ్యలింగకమ్,

శీతలం—(న) ౧ పుష్పకాసీసే = పర్వతధాతువిశేషము, ౨ శైలజే = జాతిపువ్వు, 3 మలయోద్భవే = మంచిగంధము, (పు) ౪ అసనపర్ణ్యాం = సోమిదముచెట్టు, (త్రి) ౫ శిశిరే = చల్లనిది.

శృగాలో వంచకే దైత్యభేదే నా డమరే స్త్రియాం.

శృగాలః—(పు) ౧ వంచకే = నక్క, ౨ దైత్యభేదే=రాక్షసవిశేషము, (స్త్రీ) 3 డమరే= దేశోపద్రవము.

| | |
|---|---|
| శృంఖలాపుంస్కటీవస్త్ర బంధే చ నిగడే త్రిషు, | శృంఖలా—(స్త్రీ) ౧ పుంస్కటీవస్త్రబంధే = పురుషుని మొలత్రాడు, (త్రి) ౨ నిగడే= సంకెల. |
| శైవలం పద్మకాష్ఠే స్యాచ్ఛైవాలేఽపి పుమానయం. | శైవలం—(న) ౧ పద్మకాష్ఠే = పద్మకాష్ఠపుఁజెట్టు, (పు) ౨ శైవాలే = నాఁచు. |
| శౌష్కల శ్శుష్కమాంసస్య పణకే పిశితాశిని, | శౌష్కలః—(పు) ౧ శుష్కమాంసస్య పణకే = ఎండుమాంసమునమ్మువాఁడు, ౨ పిశితాశిని=శౌష్కలుఁడు. |
| షండాలీ తైలమానే చ సరసీకాముకస్త్రియోః. ౧౪౨ | షండాలీ —(స్త్రీ) ౧ తైలమానే = నూనెకొలఁత, ౨ సరసీ= సరస్సు, 3 కాముకస్త్రియోః = కామముగలయాఁడుది. |
| సరలః పూతికాష్ఠే నాఽథో దారావక్రయోస్త్రిషు, | సరలః—(పు) ౧ పూతికాష్ఠే= దేవదారుచెట్టు, (త్రి) ౨ ఉదార=ఔదార్యముగలది, 3 అవక్రయోః=కుటిలత్వములేనిది. |
| సంకులం త్రిషు విస్పష్టవాచి వ్యాప్తేఽ | సంకులం—(త్రి) ౧ విస్పష్టవాచి=స్పష్టముకానివాక్కు, ౨ వ్యాప్తే=వ్యాపించునది. |
| థ సప్తలా. ౧౪3. నవమాలీ చర్మకషాగుంజాసు పాటలా స్త్రియామ్, | సప్తలా—(స్త్రీ) ౧ నవమాలీ = విరజాజితీఁగ, ౨ చర్మకషా=సంబరేణుచెట్టు, 3 గుంజాసు=గురివెందచెట్టు, ౪ పాటలా=కలిగొట్టుచెట్టు. |
| సంధిలా తు సురుంగాయాం నదీమదిరయోః స్త్రియాం. | సంధిలా—(స్త్రీ) ౧ సురుంగాయాం = కన్నము, ౨ నదీ = ఏఱు, 3 మదిరయోః=మద్యము. |
| సిధ్మలా మత్స్యవికృతౌ వాచ్యవత్తు కిలాసిని, | సిధ్మలా—(స్త్రీ) ౧ మత్స్యవికృతౌ=ఉప్పుఁజేప, (త్రి) ౨ కిలాసిని=ఒకవిధమగుపొడలు (సిబ్బెము) గలది. |

సువేలః ప్రణతే శాంతే త్రిషు నా పర్వతాంతరే. ౧౪౫

సువేలః—(త్రి) ౧ ప్రణతే = నమ్రుఁడు, ౨ శాంతే = శాంతమైనది, (పు) 3 పర్వతాంతరే = సువేలయను పర్వతము.

సుతలోఽట్టాలికాబంధ నాగలోకప్రభేదయోః,

సుతలః—(పు) ౧ అట్టాలికాబంధ=కోట ద్వారముమీఁదియిల్లు, ౨ నాగలోకప్రభేదయోః=సుతలలోకము.

హింగులో వర్ణకద్రవ్యే నా భంటాక్యాం తు హింగులీ.

హింగులః—(పు) ౧ వర్ణకద్రవ్యే=ఇంగిలీకము,హింగులీ (స్త్రీ) ౨ భంటాక్యాం =ములకచెట్టు,

హేమలః స్వర్ణకారే స్యాత్కృకలాసే శిలాంతరే,

హేమలః—(పు) ౧ స్వర్ణకారే=కంసాలివాఁడు, ౨ కృకలాసే = తొండ, 3 శిలాన్తరే=పాషాణవిశేషము.

## ల చతుష్కం.

నాలుగక్షరములుగల లకారాంత శబ్దములు.

అక్షమాలాఽక్షసూత్రే స్యాదరుంధత్యామపి స్త్రియాం.

అక్షమాలా—(స్త్రీ) ౧ అక్షసూత్రే = జపమాల, ౨ అరుంధత్యాం = అరుంధతీదేవి.

అంకపాలీ పరీరంభే ధాత్రీవేదికయోః స్త్రియాం,

అంకపాలీ—(స్త్రీ) ౧ పరీరంభే = కౌఁగిలి, ౨ ధాత్రీ=దాది, 3 వేదికయోః = అరుఁగు.

అథాతిబలః ప్రబలే త్రిషు స్త్రీ త్వోషధీభిది. ౧౪౬

అతిబలః—(త్రి) ౧ ప్రబలే = మిక్కిలి బలముగలది, (స్త్రీ) ౨ ఓషధీభిది=ముత్తవపులగచెట్టు.

ఉదూఖలం గుగ్గులౌ స్యాదులూఖలేఽపి న ద్వయోః,

ఉదూఖలం—(న) ౧ గుగ్గులౌ=గుగ్గిలపుఁజెట్టు, ౨ ఉలూఖలే=ఱోలు.

ఏకాష్ఠీలా వనతిక్తికౌషధౌ పుంసి బకపుష్పే చ. ౧౪౭

ఏకాష్ఠీలా—(స్త్రీ) ౧ వనతిక్తికౌషధౌ = చిఱుబొద్ది, (పు) ౨ బకపుష్పే = బకపుష్పముచెట్టు.

| | |
|---|---|
| కలకల ఉక్తః కోలాహలే తథా సాలనిర్యాసే, | కలకలః—(పు) ౧ కోలాహలే = కలకల ధ్వని, ౨ సాలనిర్యాసే=మద్దిబంక. |
| అథ కర్మఫలం కర్మరంగకర్మ విపాకయోః. ౧౫౦ | కర్మఫలం—(న) ౧ కర్మరంగ = కర్మరంగ ఫలము, ౨ కర్మవిపాకయోః = పూర్వ జన్మమునఁ జేసిపుణ్యఫలములు. |
| కందరాలః పుమాన్గర్దభాండే ప్లక్షతరావపి, | కందరాలః—(పు) ౧ గర్ధభాండే = కల జువ్విచెట్టు, ౨ ప్లక్షతరౌ=జువ్విచెట్టు. |
| కమండలుస్స్యాత్కరకే న స్త్రీ నా ప్లక్షపాదపే. ౧౫౧ | కమండలుః—(ప్న) ౧ కరకే = సన్న్యాసు లుంచుకొనుపాత్ర, (పు) ౨ ప్లక్షపా దపే=జువ్విచెట్టు. |
| కుతూహలం కౌతుకే స్యాత్ప్రశస్తేఽపి చ దృశ్యతే, | కుతూహలం—(న) ౧ కౌతుకే = సంతో షము, ౨ ప్రశస్తే=శ్రేష్ఠము. |
| ఖతమాలస్తు పుంలింగో ధూమేఽపి చ వలాహకే. ౧౫౨ | ఖతమాలః—(పు) ౧ ధూమే=పొగ, ౨ వలాహకే= మేఘము. |
| గండశైలో లలాటే స్యాచ్చ్యుతస్థూలోపలే గిరేః, | గండశైలః—(పు) ౧ లలాటే = నుదురు, ౨ గిరేశ్చ్యుతస్థూలోపలే=కొండనుండి జారినపెద్దఱాయి. |
| గంధఫల్యపి గుండ్రాయాం చంపకస్య చ కోరకే. ౧౫౩ | గంధఫలీ—(స్త్రీ) ౧ గుండ్రాయాం=ప్రేంక ణపుఁజెట్టు, ౨ చంపకస్యకోరకే = సం పఁగిమొగ్గ. |
| చక్రవాలోఽద్రిభేదే స్యాచ్చక్రవాలం తు మండలే, | చక్రవాలః—(పు) ౧ అద్రిభేదే = చక్ర వాలపర్వతము, (న) ౨ మండలే = గుంపు. |
| జలాంచలం స్వతోవారినిర్గమే శైవలేఽపి చ. ౧౫౪ | జలాంచలం—(న) ౧ స్వతోవారినిర్గమే= తూము, ౨ శైవలే=నాఁచు. |
| దలామలం మరువకే దమనే ఽపి నపుంసకమ్, | దలామలం—(న) ౧ మరువకే=మరువము, ౨ దమనే=దవనము. |
| ధ్వనినాలా తు వీణాయాం వేణుకాహలయోరపి. | ధ్వనినాలా—(స్త్రీ) ౧ వీణాయాం=వీణె ౨ వేణు=వెదురు, ౩ కాహలయోః = వాద్యవిశేషము. |

